# గ్రంథాలయ ప్రగతి

## [మూడవ భాగము]

జిల్లా, తాలూకా మహాసభల అధ్యక్షోపన్యాసములు, తీర్మానములు వగైరా

సంపాదకుడు :-

పాతూరి నాగభూషణం, డి. యల్. యస్సి.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము

పటమట :: విజయవాడ - 6

1964

వాయు వెల్లవారికి నెట్లు స్వాధీనమై యున్నదో
జ్ఞానముకూడ నట్లు స్వాధీనము కావలయును.

ఉదక మెల్లవారికి నెట్లు సేవ్యమై యున్నదో
జ్ఞానమును నట్లు సేవ్యమై యుండవలెను.

సూర్యచంద్ర మండలముల తేజస్సు
ఎల్లవారికి నెట్లు సౌఖ్యప్రదముగ నున్నదో
జ్ఞానమును నట్లు సౌఖ్యప్రదముగ నుండవలయును.

# పీఠిక

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయసంఘపు స్వర్ణోత్సవ ప్రచురణలలో ఇది రెండవది. దీని మొదటి ప్రచురణ 1962 వ సంవత్సరాంతమున వెలువడినది. 1963 ఏప్రిల్‌లో యీ ఉత్సవ కార్యక్రమాన్ని ప్రారంభించుటకు సంకల్పించుకొని, ఆనాటికి ఈగ్రంథము 3 భాగములను వెలువరచు ఉద్దేశముతో మొదటిభాగమును ముందేప్రకటించుట జరిగినది. రెండవ భాగములో ప్రచురించనెంచిన ఉపన్యాసాదులు పూర్తిగ మాకులభించలేదు, కనుక ముందు మూడవభాగపు ప్రచురణకు పూనుకొనుట సంభవించినది. ఈగ్రంథపు మొదటి రెండుభాగములలోను ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల అధ్యక్షుల ప్రసంగములను, తీర్మానములను మాకుదొరకినవరకు ప్రచురించియున్నాము. ఈభాగములో జిల్లా, తాలూకా మహాసభల అధ్యక్షోపన్యాసములు, తీర్మానములు ఇవ్వబడినవి. స్థలాభావముచే అన్ని జిల్లా, తాలూకా సభల అధ్యక్షుల ప్రసంగాలను చేర్చలేదు. వీలైనంతవరకు అన్నిజిల్లాలకు ప్రాతినిధ్య ముండవలెనన్న సంకల్పముతో ఒక్కొక్క జిల్లాకు కనీసమొక సభాధ్యక్షుని ప్రసంగమును మాకు లభించినవానినుండి యెన్నుకొని దీనిలో చేర్చినాము. ఒకటిరెండు తాలూకామహాసభల అధ్యక్షుల ప్రసంగములనుకూడ సేకరించినాము.

రాష్ట్రవ్యాప్తంగా ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము మహాసభల నిర్వహణమునకు పూనినట్లే ఒక్కొక్కజిల్లాలో అచ్చటి జిల్లా గ్రంథాలయ సంఘమును, తాలూకా గ్రంథాలయ మహాసభలను ఆయా తాలూకా గ్రంథాలయ సంఘములును నిర్వహించినవి. ఈ జిల్లా, తాలూకా గ్రంథాలయ సంఘములన్నియు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమున కనుబంధములుగ నడచినవి. ఈసంఘములు గుంటూరు, కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాలలో హెచ్చుగ పనిచేసినవి. వీని కార్యక్రమ వివరములు స్వర్ణోత్సవ సందర్భమున మేము వెలువరించనున్న ఆంధ్ర గ్రంథాలయోద్యమ చరిత్రలో చేర్చబడునుగనుక దీని ప్రస్తావన నిందులో వదలినాము.

జిల్లాలలోను, తాలూకాలలోను నడచిన కార్యక్రమాదులను స్థాలీపులాక న్యాయమున గ్రహించుట కనువుగ ఒక జిల్లా మహాసభయొక్కయు, ఒక తాలూకా మహాసభయొక్కయు సంగ్రహ వృత్తాంతములను, ఒక జిల్లా సంఘముయొక్కయు, ఒక తాలూకా సంఘముయొక్కయు నిర్మాణ నిబంధనలను, జిల్లా మహాసభలలోను, తాలూకా మహాసభలలోను గావింపబడిన ముఖ్యమగు కొన్ని తీర్మానములను అనుబంధములలో ఇచ్చియున్నాము. ఈ వివరములు నేటి మన గ్రంథాలయ కార్యకర్తలను కొంత ఉత్తేజమును కలుగజేయగలవని నమ్ముచున్నాము.

## అంకితము

ఆంధ్ర గ్రంథాలయోద్యమమునకు మూలపురుషులగు పెద్దలకు దీని మొదటి భాగము నంకితమిచ్చినాము. రెండవ భాగమును గ్రంథాలయ క్షేత్రములో ప్రముఖులును ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘములో ప్రధాన పాత్రధారులును నగు శ్రీ మారేపల్లి రామచంద్రకవిగారికంకితమివ్వదలచినాము ఆదర్శ గ్రంథమండలిని స్థాపించి, వందలాది ఉత్తమ గ్రంథములను తెలుగు భాషామతల్లికి సమర్పించినట్టియు, స్వగ్రామములో చక్కని గ్రంథాలయము నొక దానిని నెలకొల్పి దాని అభివృద్ధికి నిరంతరాయముగ కృషి చేసినట్టియు, కృష్ణాజిల్లాలోని గ్రంథాలయోద్యమమునకు మొదటి నుండియు అండగనుండి ఇటీవలనే ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము కోశాధిపతి పదవిని స్వీకరించి దీని అభివృద్ధికై కృషినిసల్పుటకు సంకల్పించుకొన్నంతలో దైవయోగమున అకాల మరణమునకు గురియై మాకు దూరమైన మిత్రులు కీ. శే. శ్రీ గద్దెలింగయ్యగారికి ఈ భాగమును అంకితమిచ్చుచున్నాము.

## కృతజ్ఞత

ఈ గ్రంథ నిర్మాణములో మాకు తోడుపడిన సాధనముల వివరములాయా ఉపన్యాసముల చివర నిచ్చియున్నాము. వీని నెక్కువగ గ్రంథాలయ సర్వస్వము సంపుటములనుండి సేకరించినాము. కొంచెముగ శ్రీ యాతగిరి లక్ష్మీవెంకటరమణగారి ధర్మగ్రంథాలయ పత్రికయు, ఆంధ్ర

దినపత్రికయు మాకు సాయపడినవి. కనుక వీని సంపాదకులకు ముందుగ మా కృతజ్ఞతను తెలుపుకొనవలసియున్నది. శ్రీ లింగయ్యగారి కర్మ సమయమున వారి బంధుమిత్రులు కొందరిని దీని ప్రచురణకు సాయపడ గోరినాము. వారును సుముఖతను వెల్లడించినారు. దీనికగు ఖర్చును చాలవరకు వారు పూరింతురను విశ్వాసము మాకున్నది. వీరిలో ముఖ్యులు వారి ఆప్త మిత్రులు శ్రీ పిడికిటి మాధవరావుగారు, వారి అన్న శ్రీ గద్దె పిచ్చయ్యగారు, కుమారుడు శ్రీ విజయకుమార్ సింహాగారు, అల్లుళ్ళు శ్రీయుతులు కె. రాధా కృష్ణమూర్తి, పిడికిటి రామకోటేశ్వరరావుగార్లు. వీరితోపాటు అనుబంధము ౭ లోని సమాచారమును, ఇందు ప్రచురించిన ఛాయాచిత్రములను సేకరించుటలో మాకు తోడ్పడిన వ్యక్తులు శ్రీయుతులు పురిపండా అప్పలస్వామి, ప్రభల సూర్యనారాయణ (విశాఖపట్నం), విస్సా అప్పారావు (కాకినాడ), నాగళ్ళ గురుప్రసాదరావు (విజయవాడ), కేశిరాజు వెంకటనృసింహప్పారావు (కొవ్వూరు), తల్లాప్రగడ గోపాలరావు (నిడదవోలు), మందలపర్తి ఉపేంద్రశర్మ (గుంటూరు), మేకా రామకృష్ణయ్య (కూచిపూడి), పెండ్యాల జగన్నాథం (నరసరావుపేట), కలిదిండి నరసింహరాజు (భీమవరం) గార్లకు, తెలుగు భాషాసమితి – మదరాసు వారికి కూడ మా కృతజ్ఞతను తెలుపుకొనవలసియున్నది. తర్వాత మేము కృతజ్ఞత చెప్పుకోవలసినవారు మా ముద్రాపకులు సర్వోదయప్రెస్, పటమటలంకవారు; సంఘ స్వర్ణోత్సవ శుభసమయమున దీని నావిష్కరించిన గ్రంథాలయ బంధువు, ఆంధ్రప్రదేశ్ పరిశ్రమల మంత్రి డాక్టరు యం. యస్. లక్ష్మీనరసయ్యగారు.

పాతూరి నాగభూషణం
కార్యదర్శి
ఆం. ప్ర. గ్రం. సంఘము

శ్రీ సర్వోత్తమ భవనము
విజయవాడ–6
27 – 4 – 1964

# విషయ సూచిక

## ౧. ఉపన్యాసములు



## ౨. అనుబంధములు

# పటముల పట్టిక

# సవరణల పట్టిక

[పుస్తకమును చదువుటకు ముందే దిగువ సూచించిన సవరణలను చదువరులు ఆయా పుటలందు సరిచేసుకొనదగును.]

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| viii | 1 | షాలీపు | స్థాలీ పు |
| | 7 | కార్యకర్తలను | కార్యకర్తలకు |
| | 19 | సల్పుటకు | సల్పుటకు |
| ౨ | 6 | నాజ్ఞాత్మకంబగు | జ్ఞానాత్మకంబగు |
| | 18 | వర్తనకామాలమున | వర్తమానకాలమున |
| 3 | 25 | ప్రాధానోపాధ్యాయుడు | ప్రధానోపాధ్యాయుడు |
| ౧౧ | 24 | బాషా | భాషా |
| ౧౯ | 27 | సంన్కృత | సంస్కృత |
| ౨౬ | 9 | గ్రంథాలయముం | గ్రంథాలయముల |
| ౨౯ | 26 | సంస్తనీ | సంస్తవనీ |
| 3౨ | 15 | స్వాతంత్రము | స్వాతంత్ర్యము |
| 33 | 26 | విశ్వ విదా | విశ్వవిద్యా |
| 3౪ | 15 | అమెరికాదేశము | అమెరికాదేశమున |
| 3౭ | 22 | రవీంద్రున | రవీంద్రుని |
| ౪౦ | 17 | నంప్రదాయము | సంప్రదాయము |
| ౪౨ | 25 | విజ్ఞానలేశముల్ను వో | విజ్ఞానలేశములున్న వో |
| ౪౯ | 23 | ఏకాంచమైన | ఏకాంచెమైన |
| ౬౧ | 25 | తెలవితేటల | తెలివితేటల |
| ౬౯ | 27 | పటు | పట్టు |
| ౭౦ | 26 | జానవంతులమును, | జ్ఞానవంతులమును |
| ౮౮ | 28 | కూడ ద్దేశము | కూడ నిదేయుద్దేశము |
| ౯౫ | 18 | books") | books" |
| | 24 | ద్దమే | శబ్దమే |
| ౧౦౧ | 26 | నిష్పట్టి | నిష్పటి |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౨౭ | 9 | యము, లు | యములు, |
| | 19 | - 1934 జూన్ | - 1933 మే |
| ౧౩౧ | 26 | జ్ఞాసంపద | జ్ఞానసంపద |
| ౧౩౫ | 21 | జానోదయ | జ్ఞానోదయ |
| ౧౩౭ | ,, | సానుర్థ్యము | సామర్థ్యము |
| ౧౩౯ | 27 | 4వ సంచిక 1వ | 4వ |
| ౧౪౯ | 23 | ఈసానిక | ఈ స్థానిక |
| ౧౪౭ | 18 | గంథసంఖ్య | గ్రంథసంఖ్య |
| ౧౫౩ | 31 | పుష్పమాలాకృతుల | పుష్పమాలాలంకృతుల |
| ౧౫౪ | 7 | పుష్పమాలాలంక | పుష్పమాలాలంకృ |
| ౧౫౬ | 29 | ఖర్చులతోనే | ఖర్చులతోనే |
| ౧౫౭ | 5 | రిజిస్ట్రర్ల | రిజిస్ట్రర్లు,, |
| | | పరిపాలనమునుండి | పరిపాలనమును గురించి |
| | 27 | చేసిస | చేసిన |
| ౧౬౦ | 15 | మండలమునండ | మండలమునం |
| ౧౬౬ | 22 | యధినమున | యధీనమున |
| ౧౬౮ | 10 | మున్నిసాలిటీలును | మున్నిపాలిటీలును |
| ౧౬౯ | 23 | శ్ర ధపుట్టి | శ్రద్ధపుట్టి |
| ఫారంనంబరు | | (2) | (22) |
| ౧౭౧ | 26 | పురాణపత్రిక | పురాణ, పత్రిక |
| ౧౭౩ | 9 | వ్యాపించచేయుటకు | వ్యాపింపజేయుటకు |
| ౧౭౮ | 12 | ఆట్లు | అట్లు |
| ౧౭౯ | 8 | ప్రతినిధుల | ప్రతినిధుల |
| ౧౮౮ | 31 | స్కర్త | సంస్కర్త |
| ౧౩౨ | 20 | హిందూసుందరులు | ప్రాచీనహిందూసుందరీమణులు |

## ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము

# స్వర్ణోత్సవ ప్రచురణలు

### ౧. గ్రంథాలయ ప్రగతి - మొదటి భాగము

దీనిలో 1914_1926 సం॥ మధ్య జరిగిన మొదటి 10 ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల అధ్యక్షోపన్యాసములు, తీర్మానములు, సంగ్రహ వృత్తాంతములు వగైరా గలవు.

⅛ డెమ్మీ XVI+189 పుటలు. వెల సాదాప్రతి రు 4.00
బైండుప్రతి రు 5.00

### ౨. గ్రంథాలయ ప్రగతి - రెండవ భాగము

దీనిలో 1927_42 సం॥ ల మధ్య జరిగిన ఆం. దే. గ్రం. మహాసభల అధ్యక్షాది ఉపన్యాసములు, తీర్మానములు, సంగ్రహ వృత్తాంతములు వగైరా ఉండును.

### ౩. గ్రంథాలయ ప్రగతి - మూడవ భాగము

దీనిలో గ్రంథాలయోద్య మారంభ దినములలో మొదటి 2 దశాబ్దముల లోపల జరిగిన కొన్ని ప్రాంతీయ జిల్లా, తాలూకా గ్రంథాలయ మహాసభల అధ్యక్షాది ఉపన్యాసములు, ముఖ్య తీర్మానములు వగైరా ఉన్నవి.

⅛ డెమ్మీ X1V+196 పుటలు. వెల సాదాప్రతి రు 4.00
బైండుప్రతి రు 5.00

### ౪. ఆంధ్ర గ్రంథాలయోద్యమ చరిత్ర

1. ఆంధ్రదేశంలో ప్రాచీన గ్రంథాలయాలు
2, ఆధునిక పౌరగ్రంథాలయాల పుట్టుక, వ్యాప్తి; వీనికి దోహద మిచ్చిన ఇతర ఉద్యమాలు, వ్యక్తులు, ప్రచురణ సంస్థలు.

3. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము– పుట్టుక, వ్యాప్తి: వివిధ కార్యకలాపాలు, అనుబంధ సంస్థలు.
4. గ్రంథాలయాల రకములు
5. గ్రంథాలయాల వ్యక్తిగత కార్యకలాపాలు, ప్రముఖ గ్రంథాలయాల వివరాలు.
6. వయోజన విద్య – గ్రంథాలయాలు
7. గ్రంథాలయ శాసనం
8. తెలంగాణాలో గ్రంథాలయోద్యమం
9. వివిధ జిల్లాలలో గ్రంథాలయోద్యమం
10. భారత గ్రంథాలయోద్యమంలో ఆంధ్ర గ్రంథాలయోద్యమ పాత్ర, ఉద్యమంలో పనిచేసిన పెద్దలు, ప్రముఖ కార్యకర్తలు, గ్రంథాలయ దాతలు.
11. ఉపసంహారము – సాధించిన విజయాలు, ముందు జరుగవలసిన పనులు.

పైన పేర్కొన్న శీర్షికల క్రింద 11 అధ్యాయములతో క్ర డెమ్మీసైజులో వెలువడును.

## ౫. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము స్వర్ణోత్సవ సంచిక

## నిజాంరాష్ట్రాంధ్ర గ్రంథాలయ సభ. మధిర

[ 1925 ఫిబ్రవరి 22 ]

### శ్రీ పింగళి వెంకటరామరెడ్డి దేశముఖు

ఆంధ్రజాతి మిక్కిలి ప్రాచీనమైనది. ఆంధ్రులకు నిజాం రాష్ట్రమే జన్మస్థానమని చరిత్ర పరిశోధకులు నిశ్చయించుచున్నారు. మన రాష్ట్రములో ఆంధ్రము మాతృభాషగా గలవారి సంఖ్య 64 లక్షలు. మొత్తము జనసంఖ్యలో ఆంధ్రులు సగభాగమునకంటె నెక్కువగ నున్నారు. వైశాల్యమునందుగూడ తెలంగాణాయని వ్యవహరింపబడు ఆంధ్రభాగము సగముకంటె నెక్కువగ నున్నది. ఈ రాష్ట్రములో ముఖ్యముగ వాడబడు ఉరుదు, తెలుగు, మహారాష్ట్రము, కన్నడము అను నాలుగు దేశభాషలలో తెలుగుభాషకే ప్రాధాన్య మివ్వవచ్చునని తేలుచున్నది. మాధుర్యమునందును, వాఙ్మయ వికాసమునందును, భాషాసౌష్ఠవమునందును, అక్షర రమ్యత యందును ఆంధ్రభాషయే ఇతర భాషలకంటె మిన్న యనిపించుకొనినది. ఇది కేవలము మన మభిమానముతో జెప్పుకొను విషయముగాదు. ఇతర దేశస్థులు సహితము దీనిని "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్టు" అని పొగడియున్నారు. ఇట్టి మృదు మధురమైన మన మాతృభాష మన రాష్ట్రమునందు అన్యభాషా పద సమ్మిళితమై కడు శోచనీయంబగు దుస్థితి యందున్నది. ఇప్పుడిప్పుడే జన సామాన్యమునందు మాతృభాషాభిమాన మంకురించినది. మన మందరము దాని యభివృద్ధికై నిరంతర కృషి సలుపవలసి యున్నది. భాషాభివృద్ధికిని, విజ్ఞాన ప్రసారమునకును అనేక సాధనములుగలవు. వీనిలో గ్రంథపఠనము మిక్కిలి శ్రేష్ఠమైనది. గ్రంథములను గురించి 500 సంవత్సరములకు పూర్వమున నొక పాశ్చాత్యకవి ఈ దిగువ వ్రాయబడిన ప్రకారము నుడివి యున్నాడు:-

"కొట్టు తిట్టులు లేకుండ, కోపతాపములు లేకుండ, డబ్బు దస్కము గైకొనక బోధించు నుపాధ్యాయులు పుస్తకములే. వాని సన్నిధికి బోయినచో నవి నిద్రించు చుండవు. గహన విషయమును గురించి ప్రశ్నించినచో నవి యేమియుదాచవు. వానిని గూర్చి దురభిప్రాయ పడినచో నవి యెన్నడును సణుగుకొనవు. అవివేకుల జూచి అవి పరిహసించవు." కావున నాజ్ఞాత్మకంబగు గ్రంథ సముదాయము అన్ని విధములైన భాగ్యములకంటె మిన్నయని భావించవలెను. సత్యపథానువర్తియై, సుఖియై, వివేకియై, శాస్త్రజ్ఞుడై, భక్తిపరుడై యుండగోరెడు ప్రతి మనుజుడు తప్పక గ్రంథాభిలాషియై యుండవలెను.

పూర్వకాలమున లిపి యేర్పడుటకు మునుపు మన ఋషులు విజ్ఞానమును ఆరువేల సంవత్సరముల వరకు గాపాడిరి. వేదకాలము నాటినుండి ఇప్పటివరకు వేద పన్నముల సంత తండ్రి కొడుకునకు జెప్పుచున్నాడు. లిపి యేర్పడిన తరువాత మన పూర్వులు తాటాకులపైనను, కొయ్యలపైనను, రాగిరేకులపైనను, శిలలపైనను వ్రాయుచుండిరి. కనుక పూర్వపు విజ్ఞానమును మనము దెలిసికొన గోరినచో నిట్టివి వీలగునంతవరకు సేకరింప బడవలయును.

వర్తనకామాలమున ముద్రణాయంత్రముల సహాయమున మన కెట్టి యిబ్బందులు లేక గ్రంథములు లభించు చున్నవి. ఇట్టి యవకాశమును బోగొట్టుకొనక గ్రంథ సముదాయమును ప్రతి గ్రామము నందు ప్రోగుచేయుటయు, దాని ద్వారా జనసామాన్యము లాభమును బొందునటుల జేయుటయు మన విధియైయున్నది. భాషాభివృద్ధి, విజ్ఞాన ప్రసారమునకేగాక ప్రజలలో అన్యోన్య సహకారమును, స్నేహభావమును గలిగించుటకు గ్రంథాలయములు సాధన భూతములగును.

దేవాలయము లందు ధనాఢ్యులును, బీదవారును ఎట్టి భక్తి విశ్వాసములను జూపుచున్నారో సరస్వతీ ఆలయములనందగు నీ గ్రం

థాలయముల పట్ల సహితము ప్రజలు సమానమైన ఆదరణమును జూపవలెను. దేవాలయము లేని గ్రామము నివాసయోగ్యముకాదన్న భావము మనవారి యందు వ్యాపించి యున్నది. ఇట్లే గ్రంథాలయముల యావశ్యకతను గూడ గమనించి ప్రతి గ్రామమునందు గ్రంథాలయమును స్థాపించు యత్నములు చేయబడవలెను. ఇట్టి జ్ఞానజ్యోతులు ఎన్నియున్నను చాలవు.

అమెరికా గ్రంథాలయోద్యమ నాయకుడగు డాక్టర్ మెల్విల్ డ్యూయీగారు గ్రంథాలయముల అవసరము గురించి ఇట్లు అభిప్రాయ మిచ్చియున్నారు:-

"ప్రతి మనుజునికి బాల్యదశయందు పాఠశాల మూలమునను, పెద్దవాడైన పిమ్మట ధర్మగ్రంథాలయ మూలమునను ప్రభుత్వము వారు విద్యగరపుట విధియై యున్నది. విధియేగాక పరిపాలనా సౌకర్యము కొరకును, రాష్ట్ర సురక్షితమునకును మిక్కిలి యవసరము."

స్వదేశ సంస్థానములలో నీ విషయమున మిక్కిలి శ్రద్ధ వహించినది బరోడా రాష్ట్రాధిపతియగు శ్రీ శాయాజీ గయిక్వారు మహారాజుగారే. గ్రంథాలయోద్యమ మచ్చట దినదినాభివృద్ధి గాంచి ప్రజలను విజ్ఞానవంతులనుగ నొనర్చుట కెంతయో సహకారి యయినది. ఆరంభ దశయందు గ్రామవాసులు గ్రంథాలయ స్థాపనోద్దేశముతో 25 రూపాయల విరాళములు ప్రోగుచేసినచో బరోడా ప్రభుత్వము వారు 100 రూప్యముల వెలగల దేశభాషా గ్రంథముల నొసంగి ప్రోత్సహించిరి. పఠన మందిరములకు ప్రతి సంవత్సరము 24 రూపాయల చొప్పున విరాళము లేర్పాటు చేయబడెను. బరోడా ప్రభుత్వమువారిచే ప్రకటింపబడు గ్రంథము లన్నియు నుచితముగ నా రాష్ట్రములోని గ్రంథాలయముల కన్నింటికి నొసగబడుచుండెను. పాఠశాలా ప్రధానోపాధ్యాయుడు గ్రంథాలయమును నడుపు భారమును వహించవలెననియు, జిల్లా, తాలూకా బోర్డులు వీనిని కనిపెట్టుచుండ వలెననియు కట్టుదిట్టము లేర్పడెను. ఇవ్విధం

బున గ్రంథాలయోద్యమ నిర్మాణ కార్యక్రమమునందు బరోడా ప్రభుత్వమువారు అత్యంత శ్రద్ధ వహించి తోడ్పడిరి. ప్రతి సంవత్సరము గ్రంథాలయ భవన నిర్మాణమునకును, గ్రంథదానమునకును 20 వేల రూప్యములు వ్యయము చేయబడుచుండెను. 1919 వ సంవత్సరాంతమున బరోడారాష్ట్రమంతటను 642 గ్రంథాలయములు వెలసినవి. ఇవిగాక సంచార గ్రంథాలయముల మూలమున గ్రామముల లోని ప్రజలయందు గ్రంథ పఠనాభిలాషను గలిగించి ప్రత్యేకముగ కృషి సలుపబడెను. సంచార గ్రంథాలయముల సంఖ్య 450 వరకుండెను. ఈ విషయమున ప్రభుత్వమువారు దయచేసిన విరాళము ఆరు వేలు.

మైసూరు ప్రభుత్వమువారుగూడ దీని నాదర్శముగ గైకొని గ్రంథాలయములను స్థాపించు విషయమున శ్రద్ధ చూపుచున్నారు. బొంబాయి నగరమున సేవా సంఘమువారు 204 సంచార గ్రంథాలయములను నెలకొల్పి సుమారు పదేండ్లనుండి విద్యాదానమును జేయుచున్నారు. పాశ్చాత్యదేశము లందీ విషయమున జూపు శ్రద్ధ అపారమైనది.

అమెరికా సంయుక్త రాష్ట్రములందు గ్రంథాలయోద్యమము ఉన్నత దశ యందున్నది. అన్ని విధములైన గ్రంథముల నొకచోట ప్రోగుచేసి కాపాడుటయందలి విలువను గ్రహించియే బ్రిటిషు ప్రభుత్వమువారు తమ సామ్రాజ్యమునందు ముద్రితమైన ప్రతి గ్రంథము యొక్క ప్రతి యొకటి లండనులోని "బ్రిటిషు మ్యూజియము"నకు బంపవలెనని నియమ మేర్పరచిరి. ఈ మ్యూజియములోను, పారిసు నేషనలు లైబ్రరీలోను, బర్లిను రాయల్ లైబ్రరీలోను సంస్కృత గ్రంథములు విశేషముగ నున్నవని మనము తెలిసికొనినపుడు మన కాశ్చర్యము కలుగక మానదు. ఇతరదేశములు తమకు వీలుకలిగినపు డెల్ల మనదేశములోని గ్రంథ సముదాయమును తమ దేశములకు గొనిపోయిరి. మన మీ విషయమునం దెంత ప్రమత్తులమై యుం

టిమో ఇతర దేశము లంత శ్రద్ధవహించి యుండుటచే సరస్వతీదేవి స్వస్థానమును విడచి పరదేశవాసము జేయుట సంభవించినది.

నాగరికాగ్రగణ్యములగు దేశము లందెల్లను గ్రంథాలయములను విరివిగ నెలకొల్పుటకు రాజులును, ప్రజలును ఉత్సాహమును జూపుచున్నారు.

మనరాష్ట్రములో ప్రభుత్వమువారు విద్యాశాఖకై ప్రతి సంవత్సరము 69 లక్షల రూప్యములవరకు వెచ్చించు చున్నారు. చదువు వచ్చిన వారి సంఖ్య 100 కి 3.4 చొప్పున మాత్రమే యున్నది గనుక విద్యావ్యాప్తికై పాఠశాలలను విరివిగ స్థాపించుచున్నారు. బరోడా, మైసూరు రాష్ట్రములందువలె గ్రంథాలయోద్యమమునందు కృషిసలుపుటకై స్కీము తయారు కాబడుచున్నదని కొంతకాలము క్రిందట ఆర్థికశాఖాసభ్యులు ఒక సభలో సెలవిచ్చి యుండిరని దెలియుచున్నది. ఈ ప్రయత్నము లింకను ఫలసిద్ధి నొందకున్నను ప్రస్తుతము సర్కారువారిచే పోషింపబడుచున్న గ్రంథాలయములు లేకపోలేదు. హైదరాబాదులోనున్న స్టేటు(అసఫియా) లైబ్రరీ విశాలమైన భవనముతోను, నానావిధ పత్రికలతోను, అత్యుత్తమమైన కార్యనిర్వాహణపు టేర్పాట్లతోను విలసిల్లుచున్నది. మతము, నీతి, వేదాంతము, చరిత్ర, కళ, రాజకీయము, ప్రకృతిశాస్త్రము, సాహిత్యము, ఆర్థికము, పరిశోధనము మున్నగు యుద్గ్రంథములతో విరాజిల్లుచున్నది. ఆంగ్లేయ, ఉర్దు, అరబ్బి, పారసీ భాషలకు ప్రత్యేకశాఖ లేర్పడి యున్నవి. ప్రతి దినము నియమిత వేళలందు అందరు ఉచితముగ జదువుకొన వచ్చును. దీనికై ప్రభుత్వము వారెంతో ద్రవ్యమును ప్రతిసంవత్సరము వెచ్చించుచున్నారు. దేశభాషలగు తెలుగు, మరాఠీ, కన్నడ భాషా గ్రంథములుకూడ దీని యందుండినచో నిది సమగ్రమనిపించు కొనును. వీలును బట్టి ఈ విషయమునగూడ శ్రద్ధవహించుట ప్రభుత్వము వారి యాశయమై యున్నదని మనము నమ్మవచ్చును. ఇదిగాక పురోద్యానవనమునందు (పబ్లిక్ గార్డన్) గ్రంథా

లయ మొకటి స్థాపించు నేర్పాట్లు జరుగుచున్నవి. భవన నిర్మాణ కార్యము జరుగుచున్నది.

కళాశాలలలోను, పాఠశాలలలోను ప్రత్యేకముగ గొన్ని గ్రంథాలయములు గలవు. వీని యభివృద్ధికై ఏటేట గొంత ద్రవ్యము వ్యయము చేయబడుచునే యున్నది. ఇవిగాక ప్రజలచే నడుపబడు కొన్ని గ్రంథాలయములకు ప్రభుత్వమువారు వార్షికముల నేర్పరచి తోడ్పడుచున్నారు. కేవలము విద్యాశాఖపైన నింత గొప్ప మొత్తమును దయతో వెచ్చించుచున్న ప్రభుత్వము వారిపైననే గ్రంథాలయ స్థాపన భారమునుగూడ మోపుట సమంజసము గానేరదు. ప్రజలు ప్రభుత్వము వారికి తోడ్పడినచేగాని ప్రభుత్వము వారి విద్యా వ్యాపకోద్దేశ్యము కొనసాగదు. కనుక పాఠశాలల మూలమున నొక దెస విద్యావ్యాప్తికై ప్రభుత్వమువారు ప్రయత్నించుచుండ, గ్రంథాలయములను నెలకొల్పుటయందు ప్రజలు శ్రద్ధ వహించుట సత్వరాభివృద్ధికి శుభసూచకమగును. ఇట్టి గ్రంథాలయములకు లోకలుఫండు నుండి ద్రవ్య సహాయము చేయబడునన్న నమ్మకము గలదు. ప్రభుత్వమువారి సానుభూతియు, విద్యాశాఖాధికారుల సహాయమును లభించగలదు.

నిజాంరాష్ట్రాంధ్రదేశములో గ్రంథాలయ స్థాపన విషయమున నెంతవరకు కృషి సలుపబడినదో అరయుదము.

౨౮ సంవత్సరములకు పూర్వము హైదరాబాదులో స్థాపింపబడిన శ్రీ కృష్ణదేవరాయల ఆంధ్రభాషా నిలయము నిజాంరాజ్యములోనేగాక ఆంధ్రదేశమున కంతకును సక్రమ పద్ధతులపైన స్థాపించబడిన గ్రంథాలయములలో మొట్టమొదటిది. ఇయ్యది నిజాంరాష్ట్రాంధ్రుల యభివృద్ధికై పునాదిగా బనిచేసి స్వాంత భవనముతోను, పలువిధ సౌకర్యములతోను, అధిక సంఖ్యాకములైన సంస్కృతాంధ్ర గ్రంథములతోను విరాజిల్లుచున్నది. ప్రజలచే నడుపబడు ఆంధ్ర సంస్థలలో కెల్ల నీ రాజ్యమునందిది అగ్రస్థానము వహించినది. దీని

తరువాత చేర్చనదగినవి సికింద్రాబాదు, హనుమకొండ, మట్టె వాడ (ఓరంగల్లు), ఎఱ్ఱుపాలెము మున్నగు స్థలములలో నెలకొల్ప బడిన గ్రంథాలయములు. దయామయులై ప్రజల యభివృద్ధికై విశ్వ ప్రయత్నములను జేయుచున్న మన ప్రభువుగారి పవిత్రనామముతో నిచ్చట మధిరయందు నెలకొల్పబడిన ఉస్మానియా ఆంధ్ర భాషానిల యముయొక్క వార్షికోత్సవము నిన్న నేగదా జరిగినది! మట్టెవాడ, హనుమకొండలలో నున్న గ్రంథాలయములకు ప్రతిమాసము 15, 10 రూపాయల చొప్పున ప్రభుత్వమువారు గ్రాంటు దయచేయు చున్నారు.

ఆంధ్ర జనసంఘోద్యమ మారంభమైన గత మూడుసంవత్స రముల కాలములో గ్రంథాలయముల సంఖ్య చాలవరకు హెచ్చినది. ప్రస్తుతము వీని సంఖ్య 83 వరకు హెచ్చినదని తెలియుచున్నది. నూతన గ్రంథాలయములనుస్థాపించు ప్రయత్నములతో బాటు స్థాపింప బడిన వన్నియు సక్రమముగ నడుపబడు చుండునది లేనిది అవలోకిం చుట కేర్పాట్లు చేయుట కేంద్ర సంఘమువారి విధియైయున్నది. ఈ కార్యము నిధిపైన నాధారపడి యున్నది గనుక దేశీయులు ఉదార భావముతో ద్రవ్య సహాయము చేయవలెను.

గ్రంథాలయముల లాభములను గురించిగాని, వాని పాలనను గురించిగాని నేను ప్రత్యేకముగ చెప్పవలసిన దేదియు లేదు. గ్రంథా లయోద్యమము నందు కృషి సలుపుచు తదభివృద్ధికై ప్రయత్నములు సలుపుచున్న యనుభవజ్ఞులు తమ యభిప్రాయములను దెలుపవేడు చున్నాను.

గ్రంథాలయముల కనుబంధముగ నాటక సంఘములను, అన్న దాన సమాజములను, రాత్రిపాఠశాలలను, వినోదకరములగు ఆట పాటల క్లబ్బులను జేర్చవచ్చునని కొందరభిప్రాయ పడుచున్నారు. కాని వీనివలన గ్రంథాలయములు క్షీణించుటయు, నశించుటయుగూడ సంభవింప వచ్చునని నా యభిప్రాయము. గ్రంథాలయ కార్య నిర్వా

హాకులు ఇతరోద్యమముల ఫలసిద్ధికై ఆశించినచో గ్రంథాలయాభివృద్ధి విషయమున సఫలీకృత మనోరథులు కాజాలరు.

పలు విధోద్యమములందు కృషి సలుపుటకు సమకట్టిన కేంద్ర సంఘమునందు గ్రంథాలయ శాఖ ప్రత్యేకముగ నేర్పడవలయును. ప్రతి యుద్యమమునకు ప్రత్యేకశాఖల నేర్పరచవలె ననెడి యుద్దేశ్యమున్నట్లు ఇదివర కేర్పడిన పరిశోధక శాఖవలన దెలియుచున్నది. గ్రంథాలయము లన్నియు కేంద్ర సంఘముయొక్క ప్రాపకము నంగీకరించినచో వాని స్వాతంత్ర్యమునకుగాని, ప్రత్యేక కృషికిగాని భంగము వాటిల్లకుండు విధమున కేంద్ర సంఘ గ్రంథాలయశాఖ వలన సహాయమును బొందవచ్చును. గ్రంథాలయోద్యమ ప్రయత్నములు దీనివలన కేంద్రీకరింపబడి సమత్వము అన్నిటి యందేర్పడును.

— గ్రంథాలయ సర్వస్వము, సంపుటము 6 సంచిక 8 నుండి



శ్రీ ప్రభల లక్ష్మీనరసింహం
(పేజీ ౯, ౧౩౨)



శ్రీ పురిపండా అప్పలస్వామి
(పేజీ ౧౨౮)

# ప్రథమ గంజాం మండల ఆంధ్ర గ్రంథాలయ మహాసభ

## టెక్కలి

[ 1918 జూన్ 5 ]

### శ్రీ ప్రభల లక్ష్మీనరసింహంపంతులు

గ్రంథాలయోద్యమ మాంధ్రోద్యమమునకు వెనువెంట తదంతర్భూతముగ వెలసినది! జీవశక్తియగు భాష పెంపుజెంది విజ్ఞానము విస్తరిల్లినగాని యాంధ్రోద్యమమునకు సంపూర్ణవికాసము చేకూరదు. కావున గ్రంథాలయోద్యమము మన యాంధ్రోద్యమమునకు ప్రధానాంగమగు ననుబంధము. ఇయ్యది విజయవాటిక నెలకొల్పబడినది మొదలు దినదిన ప్రవర్ధమానముగ వింత తేజమును చెందుచున్నది. గ్రంథాలయములు పూర్వము నుండియు గలవు. గ్రంథభాండాగారములు చిరకాలము నుండియు దేశమున నిలచియున్నవి. కాని వానికి నూతన శక్తిని బ్రసాదించి గ్రంథాలయ సూత్రములు కేంద్రీకృతముల గావించి యభినవ ఫక్కిని విజృంభింపజేయ దలచినది గ్రంథాలయోద్యమము. ఆంధ్రదేశ గ్రంథాలయ సభ మా విశాఖపురిని కొలది దినములలో జరుగనున్నది. మండల సభలుకూడ మెండుగ జరుగుచున్నవి. వివిధ గ్రంథాలయములు వార్షికోత్సవములు మిక్కిలి యుత్సాహముతోడను, వైభవముతోడను జరుపుచున్నవి. ఆంధ్రదేశము నందంతటను, యాంధ్రులు నివసించుచోట్ల నెల్లెడలను గ్రంథాలయములు దిన దిన ప్రవృద్ధిగా స్థాపింపబడుచున్నవి. ఈ యభివృద్ధి గ్రంథాలయోద్యమము యొక్క బలిమిని బ్రకటించు చున్నది. మన గంజాము మండలమున గత సెప్టెంబరు మాసమున తమ యాదరణము క్రింద గంజాము మండలాంధ్ర గ్రంథాలయ సంఘమును నెలకొల్పి బ్రహ్మపురాంధ్ర భాషాభివర్ధనీ సమాజము వారు మన

కృతజ్ఞతను బడసిరి. బారువ గ్రామమున శ్రీకృష్ణదేవరాయ గ్రంథ భాండాగారము వారు ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల చతుర్థ సమావేశమును బహుజయప్రదముగ గత సంవత్సరమున జరిపి మెప్పు వడసిరి. ప్రస్తుత మీ మండలమున యిరువది యైదు గ్రంథ భాండాగారములు గలవు. వీని కార్యక్రమమును బరిశీలింప హృదయాహ్లాదము జనించు చుండును. పెక్కు విధముల భాషాసేవయు, దేశసేవయు గూడ జేయుచున్నవి. ప్రత్యేకము స్త్రీ సమాజములుండుటయు, గ్రంథభాండాగారములలో హెచ్చుసంఖ్యలుగ స్త్రీలు సభ్యురాండ్రుగ నుండుటయు స్త్రీ విద్యాభిమానము ప్రకటించు చున్నవి. గ్రంథాలయములు నాంధ్ర గ్రంథములేగాక యన్యభాషా గ్రంథములుగూడ సంగ్రహించుచున్నవి. ఆంధ్రభాష యాదినుండియు స్వేచ్ఛాప్రవృత్తి గలిగి యన్యభాషాపదముల వాడుకొనుచు వచ్చినది. అన్యదేశ పదములు మెండుగా గానవచ్చుచున్నవి. ఇట్టి స్థితిలో భాషాసంప్రదాయమునను సరించి యితర భాషాగ్రంథములనుగూడ సంపాదించి తద్భాషా పరిచయమును లభింపచేసికొని వాఙ్మయమునకు వింత వన్నెల బచరించుట మన విధియును, సనాతన కవి ధర్మమును నయి యున్నది. భాషామిశ్రమముగల మండలములయందిది ముఖ్యమగు కర్తవ్యము. అన్య భాషాపరిచయముగల వారందఱకును తద్భాషా సౌందర్యము హృదయాహ్లాదమును బుట్టించుచునే యుండును. భాషాపరివర్తనము మూలమున నన్యభాషా గ్రంథరాజములు గొన్ని యాంధ్ర వాఙ్మయము నలంకరించుచున్నవి. ప్రాయికముగ వంగభాషనుండియు, మహారాష్ట్రమునుండియు, ఉర్దూభాషనుండియు కథలు, కల్పనలు, నాటకములు, ఇతిహాసములు, నవలలనేకములు గ్రహింప బడుచున్నవి. సంస్కృత పురాణగాథలు తరుగులేని గనియై యున్నది. ఆంగ్లమునుండి భాషాంతరీకము లనేకములు వెడలియున్నవి. ఈ విధమున నుపనదీ సందోహ సమ్మిళితమై యాంధ్ర వాఙ్మయ వాహినీలహరి నిస్తుల గాంభీర్యముతోడ విజ్ఞానమును వెదజల్లుచు వెల్లివిరిసి ప్రవ

హించు చున్నది. ఆంధ్ర జీవనమును వాఙ్మయ వాహినీ జీవనము పునీతము గావించుచున్నది. మఱియు నుద్వేలగతి విజృంభించి మించునటుల పరాత్పరుడనుగ్రహించుగాత!

గ్రంథములు, వాని యుపయోగములు

ఏ భాషయందైన నెంతజదివిన తనివితీఱని యమూల్య రత్నములు కొన్ని యుండును. ఎన్నితడవలు చదివిన మఱల జదువ మనము లువ్విళులూరుచుండును. అట్టి గ్రంథరాజముల సంఖ్య యత్యల్పముగ నుండును. ఆంగ్ల కవివర్యులొకరానతిచ్చినటుల కొన్ని పుస్తకములు వాచవికిమాత్ర మర్హములై యుండును. కొన్ని కడుపార గుడువదగినవి. కొలది పాత్రములుమాత్రము జీర్ణము జేసికొనదగినవియై యుండును. ఈ కడపటి తరము గ్రంథములే మనకు సన్నిహిత బంధువులవంటివి; నిరంతర సాన్నిధ్యముతో సాహచర్యము జరుపవలసినవి; విసుపు పుట్టింపవి వింత చోద్యములు, రసములు గ్రోలినకొలదిని ప్రసాదించును; శ్రమమును బాపి, హితమును గఱపి, హృదయపీడను బోగొట్టి యానందవార్ధి నోలలాడించి, తన్మయత్వమున గాలమును, శరీరమును, పరిసర వస్తువులను విస్మృతంబులుగ జేయునవి; గురువు, నెచ్చెలి, మంత్రి, హితుండు నందఱు నొక్కచో గూడినయటుల విజ్ఞాన ప్రదాయకములై పాఠకుల జీవనములు ధర్మక్షుణ్ణములగు నేమి పథముల దాటకుండ బ్రవర్తింపజేయునవి; అట్టి గ్రంథము లెప్పుడును చెంగట నుండదగినవియైయున్నవి. బాలురకు విద్యాభ్యాస తరుణమున భాషయందభిరుచియు, సౌశీల్యాద్యుత్తమగుణ ప్రవృద్ధియు నిట్టి గ్రంథ పఠనమువలననే గలుగుచుండును. ఇయ్యది మనకందఱకు ననుభవవేద్యమై యున్నది. ఒకటి రెండు మాత్ర ముత్తమగ్రంథముల నిశ్చలభక్తితో చదివి యొంటబట్టించుకొని తన్మూలమున భాషా కోవిదులైనవారు అనేకులు గలరు. ఆంగ్లమున మత గ్రంథమును, తెనుగున భారత భాగవత రామాయణములు నట్టి ప్రభావముగలవిగా నున్నవి. మఱియు పుస్తకముల చదువుటయందు మననము, నిదిధ్యా

సము నత్యావశ్యకములు. విద్యయు, ధనమును నేక స్వభావముగలవి. గ్రంథము జదువునప్పుడు తన్మయత్వమున వర్ణింపబడిన యంశము లన్నియును నెట్టయెదుట గనుల గట్టిన రీతిని సాక్షాత్కరించునటుల శ్రద్ధ వహింపవలయును. వాల్మీకి రామాయణమున సుందరకాండము, ఆంధ్ర భాగవతమున ప్రహ్లాదచరిత్రమును, శంకరకవి హరిశ్చంద్రో పాఖ్యానమును జదివి కంటదడిబెట్టని దిట్ట యొకడును గానరాడు. భారతమున నన్నిపట్ల నన్నిరసము లొల్కుచునే యుండును. శోధించి లెక్కింప శక్యముగాదు. గ్రంథస్థ విషయముల నేపట్టుననయిన నను భవగోచరములు గావించుకొనుట ముఖ్య విషయము. అట్టి యనుభవ మునగాని గ్రంథస్థ విషయములు హృద్గతములై జ్ఞానోదయమును గలుగజేయు సామర్థ్యమును బొందజాలవు. పూర్వకాలమున నచ్చు యంత్రములు, వ్రాతకు సులభసాధనములు లేని సమయమున నిరంతర కృషివలన తాళపత్రములపై హెచ్చు శ్రద్ధతో గ్రంథముల లిఖి యించుకొని సంగ్రహించి, పఠనముజేసి యుత్తమ జ్ఞానమును బొందుచుండెడివారు. దూరప్రయాణములుజేసి, యధ్వశ్రమముల కోర్చి కాయక్లేశములు సరకుసేయక, యెన్నియో యుపచారములు సలిపి యెటులనో యజమానుల హృదయములను గఱగింపజేసి గ్రంథ ములు సంపాదించుచుండెడివారు. అట్టి కృషియు, శ్రమమును, నిరర్థ కములుగాక కష్టసాధ్యములుగ సంపాదింపబడిన గ్రంథములన్నియు నుత్తమరూపమున వాడుకొనబడుచుండెను. ఆ కారణముననే చిరజీ వులుగ నుండదగిన పొత్తములే కాలగతితప్పి మిగిలి యున్నవి. ఎన్నియో నవలలు, చరిత్రలు, నాటకములు, కథలు, ప్రబంధములు, గ్రంథమాలలు వెలువడు నీ సమయమున నన్నిటిని సంపాదించుకొని ప్రతి మనుజుడును జదువుట దుస్తరమగును. కావున గ్రంథాలయ వ్యాప్తి వర్తమాన పరిస్థితులయందు ఆవశ్యకమై యున్నది.

ప్రాచీన గ్రంథాలయములు

గ్రంథాలయములు, గ్రంథభాండాగారములు నను నీ పదముల వినినతోడనే యివి యెవ్వియో విదేశ వస్తువులను సంశయము కలుగవచ్చును. పేర్లు నూతనమైనవియైనను, వస్తువులు ప్రాచీనమై యున్నను ఇంటింట సరస్వతి నాట్యమాడుచుండెడి దినములలో ప్రతి గృహమును సరస్వతీ నిలయమై భాసిల్లుచుండెను. పిదప దేవాలయములు, మఠములు, విహారములు, చైత్యములు, రాజమందిరములు, పండిత గృహములు మొదలగునవి యుత్తమ గ్రంథాలయములై యొప్పుచుండెడివి. పూర్వకాలమున మతమునకును, గ్రంథమునకును హెచ్చు సంబంధముగలిగి యుండెడిది. దేశమున స్వాతంత్ర్య మస్తమించి రాజ్యము పరహస్తగతంబైన పిదప గ్రంథరచనగూడ దేశమున క్షీణించినది. ఏదేశముననైన ప్రజలు స్వాతంత్ర్యముగలవారైనచో బుద్ధి వికాసము హెచ్చి యున్నత గ్రంథములు వెలువడును. నానాటికి దేశమునందున్న యుత్తమ గ్రంథములుకూడ నాశనము జెందినవి. కొన్ని భూస్థాపనము జెందినవి. మఱికొన్ని యగ్నిప్రవేశము గావించినవి. కొన్ని నీట గలసినవి. మఱికొన్ని కీటకములవాత బడినవి. కొన్ని విదేశగాములయినవి. ఈ విధమున ప్రాక్తన విజ్ఞాన సర్వస్వమంతయు చెల్లా చెదరుగ నాశనము జెందినది. ఈమహోపద్రవముల గడచిన కొలది పొత్తములు మాత్రము ప్రపంచముయొక్క పూర్వ చారిత్రమును దెలియపరచి మనల నాశ్చర్యనిమగ్నుల గావించుచున్నవి. ఇంతవరకును ప్రపంచకమునందలి నాగరికత హెచ్చినదియో, క్షీణించినదియో నిర్ణయింప శక్యముగాకున్నది. ఈజిప్టు బాబిలోను మున్నగు దేశముల పూర్వ నాగరికతా చిహ్నములను దిలకించినచో నీ సందియము మఱియు పెంపుజెందును. మనదేశమున సంస్కృతభాష కానరానిచో పెక్కు విషయములు దురవగాహములయి యుండును. ప్రపంచమున గలిగిన ప్రళయములలో అలెగ్జాండ్రియావంటి గ్రంథాలయములు

దగ్ధములగుటవలన గలిగిన జ్ఞానప్రళయము హెచ్చు ఘోరమైనదై యున్నది. నదులు, పర్వతములు, గిరగహ్వరములు, గులకరాలు, చుక్కలు, నాకసము సైతము సృష్టికర్త రచియించిన పెద్ద పొత్తముల వలె ప్రకృతిశోభను, వైచిత్రిని విచ్చి కనులయెదుట నిలుపుచున్నవి. కాని సృష్టికర్తమాయ వీనినన్నిటిని గప్పియుండుటవలన దాని ఛేదింప యత్నించిన ఋషుల విజ్ఞానరత్నాకరము లనదగు పుస్తకములు నశించుటచే నెన్నియో శాస్త్రములు, కళలు సమసిపోయినవి. మిగిలినవానినైన సంరక్షింప ప్రయత్నము లాలస్యముగ జరుపబడినవి. మైసూరు, కాశ్మీరము, నేపాళము, తంజావూరు దేశములయందు ప్రభువులు గొప్ప గ్రంథ భాండాగారముల స్థాపించిరి. దొరతనము వారు గూడ ప్రారంభమున కొన్ని గ్రంథనిలయములు నెలకొల్పినను ఇటీవల నట్టి ప్రయత్నములు పూనికతో గావింపనందున కొన్ని యుత్తమ గ్రంథములు విదేశగాములయినవి. నేటికిని పల్లెటూళ్ళ వ్రాత పుస్తకములు, తాళపత్రప్రతులెన్నియో గలవు. వాని సంగ్రహించుటకు దొరతనమువారు ప్రయత్నములు సలుపుచున్నారు. కాని గ్రంథాలయములు గూడ నీ యుద్యమమును చేబూనినచో నంతకంటె హెచ్చు సులభముగ నీ యమూల్య గ్రంథముల సంగ్రహింప వచ్చును.

గ్రంథాలయ విధులు

అజ్ఞానతమము దేశము నిండియున్నది. చదువను వ్రాయను నేర్చినవారి సంఖ్య స్వల్పముగ నున్నది. గ్రంథముల జదివి రసము గ్రహించువారిసంఖ్య యత్యల్పమని చెప్పుటకు సంశయములేదు. ప్రారంభవిద్య నిర్బంధముగను, ఉచితముగను బ్రసాదించుటకై ప్రభుత్వమువారివలన కొన్ని ప్రయత్నములు సలుపబడుచున్నవి. ఇంకను నవి రూపుగనలేదుగాని శుభ సూచకములు మెండుగా గానవచ్చుచున్నవి. రాజకీయ విషయములగూడ హెచ్చు స్వాతంత్ర్యము ప్రజలకు గలుగు సంస్కరణము లుపపాదింపబడునని దేశ

ముత్కంఠత వృత్తితో నెమరుచూచుచున్నది. ఈ సమయమున ప్రజలకు జ్ఞానాభివృద్ధియు, కార్యనిర్వాహణ శక్తియు గలుగునటుల బని చేయువిధి మనయందుగూడ గలదు. అట్టి జ్ఞాన ప్రదానమున గ్రంథాలయములు ముఖ్యముగ బాల్గొనవలసి యున్నది. ఆంధ్రమున వార్తాపత్రికలు వెలువడినది మొదలీకొఱంత కొంతవఱకు దీరినది. ఉత్తమ గ్రంథరచనలవలన ప్రజలకు ప్రబోధము గలిగించుట గ్రంథకర్తలకును, తద్గ్రంథ సంపాదనమునను, ప్రచురమునను జ్ఞానవ్యాప్తి గలిగించుట గ్రంథాలయములకును విధియై యున్నది. పూర్వకాలమున కవులు, గ్రంథకర్తలు ప్రభువుల నాశ్రయించి యుక్తముగ బోషింపబడుచుండెడివారు. మహాకవులును, శాస్త్రజ్ఞులును గొందఱు దారిద్ర్యముననే ప్రశస్తిగాంచి లోకోపకారమొనరించిరి. ఈ కాలపరిస్థితుల ననుసరించి రాజావలంబనముకంటె ప్రజావలంబనమే గ్రంథకర్తలకు జీవనాధారమై యున్నది. "సంఘే శక్తిః కలౌ యుగే" యను నార్యవచనము స్మరణకు వచ్చుచున్నది. ప్రజాహితములగు గ్రంథములు ఆదరణమును బడసి వాసిగాంచగలవు. పూర్వకాలముకంటె చౌకగ గ్రంథములు లభించుటచేతను, సులభముగ రాకపోకలు జరుగుచుండుటను చదువరులు హెచ్చుగనుందురు. కాని వారలకు గ్రంథములు చదువుటయం దభిరుచిమాత్రము జనియించునటుల గ్రంథాలయములు పాటుపడవలసి యుండును. ప్రజల హృదయము నాకర్షింపని గ్రంథ మేనాడును జీవింపజాలదు. గుణ గ్రహణము, విమర్శక జ్ఞానము అందఱకును సామాన్యముగ లభింపవు. గ్రంథాలయములట్టి వివేచనముతో గ్రంథసంపాద్యమును జేసి పాఠకుల కుద్బోధము గావించుచుండవలెను. దేశమున నూతన యుగము ప్రారంభ మగు చున్నది. ఇట్టి సంధికాలమున నన్ని విధముల పుస్తకములును బయలువెడలును. మంచివి, చెడ్డవి, సామాన్యమయినవి యన్నియు నీ ప్రవాహమున బోవుచుండును. గ్రంథకర్తల యందు ముఖ్యముగ స్వాతంత్ర్యము హెచ్చుగ గానవచ్చుచున్నది. కవు లెప్పుడును నిరంకుశ ప్రతిభగల

వారలేగాని పూర్వకాలమున కావ్యనాటక రచనలయందును, శైలి యందును, రసపోషణము నందును ఇతి వృత్త నిర్మాణమునందును, పాత్రల యౌచిత్యమునందును, దృశ్యప్రబంధముల ప్రదర్శింప దగిన విషయముల గూర్చియు కఠిన సూత్రములు నిర్మింపబడి యున్నవి. ఆధునిక నాటకములయందు పూర్వపునాటకలక్షణములు పాటింపబడు చున్నట్లు కానరాదు. ప్రదర్శన కర్మములగు రంగము లెన్నియో కూర్పబడుచున్నవి. సంఘ సంస్కారము మొదలుగాగల యంశముల గ్రంథకర్తలు తమ కభిమానముగలవాని నౌచిత్యమును నాటక నిబంధనలనుదాటి యుపన్యాస రూపకమున పాత్రల ముఖమునుండి వెలువడ జేయుచుందురు. మఱియు నవలల యం దీవిషయమున మిక్కిలి దోషము గన్పట్టుచున్నది. గ్రంథాలయములు కొన్ని పనిబూని పారితోషికముల నిచ్చి గ్రంథరచనకు సాహాయ్య మొనరించుచుండుటచే నీ విషయమును గూర్చి యిచ్చట బ్రస్తావింపవలసి వచ్చినది. కావ్యనాటక రచనయందు ప్రాచీన సంస్కృతాంధ్ర సూత్రముల విడువక రచించుట యొప్పని తోచుచున్నది. నాటకము లాంధ్రమున క్రొత్తగ బయలుదేరుచున్నవి. సంస్కృత నాటకముల భాషాంతరీకరణములు సమాప్తి జెందినవి. సుప్రసిద్ధాంగ్ల నాటకములు గూడ పూర్తియైనవి. పురాణ కథలననుసరించి క్రొత్త నాటకములు వ్రాయబడుచున్నవి. భాషాంతరీకరణములందు భాష చిత్రముగ నుండును. కొన్ని పట్ల నుభయ భాషా భ్రష్టత్వము గానుపించును. మాతృక యొక్క సహాయముండినగాని పరివర్తనము దురవగాహమైయుండును. అన్య భాషా సాంప్రదాయము లటులనే తెనుగున నిమిడ్చియుండుటచే వైమనస్యము వాటిల్లుచుండును. వార్తాపత్రికల యం దీ దోషము తంత్రీవార్తల దెలుపుపట్లను, నితర విషయముల నాంగ్లమునుండి తెనుగున రచించుచోట్లను వింతవింత స్వరూపములుగ గానవచ్చును. భాషాంతరీకరణమున భావము గ్రహించి చక్కని తేటమాటల దెలుపుట సమంజసముగా దోచెడిని. భారతాది గ్రంథములే యిందుకు

దృష్టాంతములు. గ్రంథ రచనకు గడగువాడు లోకజ్ఞుడై యుండవల యుననియు, చతుష్షష్టి కళాకౌశలము గలవాడై యుండవలయునని యును ప్రాచీన కవిపుంగవులు నుడివి యుండిరి. వాలకు లీకాలమున ప్రాభవమును జూపుచుండిరి. ఇయ్యది వినూతన భాషావిజృంభణము నకు ముఖ్యలక్షణము. వారి ప్రయత్నములు ప్రశంసార్హములు. సాంఘిక విషయముల జర్చించునపుడును, హితబోధ నవలంబించు నప్పుడును లోకానుభవ మావశ్యకము.

శాస్త్ర గ్రంథములు, కళలు

విజ్ఞానచంద్రికామండలివారు కొన్ని శాస్త్ర గ్రంథముల దెనుగున బ్రచురించిరి. ఇంకను వ్రాయదగిన గ్రంథములెన్నియో గలవు. ప్రాథమిక పాఠశాలయందు సయితము పసిపిల్లలకు చదువు గఱపుటకు నియమింపబడిన చిన్నిపొత్తముల విప్పజూచినచో పెద్దల కలవడని యంశము లెన్నియో యందు బొందుపరచి యుండును. మఱికొన్ని విషయములు పసిపిల్లలకు సైతము బాగుగ తెలిసియుండు టచే వారికి నవ్వు పుట్టించుచుండును. బిడ్డలు బడినుండి యింటికి వచ్చిన పిదప తలిదండ్రులు బిడ్డలను నాటి చదువును గూర్చి సంప్రశ్నించినచో నట్టి వింతలు బయల్పడక మానవు. రాత్రి దీపము కడ జదువు వేళల గనిపెట్టి చూచిన గనుగొందుము. బాలుర విద్యాభ్యాసమున లేత వయసున మనస్సు వికాసము జెందు తఱిని అట్టి జ్ఞానోన్మీలనమునకు దగిన పుస్తకములు వారి హస్తములయం దుంపవల యును. ఉపాధ్యాయులు కూడ కొన్నిపట్ల బాలురై యుంట కడు శోచనీయము. మనశ్శాస్త్రమును బాగుగ గుర్తెఱింగియుండి పిల్లల మనోవికాసమును గనిపెట్టి యందుకు దోడ్పడుచునే బుద్ధి కేది రుచించునో యద్దాని పూనికతో గఱపుచు జ్ఞానోదయము గలుగజేయుట యుపాధ్యాయుల విధి. విద్యా విషయమున లోపము లెన్నియోకలవు. వాని నిచ్చట యుగ్గడించుట యప్రస్తుతము గాన దానిగూర్చి ప్రశం

సింపను. మనోధ్వాంతమును బోగొట్టువాడే గురువు. పరీక్షల పెక్కండ్రు బాలు రుత్తీర్ణులు గాకుండుట జూడ విద్యగఱపు విధమున నెద్దియో పెద్ద లోపమున్నట్లు తప్పక పొడగట్టుచున్నది. ప్రారంభ విద్య యుచితముగను, నిర్బంధముగను నేర్చు సమయ మఱుదెంచిన యీ తరుణమున తగిన పుస్తకము లెన్నియో యుండవలయును. కొన్ని తగిన పుస్తకములు బయలు వెడలుచున్నవి. కాని యింకను బయలు వెడలదగి యున్నవి. విదేశీయులగు పుస్తకపు వర్తకులవలన నియోగింపబడికాక, స్వతంత్రముగను, అనుభవముగల యుపాధ్యాయులవలనను వ్రాయబడినచో పొత్తములయం దట్టిలోపములుండవు. ఆరోగ్యశాస్త్రము, వృక్షశాస్త్రము మొదలగు శాస్త్రములనుగూర్చి వ్రాయుటయందు దేశభాషలన్నింటియందు సామాన్యముగ నొక్క పదమునే వాడుచుండుట మంచిదని తోచుచున్నది. వంగభాషయందును, మహారాష్ట్రమునందును నిట్టి పదములు చక్కగ వాడబడుచుండునట్లు తెలియవచ్చుచున్నది. "అంగారక్షారవాయువు", "బొగ్గు పులుసు గాలి" యను నర్థము నెవరికయినను దురవగాహాములే. పండితసభ లీవిషయమున గృషిసలిపి సరియగు పదముల నిర్ణయింతురుగాక! రాజకీయ వ్యవహారముల యందుగూడ సరియగు పదముల నిర్వచించి యర్థము, భావము సరిపోవునటుల నిర్ధారణముచేసి ప్రకటించుట పండితసభల విధియై యున్నది. పూర్వకాలమున మనదేశమునందు రాజ్యాంగ తత్వము చక్కగ నివర్తింపబడుటచేతను, శాస్త్రములన్నియు బాగుగ వికసించియుండుటచేతను పూర్వ గ్రంథ పరిశోధనమున నీకొఱంత కొంతవఱకు దీఱునని తోచెడిని. అట్టి పరిశోధనమును గ్రంథాలయములు పూనవలయును. గ్రంథాలయములు పూర్వపు సాహిత్య గ్రంథములేగాక శాస్త్రగ్రంథములు మొదలగు వానిని సంగ్రహించి ప్రస్తుతోపయోగములగు విషయములకు సరియైన పదము లట్టి శాస్త్రములయందు గానవచ్చినచో వానినెంచి ప్రకటించుట మేలు. వర్తమానమందు ఘోర యుద్ధము చెలరేగుచున్నది.

ఈ యుద్ధమును వర్ణించుట కనేక ప్రయత్నములు జరుగుచున్నవి. వార్తాపత్రికలు ముఖ్యముగ నీ విషయమున మిక్కిలి గష్టము జెందుచున్నవి. మహాభారతమును, నిఘంటువులను జూచినచో నీ వర్ణనమునకు దగిన పదము లెన్నియో దొరకును. ప్రకృతి శాస్త్రము, రసాయనశాస్త్రము, ఖగోళశాస్త్రము, రేఖాగణితము, బీజగణితము మొదలగు శాస్త్రముల దెనిగించుటయందు పూర్వగ్రంథముల సహాయమంతగా గైకొనబడుచున్నట్లు కానరాదు. ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారీ విషయమున దగిన కార్యము నిర్వర్తింతురని నమ్ముచున్నారము. పరిషత్సభవారివలన నుత్తమాంధ్ర నిఘంటువు ప్రచురింపబడిన వెంటనే యీ కొఱంత దీరునని యోచించుచున్నారము. గ్రంథాలయములుకూడ నీ విషయమున హెచ్చుశ్రద్ధ వహించి పనిచేయుట యావశ్యకమై యున్నది. ఈ విషయమున కృషి సలుపుటకు గ్రంథాలయములకు హెచ్చు అవకాశము గలదు. అట్టి అవకాశమును సద్వినియోగము గావింప ప్రార్థించుచున్నాడను. మఱి నీ కార్యమున నన్యభాషల పరిచయముగూడ మిక్కిలిగ సహకారియగును. గ్రంథాలయముల నన్యభాషాగ్రంథములుండుటయు, సభ్యులు వారి యభిరుచులనుబట్టి మఱియొక భాషనైన నభ్యసించుటయు వర్తమానమందావశ్యకమని తోచుచున్నది. మన మాంధ్రమున నవలలని పిలుచు పుస్తకము లుత్కలభాష నుపన్యాసములని వాడబడును. ఉత్కలభాషయందును, ఉర్దూభాషయందును నాకుగల యల్పజ్ఞానముతో బరికించి చూడ తత్తద్భాషలయందు కొన్ని కొన్ని నూతనాభిప్రాయములు చక్కగ వర్ణింపబడి యున్నట్లు కానవచ్చినది. భాషాపరివర్తన మెంతయో సౌకర్యముగ గావింపబడినది. కావున నన్యభాషా పరిచితి ముఖ్యముగ నావశ్యకమని చెప్పవచ్చును. హిందీభాష దేశమందంతటను వాడబడవలయునని మహాత్మాగాంధిగారి యాశయమై యున్నది. అట్టి హిందీభాషకూడ ముఖ్యముగ వ్యాప్తమగునటుల గృషి సల్పబడవలయును. సంస్కృత సాహిత్య ముండినచో దేశ.

భాషలు సులభముగ పట్టుపడును. ఉర్దూ, వంగభాష మహారాష్ట్రము, ద్రవిడము, కన్నడము, ఓఢ్రము ముఖ్యముగ వారి వారి యభిరుచినిబట్టి యభ్యసింపబడవలయును. ఉత్తమ గ్రంథములీ భాషలయందు వెలువడియున్నవి. వంగభాషయందును, మహారాష్ట్రభాషయందును వాఙ్మయాభివృద్ధి మిక్కిలి జరిగినది. శ్రీయుత రవీంద్రనాథ ఠాకురుగారి నిరుపమానమగు కవిత్వము జగత్ప్రఖ్యాతిని బడసినది. అనుత్తమమగు బహుమానమును పొందినది. చదువరుల హర్షపులకితాంగులుగ జేయుచున్నది. అట్టి కవీంద్రుడాంధ్రమున గూడ వెలయుగాత! తగిన గ్రంథ పరికరమున్నచో మధ్యమ విద్య కూడ మాతృభాషయందే గఱుపవచ్చును. రాజకీయ వ్యవహారములు సయితము దేశభాషయందు జరుపవచ్చును. జరుపబడవలయును. ప్రజా సామాన్యమున కారీతినిగాని తగిన యనుభవ జ్ఞానము కలుగ నేరదు. స్వతంత్ర రాజ్యములయందు కొన్ని సంస్థానములలో నీ పద్ధతి చక్కగ నెరవేర్పబడుచున్నది. ఇట్టి కార్యసిద్ధికంతకును భాషా ప్రవృద్ధి మూలకారణము. నూతన శకావిర్భావమునందు జాతీయ తత్త్వము పెంపుజెందు తరుణమున ప్రభుత్వము ప్రజారంజకమై ప్రజానురాగబద్ధమై యుండుతఱిని, ప్రజాశక్తులు నవోన్మేషముగాంచి విజృంభించు సమయమున, ప్రజలెల్లెడలను దేశభక్తి పరాయణులయి యుండు జతనున, మాతృభాషాభివృద్ధికై వలయు ప్రయత్నములు నిరంతరకృషితో సలుపబడవలసియున్నది. గ్రంథాలయములు కొన్ని యన్నదానము, నాటపాటలు మొదలగు సౌకర్యములు గూర్చుచున్నవి. భాషావిషయమున హెచ్చు పూనికబూని కార్య సంసిద్ధి జెందుట ముఖ్యము. స్త్రీవిద్య వ్యాప్తిజెందుట కుపాయము లన్వేషింపబడవలయును. ఊరూరను పుస్తక భాండాగారములు నెలకొల్పబడవలయును. మండల సభవారివలన కేంద్ర గ్రంథాలయము స్థాపింపబడవలయును. సంచార గ్రంథాలయములు మెండుగా నుండ

వలయును. గ్రంథములన్నియు సంగ్రహించుటందఱకు సాధ్యముకాదు కావున కేంద్ర గ్రంథాలయ మొండు మండలమున నావశ్యకము. ఆంధ్రదేశమున కంతకు నుత్తమ కేంద్ర గ్రంథాలయ మొండు మిక్కిలి యావశ్యకమయి యున్నది. ఆ విషయమున నాంధ్ర దేశ గ్రంథాలయసభవారు కృషి సల్పుదురుగాక!

— గ్రంథాలయ సర్వస్వము, సంపుటము 3 భాగము 4 నుండి

# విశాఖపట్టణ మండల గ్రంథాలయ ప్రత్యేక మహాసభ

## విశాఖపట్టణము

## [ 1921 ]

## శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి

## శ్రీ గురజాడ దుర్గాప్రసాదరావు

స్వాగతోపన్యాసము

ఎందుకీ ప్రత్యేకసభ? అని ఎందఱికో సందియము పొడమును. రాజ్యాంగసభలు ప్రత్యేకముగా జరుపు ఆవశ్యకముండిన ఉండుగాని గ్రంథాలయసభల కట్టి ఆవశ్యమేమని కొందరడుగవచ్చును. ఏ జిల్లా వారును అవలంబింపని పద్ధతి మనమేల అవలంబింప వలసి వచ్చినది అని కొందఱనుకొనవచ్చును. రాజ్యాంగసభలే ప్రత్యేకముగా చేయుటకు వెనుకంజవేయ మనము గ్రంథాలయసభ ప్రత్యేకముగా చేయుటకు వింతపడవచ్చును. ఎవరికి సందియము కలిగించినను, ఎవరినేమి అనుగదలచునట్లు చేసినను, ఎవరేమనుకొన్నను, ఎవరెంత వింత పడినను మన జిల్లా గ్రంథాలయసభ ప్రత్యేకముగ జరుగవలసిన ఆవశ్యకము వచ్చినది. జరుప నిశ్చయించుకొన్నాము. జరుపుచున్నాము. సరేకాని ఏమి ఆవశ్యకము? ఇప్పటి మన దేశ స్థితినిబట్టి గ్రంథాలయములు పెట్టి పనిచేయువారు ముఖ్యముగా ఇప్పుడు చేయవలసిన పని ఏమో నిర్ణయించుకొనుటయే. గ్రంథాలయ ప్రతినిధులు ఒకచోట జేరినగాని యీపని సాధ్యముగాదు. అందుకే యీ ప్రత్యేక మహాసభ. అయిన మనమిప్పుడు చేయవలసిన పని ఏమి?

జ్ఞానాభివృద్ధిచేసి, దేశాభివృద్ధికి తోడ్పడుట గ్రంథాలయముల ముఖ్యపుపని అని అందరికిని తెలిసిన విషయమే. కాని ఇప్పుడు మనము ఎట్టి జ్ఞాన మభివృద్ధిచేయ యత్నింపవలయునో నిర్ణయించుకొన



శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి
(పేజీ ౨౨)



శ్రీ విస్సా అప్పారావు
(పేజీ ౨౮)

వలెను. దేశ స్థితినిబట్టి గ్రంథాలయములు ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క విధముగా జ్ఞానాభివృద్ధి చేయవలసి యుండును. గ్రంథాలయ పరమావధి దేశాభివృద్ధిగాన నిప్పుడెట్టి జ్ఞానమభివృద్ధి చేయుట మంచిదో కడు మెలకువతో నిర్ణయించుకొనవలెను. మునుపు సిరి కాటపట్టగు మనదేశమిప్పుడు పెద్దమ్మ కాటపట్టుగ ఉన్నది. అందుచేత మన యిప్పటి నిప్పచ్చతనమును నవ్వాలకు పుచ్చి ఎల్ల సిరులు సమకూర్చు జ్ఞానమభివృద్ధి చేయుటకే గ్రంథాలయములు తమ శక్తి అంతయు వినియోగింపవలెను. "బ్రతికియుండిన సుఖములు బడయవచ్చు" అను మాటనుబట్టి బ్రతుకుతెరువుగదా ముందు చూచుకొనవలె. కాబట్టి మన నిరుపేదతనమునకు కారణ మేమో తెలుపు జ్ఞానము గ్రంథాలయము లిప్పుడు ప్రజలకు సమకూర్పవలయును. నూలు వడకమి, బట్టలు నేయమి, దేశవాళీరంగులు వేయమి, ఆముదముపైరు పెట్టమి మొదలగు తెలివితక్కువ పనులవల్లను, కోర్టులకెక్కుట, విదేశవస్తువులే హెచ్చుగా కొనుట, సిగరెట్లు, బీడీలు, టిప్పు, గంజాయి మొదలగునవి కాల్చుట, కల్లు, సురా, కాఫీ, తేనీళ్లు, సోడా, నిమ్మనీరు మొదలగునవి త్రాగుట, మెడపట్టీలు, టోపీలు, మేజోళ్లు, కోట్లు, కమీజులు మొదలగునవి వేసికొనుట, జూదమాడుట, కోర్టులకెక్కుట మొదలగు తెలివితక్కువ పనులవల్లను మనదేశమున కెంత నష్టము కలుగుచున్నదో అవి మానిన ఎంత లాభము కలుగగలదో గ్రంథాలయోద్యమాభిలాషులు ప్రజలకు బోధింపవలయును. ఊళ్ల పరిశుభ్రముగా ఉంచుకొనుటవల్లను, పంచాయతీకోర్టులు పెట్టుకొనుటవల్లను, నూలు వడకుట మొదలగు వృత్తులవలంబించుటవల్లను ఎంత మేలు కలుగునో విసుకు విరామములేక చాటుచుండవలెను. కొన్ని గ్రంథాలయములవారు ఇప్పటికే ఈ విషయమున కొంతపని చేయుచున్నట్లు ఇచ్చటికి వారు తెచ్చి ప్రదర్శించు వస్తువులే ఘోషించుచున్నవి. కాని చేసినపని చాల తక్కువ. చేయవలసినది ఎంతో హెచ్చు. అది నిర్ణయించుకొనుటకే మనమిచ్చట

చేయుట. కావున మనమందఱము అప్పడప్పుడు చేయవలసిన పనినిగూర్చి చక్కఁగా ఆలోచించి వలయు తీర్మానములు చేసికొని వానిననుసరించి నడచి, మన ధర్మమును నెరవేర్చుకొని, దేశసేవచేసి ధన్యులమగుదుముగాక! సర్వశక్తి, సర్వేశ్వరుడు సర్వజ్ఞుడు, పరాత్పరుడు మనకట్టి శక్తి తన కరుణామయత్వమును కనబఱచుచు ప్రసాదించుగాక!

— మారేపల్లి రామచంద్రశాస్త్రి

అధ్యక్షోపన్యాసము

ఈదినము మనమందఱమిచట సమావేశమగుటకు కారణము తమకు విశదమైనట్లు నేనూహించెదను. గత సంవత్సరము మన జిల్లా గ్రంథాలయములవారి సమావేశము "కొత్తవలస" లో జరిగినది. అందు భాషావిషయములును, తదభివర్ధన విధానములును ప్రాముఖ్యము గనినవి. ఈ దినము ఆర్థికసమస్యతో గూడిన గ్రంథాలయ ప్రత్యేకసభ జరుగును. రాట్నములు మొదలయిన చేతిపనుల పునర్జీవము, వాని యభివృద్ధియు సభ ముఖ్యోద్దేశములై యున్నవి.

గ్రంథాలయములు జ్ఞాననిలయములు. దేశాభ్యుదయమునకు సమస్త కళాజ్ఞానముండవలెను. ముఖ్యమైన కళలు చతుష్షష్టియని సాంప్రదాయముగ వాడబడుచున్నవి. ప్రస్తుత పరిస్థితులబట్టి చూడగా నూలు వడకుట, నేయుట అనునవియే అతి ముఖ్యములని తోచుచున్నది. కుడువకూడు, కట్టగుడ్డ లేక దేశము క్లేశము పొందుచున్నది. జనసామాన్యమునకీరెండు గల్గిన కొంతమైన పరితాపశాంతి గలుగును. అట్టి శాంతికి ముఖ్యసాధనము స్వరాజ్యప్రాప్తియెగాని యది సుసాధ్యము గాదనియు, దుస్సాధ్యమనియు కొందరు వాదించుచున్నారు. సుసాధ్యమైనను, దుస్సాధ్యమైనను అసాధ్యము మాత్రము గాదనియు, మనమందరము నైకమత్యముతో నడుములు గట్టుకొని కార్యసాధనమునకు గడగినచో మనము స్వరాజ్యము సులభముగా పొందనగుననియు పెద్దలు నుడువుచున్నారు. గాంధీ మహాత్ముడు మన హిందూ

దేశమునందు స్వరాజ్యమును ఒక సంవత్సరములో నెలకొల్పెదనని ప్రతిన చేసియున్నాడు. ఈ కార్యము నెరవేర్చుటకు త్రికరణ శుద్ధిగా నట్టి మహానుభావులకు మనమందరము సాయపడవలయును.

స్వరాజ్యమునకు నూలువడకు రాట్నము ముఖ్యసాధనమని గాంధి మహాత్ముడు పలికినాడు. ఈ రెంటికిని పరస్పర సంబంధము కొందరికి గోచరించకున్నది. మనకును ఇంగ్లండు దేశమునకును గల నూలు బట్టల వర్తకమును, దానిలో నింగ్లాండువారికి వచ్చు లాభమును తెలుసుకొన్నవారికి తత్పరస్పర సంబంధము తెలియగలదు. గడచిన మూడు నాలుగు సంవత్సరములలోను అట్టి వర్తకము సగము భాగము తగ్గిపోయినట్లున్న ఆంగ్లపత్రికల మూలమున తెలియవచ్చుచున్నది. గాంధి మహాత్ముని సహాయ నిరాకరణోద్యమము లేనప్పుడే ఆంగ్లేయ దేశమునకు మన హిందూదేశపు బట్టల వ్యాపారమున నంత నష్టము గలుగగా నిప్పుడు సహాయ నిరాకరణోద్యమము వల్లనే విదేశ వస్తు బహిష్కార మెంతగా జరుగునో అందువలన ఆంగ్లేయులకు మరెంత నష్టము గలుగనున్నదో మనకందరకు స్పష్టమే. గాంధి మహాత్ముని సదుపదేశమును నాచరణలోనికి దెచ్చి ఊరూర, నింటింట రాట్నములబెట్టి నూలు వడకి స్వదేశ వస్త్రముల నేయించుచో మన హిందూదేశ వస్త్రదారిద్ర్యము వెంటనే విముక్తి కాగలదు.

ఈ యుద్యమము మహిమ ఇంతింతనరాదు. కవి హృదయము గల జనులు ఆలంకారిక మార్గమున నుపమోత్ప్రేక్షాద్యలంకారములతో నీ మహిమనే వర్ణించి ఉద్యమ ప్రాశస్త్యమును వెల్లడిచేసిరి. బన్నలబడుచున్న మన భారతమాతకు మానభంగము గాపాడి వస్త్రదానము చేసిన సుదర్శన చక్రమే యీ రాట్నపు చక్రమని శ్రీమతి సరళాదేవి చౌదరాణిగారు బల్కిరి. మంత్రశాస్త్రమున శ్రీ చక్రము చేతనే దేశాభ్యుదయమని మరియొక విద్వాంసుడు పలికెను. స్వతంత్ర

రహిత ప్రస్తుత పరిస్థితులయందు పాశ్చాత్య విద్యావేష భాషాభిమానులైన నవనాగరిక శిఖామణుల పోకులకును, పోకిళ్లకును తగిన సున్నితపు వస్త్రజాలముల సమకూర్చలేక పోయినప్పటికిని జనముల వస్త్రలోపమును మన రాట్నములు తీర్చగలవని నా నమ్మకము.

జాతీయవిద్య- జాతీయ విద్యయు, జాతీయ కళలు మొదలు గాగల విషయములను ప్రజాసామాన్యమునకు తెలియజేసే వారికిట్టి యుద్యమాభిరుచి పుట్టించి అందువలన దేశమునకు లాభము కలుగ జేయుటకై గ్రంథాలయములవారిని ప్రార్థించుచున్నాను.

గ్రంథాలయముం ముఖ్య కర్తవ్యము జ్ఞానప్రదానము. ఐహికాముష్మిక సుఖంబుల రెంటికిని గారణహేతువు జ్ఞానమే. అట్టి విషయముల తెలియజేయు గ్రంథములు గ్రంథాలయములలో నుండవలెను. నాగరిక ప్రపంచపు స్థితిని తెలియజేయు ఆంధ్రపత్రిక మొదలైన దినపత్రికలును, మరికొన్ని వారపత్రికలు, మాసపత్రికలును నందు చేర్పవలెను. దేశాభిమాన జనకములగు వీరపురుషుల జీవితములు, సుప్రసిద్ధ ఆంధ్ర గీర్వాణ కవి సార్వభౌముల సారస్వత ప్రసూనములును గ్రంథాలయముల నలంకరించవలయును. ఇంతదనుక నీ గ్రంథాలయములు భాషాసారస్వత పోషణములై, రాచకీయ, సాంఘిక, ఆర్థికాది గ్రంథములయందు తరచుగ ననాదరణ చూపినవి. అట్లుగాక యిప్పుడు వానికన్నిటికిని తగిన ప్రాముఖ్యము నొసంగి అందుల ప్రజాభిరుచి వృద్ధిపరచి వారిచే దేశహితైక కార్యములు చేయుంచునట్లు గ్రంథాలయములు నడిపించు భారము తమరు పూనవలెను.

శ్రీ గురజాడ దుర్గాప్రసాదరావు

— గ్రంథాలయ సర్వస్వము, ౨ వ సంపుటము. 1 వ. భాగమునుండి

# గోదావరీమండల గ్రంథాలయ ప్రతినిధుల ప్రథమ మహాసభ, అమలాపురము

[ 1917 ఏప్రిల్ 8 ]

**శ్రీ విస్సా అప్పారావు***

పుస్తకాలయ నిర్మాణము తొలుత భారతవర్షమునందు మహారాజుల ఔదార్యమువలన దేవాలయములయందును, రాజ నగరులయందును జరిగి, క్రమాభివృద్ధినొంది మహమ్మదీయుల కాలమున అంతరించినది. తిరిగి మన భాగ్యవశముచేత కొన్ని సంవత్సరముల నుండి దేశమున పునరుద్ధారణ చేయబడుచున్నది. బరోడా దేశమునందు శ్రీ శాయాజీగాయక్‌వార్ మహారాజుగారు 1910 సంవత్సరమునుండి గ్రంథాలయోద్యమమును దేశమందంతటను వ్యాపింపజేయుచున్నారు. ఈ యుత్సాహబలమే ఆంధ్ర గ్రంథాలయోద్యమమునకు మహత్తరమైన మూల కారణమని నమ్ముచున్నాను.

ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల ప్రథమ మహాసభ విజయవాటికయం దారంభమైనది. రెండవదియు, మూడవదియు ప్రాచీన ఆంధ్ర మహాకవులును, కవికుల భూషణులును, జగదేక పూజ్యులు నగు నన్నయ తిక్కనల కీర్తినిలయములగు రాజమహేంద్రవరమునను, నెల్లూరు పురమునను వరుసగ జరుపబడినవి. ఈ సంవత్సరము నాల్గవది గంజాం జిల్లాయందలి బారువ యను గ్రామమున జరుగనయి యున్నది. రెండు సంవత్సరములనుండి వివిధ మండలములయందు కూడ ప్రతినిధుల సభ లేర్పాటు చేయబడుట కారంభమై గంజాం, కృష్ణా, గుంటూరు, కడప జిల్లాలలో అట్టివి జరిగినవి. గోదావరి మండలమున నట్టి మండల గ్రంథాలయ ప్రతినిధుల సభ జరుపు విష

---

* ఆహ్వాన సంఘాధ్యక్షులు

యమున మనమిపుడే అమలాపుర గ్రామమున ప్రథమ సమావేశ మైనాము. ఈ ప్రదేశము, గోదావరి జిల్లాకంతకును గోదావరి జిల్లాకే కాదు అన్ని తెలుగు జిల్లాలకును నాయకమణియై నారికేళాది ఫల వృక్షోపేతమై సమశీతంబై గోదావరీ మహాజలముచే పావనమై, ఫల వంతమై చిరకాలమునుండి జగద్విఖ్యాతిగాంచిన వేద వేదాంగ పారం గతులును, షట్శాస్త్రవేత్తలును నగు మహాపండితుల కాలవాలమై సరస్వతీప్రసాదమును సులభసాధ్యము జేసికొనిన మహానుభావులకు జన్మస్థానమైన "కోనసీమ". ఇట్టి మహాక్షేత్రమున మండలసభ ప్రారం భమగుట గొప్ప శుభసూచకము.

మండల గ్రంథాలయముల స్థితి

1915 వ సంవత్సరాంతమున గోదావరి జిల్లాయందు సరిగా పనిచేయుచున్న గ్రంథాలయములు 43 ను, చరిత్రలు తెలియనట్టివి 10 ఉన్నటుల ఆసంవత్సరాంధ్రదేశ గ్రంథాలయ చరిత్రవలన గన బడుచున్నది. ఇటీవల, నేటివరకు సరిగా పనిచేయుచున్న గ్రంథా లయములు 58 వరకు పెరిగినటుల ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యనిర్వాహకులలో నొకరిచే తెలియవచ్చుచున్నది. చరిత్ర తెలియ నట్టివి తెలిసిన వానిలో కొంచెము తక్కువగా స్వల్పభాగమని దీని వలన స్పష్టము. దీనికి కారణమేమని ఆలోచించినయెడల తగిన పూని కయు, ఉత్సాహమును గలిగిన కార్యదర్శులు లేకుండుటయే యని నా నమ్మకము. గ్రంథాలయ పాలకుని సామర్థ్యముమీదనే గ్రంథాల యాభివృద్ధి నిలచియుండును. కార్యదర్శి స్వార్థత్యాగియయి దేశ సేవయందు దీక్షగలవాడై పట్టుదలగలిగి యుండినగాని కార్యానుకూ లము గానేరదు. అతడు సర్వదా గ్రామవాసులకు గ్రంథాలయ విష యమున అమితోత్సాహము కలిగింప సమర్థుడగుచు వారికి అనేక విధ ములతోడుపడుచుండవలయును. ఇట్టిపని నిర్వహించుటకు ఈ యుద్య మము తప్ప నిర్బంధకరమైన వేరు వ్యాపారముండిన వీలుపడదు. ఆరంభమందట్టివారు లభింపకున్నను ప్రస్తుతపు గ్రంథాలయ పాలకులు

అట్టి వారిని గ్రామమున ఒకరిద్దరు తరుణవయస్కులను సిద్ధపరచి వారికి తాము మార్గదర్శులయి సర్వ విషయములను బోధచేసి తప్పు కొనవలయును. అట్టి దీక్షగలవారు బయలుదేరినగాని గ్రంథాలయముల స్థితి ఔన్నత్యము వహించదు. కొన్ని చిన్న గ్రామములయందు గూడ రెండు మూడు గ్రంథాలయములున్నట్టు గ్రంథాలయ చరిత్ర వలన గనిపించుచున్నది. దుమ్ముగూడెం గ్రామమునందు మూడు గలవు. అందు ఒకటి 1909 వ సంవత్సరముననే స్థాపింపబడి స్వంత భవనము కలిగియున్నది. అట్లుండగా మహమ్మద్ మసూద్ సాహెబుగారు కార్యదర్శిగా ఉన్న సంఘమొకటి 1912 లోను, వైశ్యులచే స్థాపింపబడిన యింకొకటి 1914 లోను బయలుదేరినవి. ఇందులకు కారణమేమో స్ఫురించుటలేదు. ఇట్టివి షమ్మంజసములు గావు. మన యుద్యమమునకు సహకారులును కావు. ఇటీవలివి రెండును, స్వంత భవనమును గలిగినట్టిదియు, చిరకాల స్థాపితమును అయిన మొదటి దానితో కలిసిన ఎంత బాగుగానుండును! గ్రామస్థుల పురోభివృద్ధికిని, పౌర జీవితమునకు ఎట్టి సాహాయ్యమొనర్చును! కాకినాడ తాలూకా అంగ్రడంగి గ్రామములోని రెండు గ్రంథ నిక్షేపములకు కార్యదర్శి ఒక్కడే యున్నట్టులు గానవచ్చుచున్నది. కార్యదర్శి ఒకరైనప్పుడు రెంటిని కలిపివేయరాదా? భేదబుద్ధిలేక గ్రామస్థులు ఏకీభావమును జెందియుండిన అన్నివిధములచేతను అనుకూలముగా నుండునని విన్నవించు చున్నాడను. ఇట్టి లోపములు లేకుండ మనము ప్రయత్నించుట ముఖ్యాంశమని నొక్కి వక్కాణించు చున్నాను. ఆంధ్రదేశ గ్రంథ భాండాగారము లన్నిటిలోను ప్రాముఖ్యము వహించిన సర్వజనపుస్తక భాండాగారముయొక్కయు, వసురాయ పుస్తక భాండాగారము యొక్కయు కార్యనిర్వాహకులు వారి గ్రంథాలయములను రెండింటిని జేర్చి గొప్ప భాండాగారమును రాజమహేంద్రవరమున స్థాపింప నాలోచించుచున్నారు. అట్టి కార్యము మిక్కిలి సంస్తవనీయము. గ్రామమందు మంచి స్థితిలోనున్న గ్రంథ భాండాగారము

ఒక్కటియే చాలును. అందరి తోడ్పాటుచేతను, క్రమాభివృద్ధి జెంద గలదు. పఠనమందిరములు మాత్రము కావలసినయెడల అక్కడక్కడ స్థాపించుకొనవచ్చును. ఈ రీతిని అందరును ఒకరికొకరు తోడ్పడి ఉద్యమమును సర్వోత్కృష్టతకు దెత్తురని నమ్ముచున్నాను.

ప్రాత వ్రాత పుస్తకములు

పూర్వమునందు సంస్కృతాంధ్ర వాఙ్మయమంతయు తాళ పత్ర లిఖిత పుస్తములయందు సేకరింపబడిన సంగతి అందఱకును విశ దమే. ఆ గ్రంథములు ఆంధ్రదేశమందు నెక్కడెక్కడనో మూల మూలలను దాగి ఖిలమగుచున్నవి. వానినన్నిటిని జేర్చి యందలి సంగతులను వెల్లడిజేయుట మహోత్కృష్టమైన దేశసేవ. అది యీ గ్రంథభాండాగారోద్యమముయొక్క ముఖ్యాంగము. అట్టి తాళపత్ర ములను సేకరించు కేంద్ర గ్రంథాలయములు ప్రస్తుతము నాకు తెలి సినవరకు నాల్గు గలవు. తంజాపూరియందలిది మిక్కిలి ప్రాచీనము. తరువాతది మదరాసునందు దొరతనమువారిచే నేర్పరుపబడిన ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము. కొలది సంవత్సరముల క్రిందట ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు వేరొకటి స్థాపించినారు. కాని ఇవి యన్ని యును ఆంధ్రదేశ మధ్యమందు లేకుండుటచేత అట్టిలోటును దీర్చు కొఱకు దేశసేవా ధురంధరులును, యెర్నగూడెం జమీందారులు నగు మహారాజశ్రీ చెలికాని ధర్మారావు, లక్ష్మారావు, సూర్యా రావుగార్లు పీఠికాపురమున ఈ నడుమనే 'ఆంధ్ర పరిశోధకమండలి' యను పేర ఒక కేంద్ర లిఖిత గ్రంథాలయమును స్థాపనచేసిరి. దొర తనమువారు ప్రాచీన గ్రంథములను సేకరించి అముద్రితముల నచ్చొ త్తుటకుగాను ఉద్యోగస్థుల నేర్పఱచి తగిన ప్రయత్నముల జరుపు చున్నారు. దొరతనమువారి ఉద్యోగస్థులు మన జిల్లాయందు తిరిగి కొన్ని క్రొత్త గ్రంథముల సంపాదించినారు. అందులో ముఖ్యముగా ఈ కోనసీమయందు నెక్కుడు సంపాదింపబడినట్లు వారి 1915-1916 సం॥ కార్యనివేదికవలన తెలియుచున్నది. అందులో రాజవోలు

తాలూకాయందలి రావికొమ్మపాడు, ర్యాలి గ్రామములలోని వారి ద్దరయొద్ద చరిత్ర విషయములును, శబ్ద తత్వ విషయములును నగు అపూర్వ గ్రంథములున్నటులు విని వారి నెన్నివిధముల బ్రతిమాలి నను ఆ గ్రంథముల పరిశోధన జేయనీయలేదనియు, మేము ఆ గ్రంథ ములను అగ్నిదేవుని కర్పింతుముగాని మీకు మాత్ర మియ్యమనియు చెప్పినటులు నివేదికలో ప్రకటితమై యున్నది. చూచితిరా! మనవారి స్థితి. అంత పట్టుదల వారికేల కలిగెనో, ఈపని దేశాభివృద్ధికొరకు గదా యను చింత వారికేల లేకపోయెనో యను సంశయములు అంద రకును కలుగక మానవు. ఇక్కడి మహాజనులలో వారినెరిగిన వారె వ్వరయిన నున్నయెడల వారికి నచ్చజెప్పి తత్ప్రకటన మహాకార్య మును నిర్వహింప ప్రార్థించుచున్నాను.

ఈ మండలమందలి ప్రతి గ్రంథాలయమువారును తమ చుట్టు ప్రక్కల దాగియున్న తాళపత్ర గ్రంథములను సేకరించి జాగ్రత్త పెట్టుట ముఖ్యాంశము. తంజావూరియందలి యాంధ్ర లిఖిత గ్రంథ ములు అక్కడి వారికి అనుపయుక్తము గనుక ఆ గ్రంథములను ఎక్క డకును చెదిరిపోకుండునటులు ఆంధ్రదేశమునకు తెప్పించుకొనుటకు గాను ఈ సభవారు దొరతనమువారిని ప్రార్థించుట అత్యంత ఆవశ్య కమని తోచుచున్నది.

ఇంక జరుగనయియున్న కార్యక్రమమునందు మనము ఆచర ణీయములు, అత్యావశ్యకములునగు తీర్మానములను గురించియే చర్చింపవలయును. మన సామర్థ్యములను మీరిన తీర్మానములను చేసి ప్రతి సభయందును చర్విత చర్వణముగా తీర్మానించుట యెంతయు శోచనీయమును, హాస్యాస్పదమునయి యున్నది. మన మీ మండల సభను ప్రథమమున జరుపుచుంటిమి. కనుక కార్యములు కొలది కొల దిగా తలపెట్టి పూర్తిచేయ సన్నద్ధులము కావలెగాని యెన్నెన్నియో ఆదర్శము లొక్కమారే పెట్టుకొనినయెడల ప్రయోజనముండదు.

— గ్రంథాలయ సర్వస్వము, ద్వితీయ సంపుటము 3, 4 భాగములనుండి

# తృతీయ గోదావరిమండలి గ్రంథాలయ మహాసభ.

## చిత్రాడ

### శ్రీ ప్రభల లక్ష్మీనరసింహం పంతులు

విద్యావ్యాప్తి

సంగ్రామానుభవము వలన పెక్కులగు నూతన విషయములు గ్రాహ్యములయినవి. ముఖ్యముగ విద్యాదాన క్రమ పద్ధతులు విమర్శ లోనికి వచ్చినవి. పాశ్చాత్య విద్యయు, శాస్త్రము నింతవరకు మత విదూరములయి కేవల మైహిక తంత్ర ప్రావీణ్య జనకములయి యుండెను. అందువలన సర్వోత్కృష్టమగు శాస్త్రముకూడ పరహింసా సాధనమయినది. ధర్మగ్లాని సంభవించినది. మఱియు యువకులంద అను నూతన యుగమున భావి పౌరత్వ కార్యనిర్వహణమునకు దగిన శారీరక మానసిక సిద్ధులన్నియు నుచితరీతి బడయుటకు వలయు విద్యాపద్ధతులు నిర్ణీతములగుచున్నవి. దేహమాత్మ కర్మక్షమమై యుండవలయును. విద్య యైహిక పారలౌకిక జ్ఞానప్రదమయి యుండ వలయును. అప్పుడే నిజమగు నాత్మ స్వారాజ్య స్వాతంత్రము పురుషునకు లభించును. ఇదియే యుపనిషదర్థముకూడ.

గ్రంథాలయములు

ఇట్టి విద్యావ్యాపనమునందు గ్రంథాలయములు ముఖ్య సాహాయ్యములు. పండితున కుత్తమ గ్రంథములకంటె మఱొండు ధనము లేదు. అపరిగ్రహులగు సన్యాసులకు గూడ గ్రంథములే ధనముగా నెంచి తద్దాయ విభాగమునుగూర్చి విజ్ఞానేశ్వరయోగి సూత్రము లేర్పఱచినాడు నిరతిశయమగు సర్వ ప్రాపంచిక సౌందర్య సారము నొక్కచో జేర్కొనవలసినచో శాకుంతలమును స్మరింప జనునని

జర్మనుకవి యుగ్గంచి యుండెను. ఒక్క గ్రంథరాజముయొక్క మహాత్మ్యమట్టిది యగునెడ నద్భుత గ్రంథరత్న భాండాగారమగు గ్రంథాలయ మహిమ నెట్లు వర్ణింపనగును? పూర్వకాలమునుండియు గ్రంథ ప్రశస్తి మన దేశమున గ్రహింపబడి సుప్రసిద్ధ రాజ్యస్థానములయందును, నవద్వీపాది విద్యానిలయములయందును, మఠములయందును, దేవళములయందును, పండిత గృహములయందును గ్రంథములు పెక్కులు సంగ్రహింపబడుచుండెను. కాశ్మీరు దేశమున శ్రీనగరమున సరస్వతీపీఠమని ప్రశస్తిగాంచినది యచ్చటి గ్రంథరాజములును, విద్వచ్ఛ్రేణియు నైయున్నవి. మతోద్ధారకులు కూడ దూరాధ్వములు నడచి యచటికేగి విజయముగాంచి, తమ గ్రంథములనిచ్చి మతవ్యాపనదీక్ష వహించి యుండిరి; గ్రంథాలయముల యాకర్షణశక్తి యట్టిది. వారణాసి క్షేత్రముకూడ నట్టిదే. బౌద్ధమత ప్రచారముగల కాలమున బౌద్ధ విహారములయందెన్నియో యుత్తమ గ్రంథములుండి యుండెను. మతములు క్షీణదశకు వచ్చి రాజ్యము పరహస్తగతంబైన పిదప ప్రజలయం దుదరభరణమే కష్టమగుటను విద్యావ్యాసంగము, గ్రంథ సంపాదనాసక్తియు తగ్గిపోయి యుండుటను గ్రంథము లనేకములు ఖిలములయినవి. భారతఖనియం దమూల్య రత్నములగు గ్రంథరాజములు కొన్ని విదేశ రాజ్యగతములయినవి. సంధి విషయమున భరతఖండమునుండి జర్మను చోరులవలన గొంపోబడిన గ్రంథరత్నముల దిరిగి మనదేశమున కర్పింపబడువట్లుల గోరుదని వాక్రుచ్చిన హిందూమహాసభాధ్యక్షకోపన్యాసము మన సంత్రాసమును వెలిబుచ్చుచున్నది.

గ్రంథాలయోద్యమము

పూర్వ గ్రంథాలయ చారిత్రమటులుండ నవీన గ్రంథాలయ విజృంభణ మించుక యాలోచింతము. పాశ్చాత్య దేశములయందీ యుద్యమము బాగుగ బాదుకొని ప్రభుత్వము వలనను, విశ్వ విదా

లయములు మున్నగు ప్రతిష్ఠాపనలవలనను బోషింపబడుచున్న యంశము లెల్లరకును విదితంబయి యున్నది. పుస్తక సామగ్రియు విజ్ఞానమును విచ్చలవిడిగ ప్రజలకందఱకును సులభ్యములగునటుల దగు యత్నములు నిరంతరము జేయబడుచుండును. దివ్యభవనములు పుస్తకాలయములుగ నిర్మింపబడి యున్నవి. ఉచితముగను, అల్పములగు చందాలవలనను నమూల్యములగు పుస్తకముల ప్రజలు జదివి జ్ఞానాభివృద్ధి చేసుకొను సాధనములు పాశ్చాత్య దేశములయందు గలవు. స్త్రీలకును, పురుషులకును నీ రూపమున విద్యాగ్రహణము సులభసాధ్యమై యున్నది. లక్షలకొలది ద్రవ్యము వెచ్చింపబడును. చదువరుల నాకర్షింపదగు నానావిధ సౌకర్యములు గూర్పబడును. పుస్తకములలోని సారమున కనురూపముగ బాహ్యాలంకారములు, చిత్రముద్రణము, సొగసైన యట్టలు మొదలగు నెన్నియో యలంక్రియ లొనగూర్పబడును. మరియు పుస్తకము లసంఖ్యాకములగుటచే పెక్కుచోట్ల పుస్తక వివరణ పట్టికాక్రమమే యొక శాస్త్రముగా నభ్యసింపబడుచున్నది. అమెరికా దేశము నన్నివిధముల నీ యుద్యమము లుత్కృష్టదశయందున్నది. మన దేశమున బరోడా సంస్థానమునందు శాస్త్ర పరిశోధిత పద్ధతుల నీయుద్యమము వ్యాప్తిజెందునటుల జేయబడుచున్నది. మన యాంధ్ర దేశమున ముఖ్యముగ నా మిత్రులగు శ్రీయుత అయ్యంకి వెంకటరమణయ్య పంతులు, శ్రీయుత సూరి నరసింహశాస్త్రిగార్లచే నీ యుద్యమము వ్యాప్తము కాబడినది. వారి భాషాభిమానము, దేశసేవారతియు సంస్తవనీయములు. ఉద్యమ మారంభమయినది మొదలు సర్వాంకషముగ నాంధ్రలోకమునందంతటను కొనలుసాగినది. అభినవ దీప్తితో విరాజిల్లుచున్నది. ఇతర దేశములకు మార్గదర్శకమగుచున్నది. ఈ సంవత్సరమున రాబోవు నాంధ్రదేశ గ్రంథాలయ మహాసభతోగూడ అఖిలభారత దేశీయ గ్రంథాలయ మహాసభ గావింపబడుటకు బ్రయత్నములు సలుపబడుచుండుట హృదయానందదాయకముగ నున్నది. ఇదియే యా

యుద్యమముయొక్క జీవశక్తికిని, ముఖ్య తత్త్వమునకు దృష్టాంత మయి యున్నది. ఆంధ్ర జీవితమును విద్యావాసనాయుతముగ జేసి యన్నివిధముల నైసర్గిక తేజముతో బ్రజ్వరిల్లజేయ సమకట్టినదీ యుద్యమమే కావున ఆంధ్రోద్యమమున కుపాంగములగు నుద్యమము లలో నిది ప్రాముఖ్యమును గాంచినది.

గ్రంథాలయములు-వాని కార్యములు

సరస్వతీనిలయములగు గ్రంథాలయము లూరూరను బ్రబలు చున్నవి. మండలముల ముఖ్యపట్టణములయం దుత్తమ గ్రంథాలయ ములు వెలయుచున్నవి. ఆంధ్ర దేశమున కేంద్ర గ్రంథాలయముల గూర్చి సత్ప్రయత్నములు సాగుచున్నవి. వాగ్దేవి నిజ పద మంజీర మంజుల ధ్వనులతో గ్రంథాలయసీమల నాట్యమాడుచున్నది. చదు వరుల వాఙ్మందిరముల శాశ్వతవసతిని గోవ యత్నించుచున్నది. సదా వాక్కున నివసించు నధిష్ఠాన దేవత కావున మన పెద్దలు శారదా దేవికి లక్ష్మీ పార్వతులకు బోలె దేవళములు నిర్మింపరైరి. వాఙ్మ యముల చేతను, భవ్య భావ తరంగ విధులచేతను నిత్యము పూజింప బడుచున్నది. అటులుపాసింపబడిన వాగ్దేవి సంప్రీతురాలై యభీష్ట ముల నొసంగుగాని వేఱొండు విధమున కరుణాపాంగదృష్టిని బ్రసా దింపనేరదు. "నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్! దేవీం సరస్వతీం వ్యాసం తతోజయ ముదీరయేత్." అని మహాభారత ముఖమున వ్రాయబడి యున్నది. జన ప్రబోధమునకై అత్యంత దయాశాలినియగు సరస్వతీదేవివలన నావిష్టుడయి గ్రంథరచనకు వ్యాసుండు గడగెను. ఆదికవి వాల్మీకికూడ బ్రహ్మవలన "మచ్ఛం దాదేవ తే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ" యని యాదేశింపబడి యాది కావ్యరచనకు దొడగెను. అటుల సరస్వతీ ప్రేరణమున రచిం పబడిన గ్రంథములు దక్క వేఱొండు శాశ్వతకీర్తిని గాంచనేరవు. సరస్వతీ భూషణములగు నుత్తమ గ్రంథముల గ్రంథాలయములు సమకూర్చి భద్రపరచుచున్నవి. లేనియెడ మాఱుమూలల మాట

మడిగి కొన్నియు, క్రిమికీటములపాలయి కొన్నియు మఱియు నితర విధముల నశించిపోవును. గ్రంథాలయోద్యమము వెలువడిన కొలది కాలములోపల నెన్ని యుత్తమ గ్రంథములు తాళపత్ర సంచికల సంపుటములుగా నొనర్పబడినవి బయటకు వచ్చినవి! నామావశిష్టములగు నవి యెన్నియో ప్రత్యక్షానందము గలుగజేయుచున్నవి. ఈ విషయమున చిత్రాడలో నెలకొల్పబడిన శ్రీరామవిలాస గ్రంథాలయ సభ్యులయొక్కయు, శ్రీ చెలికాని ధర్మారావుయొక్కయు, వారి సోదరవర్గముయొక్కయు ప్రయత్నములును, ఉత్సాహములును శ్లాఘాపాత్రములు. గ్రంథాలయోద్యమము వెలువడక పూర్వము నుండియు శ్రీ వీరేశలింగ పుస్తక భాండాగారాద్యుత్తమ పుస్తకాలయముల నెలకొల్పి స్త్రీ పురుషులకు విద్యాదానమొనరించుచున్న యీ గోదావరీమండల వాస్తవ్యుల కంతగా వీని యుపయోగముల గూర్చి చర్చించుట యనవసరమును, సూర్యునకు కరదీపికను గనుపరచిన యట్లు వృథా ప్రయాసమును అగును. గ్రంథాలయములు పైని వివరించిన విధమున గ్రంథ సంగ్రహణము, సంరక్షణమును మాత్రము నిర్వర్తించుచుండుటయేగాక గ్రంథరచనకు దోడ్పడుచుండుటయు, మఱియు సభ్యుల వివిధ కళాయుక్తులుగను, జ్ఞాన సంపన్నులుగను జేయుటకు యత్నించుచుండుటయు కడు సమంజసమైయున్నది. కావుననే ఈ యుద్యమము సర్వలోకసమ్మతము నార్థలోకమున కుపకృతి నొనర్చుచున్నది.

గ్రంథ రచనము

ఈ విషయమున నా యభిప్రాయముల వెఱుస్థలమున వ్యక్తపరచి యుండుటచే పునరుక్తి కాకుండ కొలది యంశములను మాత్రము విశదీకరించి విరమించెదను. గ్రంథరచనకు కారణభూతము సరస్వతీ ప్రేరణమని యిదివరకే నుడివియుంటిని. ఆలంకారిక వచనము లటుండ కావ్యమునకు ప్రయోజనము ముఖ్యము. కవి యొక యుత్తమ సందేశహారుండయి యుండవలెను. కవి హృదయ మాయు

త్తమ సందేశ ప్రపూర్ణమయి పొంగి పొరలి కావ్యస్వరూపఝరీవేగ మున ప్రవహించును. అట్టి సందేశ మాయా దేశ కాల పరిస్థితుల ననుసరించి యుండును. లోకోత్తర వర్ణనములచే సామాన్య విషయ ములగూడి వినూత్న భావ ద్యోతకములుగా సత్కవీంద్రుడు ప్రదర్శిం చుచుండును. ప్రకృతి లీనమగు భగవత్తత్త్వము కవి కన్నులయెదుట గట్టబడి యుండును. కవి తన మనోభావముల చదువరుల హృదయ వీథుల ప్రవర్తింపచేసి యంతరింద్రియమోదము గూర్చుచుండును. ఉత్తమ కావ్యమీవిధమున రసముప్పతిలజేసి విమలానంద మొన గూర్చుచుండును. శబ్దములందలి నిగూఢ మాధురిని మథించి యమృత స్వరూపమున శ్రోతల శ్రవణపుటముల జొనిపి యంతర్నాడీ తంత్రుల దను రూపముగా నవ్యగానామృతము వెలువడునటుల జేసి నిరతి య సుఖమున నోలలాడించు చుండును. కుశలవులవలన రామాయ ణమును విని మునులీ తీరున నానందించిగదా ప్రశంసించిరీవిధమున. 'అహో గీతస్య మాధుర్యం శ్లోకానాంతు విశేషతః! చిరనిర్వృత్తమ ప్యేతత్ ప్రత్యక్షమివదర్శితమ్''. ఇట్టి కావ్యములన్ని భాషలయందును మహాకవులచే రచింపబడి యున్నవి. భారత వర్షమున ప్రస్తుతమందు భారత జాతీయ తత్త్వము నిజహృదయమున ప్రతిఫలించుచుండ దివ్య తేజః ప్రభా దీపితుండయి శ్రీయుత రవీంద్రనాథ ఠాకుర్ కవిచంద్రుడు భారత సందేశము నేవిధమున కావ్యరూపమున రచించుచున్నవాడు! ఆయన కవిత్వము ప్రపంచమునందంతట ప్రశస్తిగాంచినది. రవీంద్రు నివంటి కవీంద్రుడు ఆంధ్రమునగూడ వెలయుగాక! అందాక గ్రంథా లయములు రవీంద్రుని కావ్యముల సారమును నాంధ్రజనులు గ్రోలు నటుల సౌకర్యము లొనగూర్చుచుండుగాత! వర్తమానమున నాంధ్ర వాఙ్మయమున నాంధ్రతత్త్వము ప్రతిఫలించుచు వికాసము గాంచు చున్నయది. కాని యింకను అభినవ సంశోభచే దివ్యతేజముతో తేజరిల్లదగి యున్నది. ఆంధ్ర సరస్వతి యింతదనుక కావ్యక్రీడలచే శైశవావస్థయందు క్రీడించుచున్నది. నాట్యరంగమున నూతన పద

విన్యాసము లభ్యసించు చున్నది. భావ గాంభీర్యమును వెలిబుచ్చు చున్నది. శాస్త్రమర్యాదల కొలదిగ నభ్యసించు చున్నది. బాహ్య దృష్టిచే ప్రకృతి సౌందర్యమును దిలకించి వర్ణనాతిశయమున భావో ద్రేకమును జెందుచున్నది. కాని యాదిభౌతికమగు సంపదనుగాని భావ ప్రపంచమున నంతరింద్రియ గోచరమయి నిరతిశయానంద సంధాయకమగు ప్రకృతి స్వభావమునుగాని గ్రహించినటుల గాన ఁడు. కావుననే సావయవరూప భూత సృష్టియందలి నిరుపమ సౌందర్య జాలము చక్కఁగ నభివర్ణింపబడుచున్నది. కాని నిరవయవ మును, స్వాత్మైకవేద్యమును, నిగూఢమునునగు భావతత్వమును బాగుగ గ్రహించినగాని యుత్తమ సందేశము కవి మనోవీథి శబ్దబ్రహ్మ స్వరూపమయి నాదముచేయుచుండుట యరిది. కవి త్రికాలజ్ఞుడు. లోకజ్ఞుడు. "నాఋషిః కురుతే కావ్యమ్" అని పెద్దలు నుడువుదురు. 'కంఠమందున నోంకార ఘంటమెరయ జెలఁగుగావుత మన్మనః క్షేత్రసీమః గవికుటుంబంబుపాలిటి దివిజసురభి జలజసంభవకోటి భామావధూటి" యని భావగర్భితముగా శ్రీనాథుడు సరస్వతీస్తవ మును జేసియున్నాడు. ఆంగ్లమున నుత్తమ సందేశ ద్యోతకములగు కావ్యములు మెండుగలవు. శబ్ద నిగూఢ మాధురీ విలసితములగు కావ్యజాలములు సారస్వతము నలంకరించుచున్నవి. ఆంగ్ల కవిత్వ మును మాతృకగా నిడుకొని యాధునికులలో శబ్దార్థ గౌరవముల నసమాన పాండితీ మహిమగల టెన్నిసన్ (Tennyson), స్విన్‌బర్నె (Swinburne) మున్నగు కవీశ్వరుల కవన చాతురులను గ్రహించి కావ్యములు రచించుచో నాంధ్ర వాఙ్మయాభివృద్ధి గలుగునని నా యాలోచనమై యున్నది. రవీంద్రుని గ్రంథము లవశ్యము పఠనీయము లని యిదివరకే నుడివియుంటిని. అభినవ కవి సార్వభౌములీ విషయ మును గుర్తింతురుగాక! అనుకరణ పద్ధతి యప్రశస్తమయినను నారంభదశయం దనివార్యము. ఉత్తమాచరణానుసరణమున వివేకము జనించి భావోదయము గలుగును.

శాస్త్రములు - కళలు

వర్తమానమం దాంధ్రవాఙ్మయ వాహినియం దన్నివిధముల గ్రంథజాలములు ప్రవహించుచున్నవి. పల్వలోదకమయిన పవిత్ర గౌతమీ ప్రవాహమున గలసి పునీతమైన భంగిని యాంధ్రత్వమును ప్రతిఫలించుచు నాంధ్ర సందేశమును ప్రకటీకృతము గావించు చున్నందున నన్నిగ్రంథములు నాదరణీయములగుచున్నవి. ఉత్తమ విమర్శ గ్రంథములును. భాషాచారిత్రమును, వాఙ్మయ చారిత్ర మును యింకను వెడలవలసి యున్నవి. అభినవాంధ్ర కవితా పితా మహులగు రాయబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు కవిజీవితముల వ్రాసిరి. సారస్వత చరిత్రమునుగూడ వ్రాసి యాంధ్ర లోకము నుద్ధరింతురుగాక! కాని దేశ పరిస్థితులనుబట్టి శాస్త్ర గ్రంథ ములు కళలను బోధించు గ్రంథములు విస్తరిల్లవలసి యున్నవి. వీనికి దగు పదసామగ్రికూడ మన భాషలో లేదు. అన్యభాషా పరిచయ మునగాని శాస్త్రసంబంధములగు భావములు, నామములు సువ్యక్త ములుగ నాంధ్రమున బలుకబడనేరవు. దేశభాషలలో గొన్నిట యీ కొఱంత కొంతవరకు దీర్చుకొనబడుచున్నది. అఖిలభారత పండిత సమ్మేళనమునగాని సర్వజన సమాదరణీయములగు పదములు నిర్ణయింపబడుటకు వీలుకాదు. అట్టి పనికయి పండితులు గడగుదురు గాక! ఆంధ్ర నిఘంటువునందయిన కొంత యత్నము సలుపబడునని యూహించుచున్నారము. గ్రంథాలయము లన్నివిధముల శాస్త్ర ములు, కళలు వృద్ధిజెందు నుపాయము లన్వేషింప కృషి సలుపుచుం డుట నీయంశమిచ్చట జర్చించితిని.

— గ్రంథాలయ సర్వస్వము, ౩-వ సంపుటము 6-వ భాగము నుండి

# పశ్చిమగోదావరి మండల గ్రంథాలయ సభ, భీమవరము

[ 1923 ఏప్రిల్ 19 ]

శ్రీ కొండిపర్తి వీరభద్రాచార్యులు

వర్తమాన కాలమున భారతభూమికి యుగసంధి సమయముగ నున్నది. ప్రపంచమంతటికిని గూడ నిది యుగసంధి కాలమే యగును. నానా దేశములందును పశుబలమునకును, ఆత్మబలమునకును పోరాటము జరుగుచున్నది. పశుబల యుగమంతరించి ఆత్మబల యుగోదయము గానున్నది. ఈ పోరాటము యూరపునందు దవానలము మాడ్కి ప్రజ్వరిల్లినది. లోకమున కంతటికిని వ్యాపించినది. సకల దేశములకును మధ్య యురపు కేంద్ర సంగ్రామ క్షేత్రమైనది. జర్మను యుద్ధమనునది ప్రపంచ యుద్ధమే. యురపు ఖండాగ్నేయభాగమున నీ యగ్ని రగులుచునే యున్నది. జర్మనీయందును కీలులడగి యొకింత నివురుగప్పినదేగాని యగ్ని చల్లారలేదు. కాలపురుషుడు మహారౌద్రమూర్తియయి యీ ఘోర సంగ్రామమును నడుపుచున్నాడు. ఒక యుగ సంప్రదాయమును మార్చి వేరొక యుగ సంప్రదాయమును ప్రవేశపెట్టు తలపుతో భగవంతుడు ఇట్టి విలయములను గల్పించుచుండును. పశుబల సంప్రదాయము సమస్త జాతుల స్వత్వములను హరించినది. మహా పవిత్రోద్యమములకు వినియోగపడవలసిన విజ్ఞాన సంపదయంతయు లోకమున పశుబలమును బెంపుచేసినది. అది ముగ్గినది. రాలుటకు కాలము వచ్చినది. ప్రపంచమందలి శాస్త్రవేత్తలందఱు తమ గ్రంథాలయములను, ప్రయోగశాలలను మారణయంత్ర నిర్మాణమున కుపయోగించిరి. వాని నన్నింటిని ప్రయోగించిరి. అది భస్మాసురుని వరమైనది. దీర్ఘ తపముచేసి యీ వరమును సంపాదించిన రాజలోకము దాని మూలముననే హతమగుచున్నది.

ప్రపంచ పునర్నిర్మాణముకొఱకు ఆత్మబల సంప్రదాయము ప్రతిష్ఠితము గావలసియున్నది. ఈ తత్వమును ఉపదేశించుటకు భారతభూమికి మాత్రమే అర్హతగలదు. పశుబలము వ్యష్టి ప్రేరిత మైనది; స్వార్థమే గమ్యము గాగలది. లోకములో దాను కేంద్ర బిందువై నిలచి సర్వమునకును గళ్లెము తగిల్చి, తంతువులను దాను వహింపజూచును. స్వాతంత్ర్యము ప్రకృతి లక్షణము. దీని నరికట్టు యత్నములకు భంగపాటు తప్పదు. ఆత్మబలమునకు సమదృష్టి కలదు. సమస్తమును దనయందే చూచును. ఒకరినిగాదని ఒకరిని నిర్జించి తాను స్వార్థముగా పొందునది లేదు. సర్వమునకును స్వాతంత్ర్యము నంగీకరించును. తాను సర్వదా స్వతంత్రము ననుభవించుచునే యుండును. 'ఆత్మవత్సర్వభూతాని' యను ధర్మము నుగ్గుబాలతో గ్రోలిన భారతభూమియే యీ ధర్మమును బోధించగలదు. భారత భూమియే గురుపీఠము నధిష్ఠించి, అహింసావ్రతమును లోకమునకు బోధించగలదు. ఈ వ్రతకల్పము భారతికిని మఱపునకు వచ్చినది. చిరకాలము పరాధీనతయందు గుందియుండుటచే విస్మరించినది. ఇప్పుడు దానికొఱకై తన పుస్తకములను దిరుగవేయవలసిన కాల మాసన్నమైనది. ఆమె పుస్తకములన్నియు జెల్లాచెదరై అందందు బడియున్నవి. వానిని వెదకి క్రోడీకరింపవలయును. శ్రీ వివేకా నందస్వామి యీ సంఘటనను తన వివేకచక్షువున జూచి, ముప్పది సంవత్సరములకు బూర్వమే జ్యోతిషము చెప్పియున్నాడు. అచిర కాలములో ఆధ్యాత్మికబోధకై ప్రపంచము భారతభూమినాశ్రయించు నని తెలిపియున్నాడు. భారతీయులు తమ దీర్ఘనిద్రను దమంత తాము విడువరేని లోకమే బలాత్కరించి నిద్ర మేలుకొలుపునని ముక్త కంఠ ముతో బలికియున్నాడు. ఇప్పుడా సమయమే తెంచినది. ఘనతర తత్వార్థములగూర్చి పాఠములు చెప్పుటకు గ్రంథ పరిశోధన యవస రము. కల్లబొల్లి మాటలుపకరింపవు. తదనుగుణ్యముగ నీగ్రంథాల

ద్యోగాద్యమము తలయెత్తినది. సరియైన కాలమున బయలువెడలినది. లోక గురువులను సిద్ధముచేయుట కేంద్ర గ్రంథాలయములకు దప్పని విధి. పశుబలము స్వార్థప్రేరితమైనది. ఏ వ్యష్టినరుడో, సంఘమో, జాతియో స్వార్థసాధనకై పూనిన కార్యములను పలువుర సహకారము పొందుకొఱకు సమిష్టి కార్యముగను, లోకోద్ధరణ కర్మగను ప్రకటించి మోసగించును. తుదకు ఫలమును బంచుకొను తఱిని మోసములు తెల్లమగును. యూరపునందలి వ్యష్టిజాతులు తమతమ స్వార్థముల కొఱకై రణమును సాగించి దానిని లోకశాంతి స్థాపన ప్రయత్నముగ ప్రదర్శించి యనేకుల నందు ప్రవేశపెట్టెను. తుదకు జర్మనీ నిర్జింపబడినది. విజయులు లాభముల బంచుకొనవలసి వచ్చినది. ప్రతి జాతియు తన పచ్చనే జూచుకొనుచు మిత్రమండలిని నుపేక్షింప సాగెను. పరస్పర భేదభావములతో గొట్టుకొనుచుండిరి. రణసీమల జచ్చినవారిని, మందుగుండు సామానుల వ్యయమును, నష్టపరిహారపు మొత్తములను, రాజ్యలాభములను లెక్కవేసినంత మాత్రాననే ఈ యుద్ధ చరిత్రను మనము తెలిసికొనిన వారముగాము. వీని యన్నింటికిని వెనుకనున్న నైతిక పరివర్తనమును గమనించవలయును. దానిని ప్రపంచమునకు జాటవలయును. పశుబలప్రయోగము క్షుద్రమనియు, వ్యర్థమనియు మనము లోకమునకు బోధించవలయును.

మనము లోకమునకు ఆత్మమహిమను బోధింపవలయును. మానవధర్మము నుపదేశింపవలయును. ఇది వ్యష్టిధర్మము గాదు, సమిష్టి ధర్మము. విశ్వజనీన ధర్మము. దీనివలన నొక వ్యష్టి, లేక యొక సంఘము, ఒక జాతి మాత్రమేగాక ప్రపంచమంతయు తరించవలయును. ఆ గురుపీఠము నధిష్ఠించుటకు మనము తరిబీదును పొందవలయును. భారత సంప్రదాయము ననుసరించి ఆ తరిబీదుండును. అందుకొఱకు ఎందెందు విజ్ఞానలేశములున్నవో వెదకి వానినన్నింటిని సంపుటీకరించవలయును. ఇందు ప్రకృతి శాస్త్రములు, రాజనీతి, అర్థనీతి, శిల్పశాస్త్రములు, మానసిక శాస్త్రములు, చిత్రకళలు,

అధ్యాత్మిక తత్వదర్శనములు, ఇవి యవి యననేల సమస్త విజ్ఞానమును భారత సంప్రదాయమును ప్రకటించుటకై యుపయోగించుకొనవలయును. దాని వికాసమున కనుగుణ్యమగు విషయములున్నయెడ నన్యులనుండియు స్వీకరించి పెంపొందించవలయును. ఈ పని గ్రంథాలయోద్యమ ద్వారమున జక్కగ నెఱవేరగలదు.

పూర్వకాలమున గ్రంథములు ముద్రితములై యుండని కతమున విద్యార్థులు పలు కష్టములు పొందుచు వచ్చిరి. వేనవేలు గ్రంథములు తాటియాకులలో వ్రాయబడి రామబాణములకును, వల్మీకములకును నెఱవై యుండెను. అట్టి స్థితిలోను మన పూర్వులనేక కష్టములకోర్చి చాల గ్రంథములను రక్షించి మనకిడియున్నారు. వారనేకములగు గ్రంథాలయములను నిలిపి పోషించియున్నారు. మఱియు భిన్నభిన్న సంఘములవారు మైత్రిం గల్పించుకొని సోదర భావముతో మెలంగుటకై తమ తమ సంప్రదాయములకు సామరస్యమును గుదుర్చుకొనుచు వచ్చిరి. గ్రంథాలయములిందుకు మిగుల నుపకరింపుచు వచ్చినవి. అష్టాదశపురాణములు, మహాభారతము శ్రీ వ్యాసులవారు రచించెనందురు. దీనియర్థమేమి? ఈ పుస్తకములందు శైలి, భాష, భావములు మత విశ్వాసములు, తత్వ పరిభాష, వీనియందనేక భేదములు గాన్పించుచున్నవి. ఒక్కొక్క పుస్తకమునందే యిట్టి భేదములు చాల గాన్పించుచున్నవి. పరస్పర విరుద్ధాంశములును జూపట్టుచున్నవి. అనేక దేశముల వర్ణనలు, వివిధజాతుల ఆచార వ్యవహారములు, మత ధర్మములు యీ గ్రంథములం దిమిడి యున్నవి. ఇవి యొకచో నాదర పూర్వకముగ జేర్కొనబడినవి. వేరొకచో క్షుద్రములుగ ఖండించబడినవి. పూర్వ గ్రంథ పరిశోధనా ధురీణులు దీని కనేక కారణముల దెలుపుచున్నారు. అందొకటి పేర్కొందును.

క్రీస్తుశకము నాలుగవ శతాబ్దమునాటికి భారతదేశము భిన్న భిన్న జాతులకు నిలయమై యున్నది. వారి భాషలు, వేషములు

ఆచారములు, నీతి ధర్మములు నన్నియు భిన్నములుగ నుండియున్నవి. దిగ్విజయములగాంచి వీరినందఱిని శాంతచిత్తులుగ జేసి, పరస్పరానురాగముతో సోదరుల భంగి జీవించునటుల జేయుటకై యనేక ప్రయత్నముల గావించి, వ్యర్థమనోరథులై విసిగి వేసారిరి.

ఉజ్జయిని ప్రభుడగు విక్రమాదిత్యుడు ప్రజల స్థితిగాంచి ఖిన్నుడగుచుండెను. ఈతడు విద్యావంతుడు. పండితాభిమాని. ప్రజారంజకుడు. ప్రజలందు మైత్రిని గొలుపుటకు తనకంటె పూర్వులు చేసిన ప్రయత్నములను వివేక దృష్టితో విమర్శించెను. ఉపాయాంతరమును గనిపెట్టుటకై కృతనిశ్చయుడయ్యెను. తన రాజ్యమునందును, నితర రాజ్యములందును గల పండితవర్యులను, విజ్ఞాననిధులను, వ్యవహార దక్షులను, ప్రజాప్రతినిధులను రావించెను. పరస్పరభేదములు, విద్వేషములు నందఱికిని దుఃఖహేతువులే యనియు, అందఱును సహిష్ణుత గలిగి మిత్రత్వమున మెలగుట సర్వప్రజలకును నానందదాయకమనియు, అట్టి సమరస భావమును గూర్చు నుపాయము నరయుడనియు వేడుకొనెను. ఎవరును తమ ప్రత్యేక లక్షణములను, వ్యక్తి ప్రతిభను బోనాడుకొన నవసరములేదు. అప్రధానాంశములను, ప్రధానాంశములను నిర్ణయించుకొని మొదటివానిని సడలించుట కోడంబడుచు రెండవ వానికి సమన్వయమును గూర్చుకొనుడని కోరెను. ఈ మహా కార్యమును నిర్వహించుకొఱకు వారినందఱను నొక గ్రంథాలయముచెంత సమావేశము చేయ నిశ్చయించెను. వారికే గ్రంథము కావలయునన్నను మథుర, అయోధ్య, పాటలిపుత్రము, తామ్రలిప్తి, కపిలవస్తు, రాజగృహా, వారణాశి, తక్షశిల, ఉజ్జయిని మొదలగు ననేక నగరములందు పెద్దపెద్ద గ్రంథాలయములు కలవు. వానిలో కొన్నింట బౌద్ధ ధర్మ గ్రంథములు, కొన్నింట వైష్ణవ సంప్రదాయ గ్రంథములు, మఱికొన్నింట శైవమత గ్రంథములు ముఖ్యముగా జేర్పబడి యున్నవి. ఇట్లనుటచేత వానియందు తదితర గ్రంథములు లేవనిగాదు. పై వానికి ప్రాధాన్యము నిచ్చిరని తెలియవచ్చుచున్నది.

కాని కాశీనగరమున అన్ని సంప్రదాయములకు సంబంధించిన గ్రంథములు చేర్చి పెట్టబడియుండుటచేత, విక్రమార్కుడా పండిత సభను కాశీయందు సమావేశపఱచెను. ఆనాటి పండితులు సామాన్యులు గారు. విద్యాసాగరులే యనదగును. వారందఱిలో వ్యాసుడు మేటియై యొప్పిన సభాధ్యక్షపదవిని నిలుపబడియెను.

వ్యాసులవారి ఆధిపత్యమున మహాసభలో నన్ని పక్షముల వారును, తమ తమ సంప్రదాయములనుగూర్చి వివరించుచు నుపన్యాసముల నొసంగిరి. ఈ యుపన్యాసములు పరమత సహిష్ణుత గలిగి, తమ సంప్రదాయ మహిమను ప్రకటించునవిగనే యుండెనుగాని పరమత దూషణముమాత్రము లేదు. ఇట్లు చాల దినములు గడచిన పిమ్మట పండితులు తమలో దాము సంప్రదింపులు నడిపి ప్రధానాప్రధానముల నిర్ణయించుకొనిరి. సమరస భావమునకు మార్గమేర్పఱచుకొనిరి. తుదకు ఎవరి సంప్రదాయమునకు వారు ప్రాముఖ్యతనిచ్చుచు గ్రంథముల వ్రాయుటకు గడంగిరి. ఆ గ్రంథములన్నియు సిద్ధమైన పిమ్మట వానినన్నింటిని వ్యాసులవారే ప్రధాన సంపాదకుడుగ నుండి కొలది సవరణలతో ప్రకటించిరి. కేవలము పై వివరించబడిన రీతినే కార్యక్రమమంతయు జరిగినను లేకున్నను ఆ పంథా ననుసరించి గ్రంథరచన జరిగెనని యొప్పుకొనవచ్చును. ఈ మహాత్కార్యమునకు వారణాశి గ్రంథాలయము మహోపకారియయ్యెను.

ఐదు, ఏడు శతాబ్దములందు చీనాదేశీయులగు ఫాహియాన్ హ్యూంత్సాంగు అను నిద్దరు బౌద్ధయాత్రికులు బౌద్ధ ధర్మమును గూర్చి, దాని జన్మభూమియగు భారతదేశమున పరిశోధనలు చేయుటకై వచ్చియుండిరి. వారు పెక్కు తావులందు గ్రంథాలయములను జూచియుండిరి. వీరుగాంచిన పుస్తకాగారములందు బౌద్ధధర్మ గ్రంథములేగాక, దానికి విరుద్ధమని తలపబడుచున్న హిందూమత గ్రంథములును జేర్చబడి యుండెను. హిందువుల గ్రంథాలయములందు బౌద్ధమత గ్రంథములు కానవచ్చినవి. మఱియొక విశేషమేమ

మన బౌద్ధారామములందు వేలకొలది విద్యాభ్యాసముచేయు బ్రహ్మచారులును, వారికి నుపదేశముల గావించు గురువులును సమిష్టి కుటుంబనీతి ననుసరించి జీవింపుచుండిరి. ఈ అధ్యాపకులలో జాల మంది బౌద్ధసన్యాసులయినను కొంతమంది బ్రాహ్మణ పండితులును నుండి తమ బ్రాహ్మణ ధర్మమును నిరాఘాటముగ బోధింపుచుండిరి. ఆనాటి పండితవరులు ప్రధానాప్రధానాంశముల వివక్షత చేయగలిగిరనియు, ప్రధానాంశములందు సమన్వయసాధనము గాంచగల్గిరనియు, పరమత సహిష్ణుత గలవారనియు తెల్లమగుచున్నది. ఫాహియాను బ్రాహ్మణ పండితులతో ననేక పర్యాయములు వాదనలు గావించి నట్లును, వారికడ హిందూధర్మమునుగూర్చి చక్కగ నేర్చుకొని నట్లును ఆయన తెలుపుచున్నాడు. ఇటువంటి సంప్రదాయ సమన్వయ మునకు గ్రంథాలయములు మిగుల నుపకరింపగలవని వేఱుగ జెప్ప నక్కఱయుండదు. ఇందుకొఱకు గ్రంథాలయ పాలకులు సంకుచిత భావములతో గ్రంథముల సేకరించక విశాల భావములతో వర్తించ వలయును. పూర్వము మన గ్రంథాలయములలో వేలకొలందిగ గ్రంథములుండెడివి. వివిధమత ధర్మ సంప్రదాయముల దెల్పునవిగ నుండెడివి. ఫాహియాను ఒక్క తామ్రలిప్తియందున్న గ్రంథముల పరిశోధించి వానిలో గొన్నింటికి మాత్రము ప్రతుల వ్రాసికొనుటకు రెండేండ్లు పట్టినదట. ముద్రణ సౌకర్యములు లేని యాకాలమున నిట్టి గ్రంథాలయములకై పుస్తకముల వ్రాయించుట, తాటి యాకులలో వ్రాయించిన వానిని రక్షించుట, ఏరకమునకారకము ఏర్చి పెట్టుట ఎంతటి తెలివితేటల గోరునో విచారించుడు. మఱియు నిటువంటి శ్రమ తామభిమానించుకొనిన గ్రంథముల సేకరించి రక్షించుటయందే గాక తదితర గ్రంథములగూర్చియు దీసికొనబడియెను. వేలకొలది గ్రంథము లితరభాషలలోనివి సంపాదించి, వానిని భాషాంతరీకరించి, తమ గ్రంథాలయములందుంచిరి. నిరాఘాటముగ వానినందఱును పరదేశీయులు, పరమతస్థులు సయితము ఉపయోగించ

కొనుటకు సౌకర్యముల నొసగుచు వచ్చిరి. కాశీ మున్నగు ప్రదేశము లందలి పుస్తకాగారములలో దేశమునంతటినుండి పండితులు వ్రాసిన యుద్గ్రంథముల ప్రతులుండెడివి. మఱియు విదేశ పండితుల గ్రంథములును, వాని భాషాంతరీకరణములును జాలగ నుండెను.

భారతీయులలోని వివిధ జాతులవారికిని మైత్రి గుదర్చలేకున్నను విద్వేషములచేత పరస్పరము బాధించుకొనకుండ నిక్కాలమున దమ యుత్తమ రాజనీతి కాపాడుచున్నదని మన దొరతనము వారు మిగుల నాడంబరముతోడ జెప్పుకొనుచున్నారు. కాని ప్రత్యక్షముగా ధర్మ సమన్వయమునకై ప్రయత్నించక, తమ విలక్షణమగు మత నీతిచేత సర్వమును ఖండనమొనర్చుచు, నిరసింపుచు, విద్వేషముల గల్పించుటకే తోడ్పడుచుండిరనినను సత్యదూరముగాదు. పూర్వపు రాజులును, పండిత వరులును వివిధ సంప్రదాయ సమన్వయమునకయి ప్రబల ప్రయత్నములు గావించి సిద్ధసంకల్పులైనట్లు అప్పటి విదేశీయ యాత్రికుల గ్రంథములే సాక్ష్యమిచ్చుచున్నవి. గ్రంధాలయములును, వార్షిక మహాసభలును, పుష్కరాది మహాపర్వదినము లందలి సమావేశములును నత్యద్భుతలీల జాతీయ నిర్మాణమున దోడ్పడియున్నవి.

ఈ సందర్భమున మహమ్మదీయ పాలకులగూర్చి యొక్క విషయము చెప్పవలసి యున్నది. మన చరిత్రకారులు మన దేశముమీదకు దండెత్తివచ్చిన మహమ్మదీయులలో మొదటి తెగలవారు గావించిన దుర్నయములను అతిశయోక్తులతో వర్ణించి వారిని కేవలము రాక్షసులనుగ బ్రదర్శించి యుండిరి. మహమ్మదీయులు భారత భూమిలో స్థిరనివాసముల నేర్పఱచుకొని, భారతమాతకు దత్తులయి యొప్పుటకు పూర్వము వారు దౌర్జన్యముల గావించిరనుటకు సత్యమును, మానవ స్వాభావిక కార్యమునై యున్నది. దానిని మన మీనాడంతగా పాటింపజనదు. సంగ్రామ కాలములందు మన దేవాలయముల పడగొట్టి గ్రంథాలయములను దగులబెట్టిరని మహమ్మదీయుల

నిక్కాలమున దూషించుట తగదు. అన్యమత సంప్రదాయములు గల వారగుటచేత వారు గావించినది అస్వాభావిక కార్యముగాదు. సమ మత సంప్రదాయములతో మనుచున్న ఆంగ్లేయులును, పరాసులును పూర్ణ సభ్యత సంపాదించిన లోక గురువులమని చెప్పుకొను నిక్కాలమున జర్మనీ, ఆస్ట్రేలియాలయందు చర్చి భవనములను, గ్రంథాలయములను, పుర మందిరములను నెన్నిని ధ్వంసము చేసియుండ లేదా? కాని మొగలు చక్రవర్తులు హిందూమత గ్రంథములను వ్రాయించి, అనువదింపజేసి, పండితులను గౌరవించి యాదరించిరని యిప్పుడిప్పుడు చరిత్ర పరిశోధకులు దెలుపుచున్నారు. వారివలన మనకు సంఘటిలిన కీడులకంటె మేలులే హెచ్చుగ నున్నవనియు, హిందువులలోని వివిధ శాఖాంతరులు పరస్పరము గావించుకొనిన బాధలకంటె హెచ్చుగా గావించలేదనియు గ్రహించి మన దురభిప్రాయముల మార్చుకొందుముగాక! ఒక్క విగ్రహమునే వేర్వేరు తావులనుండి చూచినయెడల వేర్వేరు భావములు ఆ విగ్రహమునందు ప్రదర్శితములగుచుండును. అటులనే దృక్పథమునుబట్టి చరిత్రలును భిన్న భావములను ప్రచారముచేయుచుండును, మనము మనచరిత్రను పాశ్చాత్యులవలన నేర్చుకొంటిమి. మన దృక్పథమేగాక మనదృష్టియు మారిపోయినది. పాశ్చాత్యులకు మనచరిత్ర తెలియదు. సంప్రదాయ భేదముచేత వారు తెలిసికొననూలేరు; ప్రయత్నము చేసినవారును గారు. కాని, వారతి సాహసులు! భారతజాతికి పూర్వచరిత్రయే లేదనిరి. మీదు మిక్కిలి భారతజాతి యనునదియే లేదనిరి. మన పురాణములను, ఇతిహాసములను అర్థరహితములగు వెట్టి వ్రాతలనిరి.

చరిత్రరచన జాతీయాదర్శముల ననుసరించి నడుచును. భారతీయుల యాదర్శము ఆధ్యాత్మికము. పాశ్చాత్యుల యాదర్శము ఐహికము. తినుట, తిరుగుట, నిద్రించుట సయితము ఆధ్యాత్మిక దృష్టితో మనచే జూడబడుచున్నవి. వీనివలన ప్రపంచమున సాధింప గల కార్యములకు విలువగట్టి పాశ్చాత్యులు వీనిని ఆర్థిక దృష్టితో

జూతురు. కూలి నాలి చేసుకొనువారికి జీవనోపాధికి విరామములేక పాటుపడవలసిన స్థితి యింగ్లాండున నిప్పుడు గలిగినదని చెప్పుచు ఒక అర్థశాస్త్రజ్ఞుడు వారిని మానవజీవులనుగా జూచి అనగా భూతదయ గలవాడై జాలిపడుటకు మారుగా ఆర్థికరీత్యా గణితమువేసి, వారి యలసటవలన వారుత్పత్తిచేయు వస్తుజాలమెంత తగ్గినదో, ఎంత నాణ్యము క్షీణించినదో, వారు త్వరగా నశక్తులై పనిపాటలు మాని నందువలన వారి జీవన భారమును జాతి ఎంత భరింపవలెనో అన్నిం టిని పౌనులు, షిల్లింగులు, పెన్నీలలో గణితమువేసి ఆ నష్టమును దప్పించుకొనుటకై స్వజాతీయులు వీరికి దారి జూపవలసిన విధిగలవా రగుచుండిరని వాదించినాడు. పాశ్చాత్యులు చరిత్రలను వ్రాసినను ఈ దృష్టితోడనే వ్రాసినారు. మన గ్రంథములలో సామాన్య గృహ కృత్య విషయములును, సాంఘిక విషయములును, రాజకీయ విప్లవ వములును ప్రజల నైతిక పరిస్థితిలో నెట్లు పరివర్తనమును గల్గించు చున్నవో దెలుపబడు రీతిని కథలల్లబడి యున్నవి. మిగుల నస్వాభావి కములగు నంశములనుగూడ ఇతిహాసములలో జొన్పి నీతిధర్మమును బ్రకటించుటయే ప్రధానముగా వ్రాసిరి. ఈ కథ లసంభవములుగను అస్వాభావికముగను, పాశ్చాత్య దృష్టికిని, పాశ్చాత్య సులోచనముల దాల్చిన మనకును గాన్పించుచున్నవనుట నిజము. ఆ గ్రంథకర్తల యాదర్శమును పాటించి, వాని నుపయోగించుకొంటిమేని లాభమును పొందగలము. ఇందుకు భారత సంప్రదాయాభిమానము, విచక్షణ జ్ఞానము, పరమత సహనము చాలగ నవసరములు. పాశ్చాత్యులీ సద్గుణములను మన గ్రంథముల పరిశోధించుపట్ల జూపరైరి. భారత జాతి కెద్దియు స్వరూపమే లేదనియు, ఏ కొంచమైన నున్నచో నది ప్రాకృత వికార స్వరూపమనియు బోధించిరి. వారి పాదములకడ విద్య నేర్చిన భారత విద్వన్మణులు, భారత ప్రాచీన గ్రంథ పరిశో ధనము "ఊకదంపు" అని హేళన సాగించిరి. ఒక ఎం. ఏ. గారు

(తక్కుంగల విషయములలో మహా పూజనీయుడే) మన వాఙ్మయమును బరిశీలించుటను గూర్చి పలుకుచు "నా జీవితము చాల విలువ గలది. కండ్లయెదుటి సత్యస్వరూపమును విడిచి అనిశ్చయమును, క్షుద్రమును, భ్రాంతిహేతువునగు ప్రాచీన భారతజాతి స్వరూపమును గూర్చి విచారణ పెట్టుకొని వ్యర్థముగ నా జీవితమును వ్యయము చేయజాల"ననెను. కాబట్టి హైందవ సంప్రదాయ దృష్టితో భారత చరిత్రను వ్రాయుట ఎంత యావశ్యకమో, ఎంతటి మహాత్కార్యమో యూహింపవచ్చును. నూటి కార్గుకు మాత్రమే సంతకములు చేయు పాటి విద్వన్మణులనుండి వీరిలో వేయింటి కొక్కడైనను పూర్వ గ్రంథ పరిశోధన కర్హమౌ విద్యయు, నభిమానము లేక యుండ ఎందరు మన చరిత్రను పరిశోధించి వివేకదృష్టితో వ్రాయ బూనుకొనువారు లభింతురో యోజన సేయుడు. గ్రంథాలయ పాలకులు తమ గ్రంథముల జదువువారి వైఖరుల గనిపెట్టుచు, తగినవారిని గుర్తించి ప్రోత్సహించవలసి యున్నది.

యూరపు అమెరికాల చరిత్ర మహానగరములందును, ఘనతర కర్మాగారములందును, విశ్వవిద్యాలయములందును, రాజకీయ కార్యాలయములయందును లభించును. కాని భారత దేశపు చరిత్ర గ్రామములందున్నది. గ్రామము లందున్న దేవాలయములలోను, మసీదులలోను, సత్రములందును, ధర్మారామములందును, గ్రామస్థులు జెప్పుకొను పిట్టకథలలోను, పల్లెలవారి విచిత్రములగు నాచారములలోను జీర్ణమయియున్నది. క్షేత్రపురాణము లందున్నది. వీనిం గూర్చి గ్రామస్థులు చెప్పుకొను గాథలనన్నింటిని ప్రోగుచేయవలసియున్నది. అవి వివిధములుగను, పరస్పర విరుద్ధములుగను, అస్వాభావికములుగను నుండును. కాని వాని యన్నింటను సరము నందలి సూత్రము వలె నైతికాదర్శములు, సంప్రదాయాచారములు వివేకదృష్టికి గోచరమగుచుండును. వాని ననుసరించి జాతీయ పరిణామచరిత్రను వ్రాయవలసియున్నది. నైతిక పరివర్తనము ననుసరించి వ్రాసిన జాలును.

పాశ్చాత్య దృష్టితో రాజుల జీవితచరిత్రలను తేదీలవారీగ వ్రాయుట యనవసరము. రణక్షేత్రములందు విహారముగావించిన గణనాయకుల జీవితములను, నధికారములను, యోధుల సంఖ్యను కచ్చితముగ నిర్ణయించ జూచుట యనవసరము; రాజశాసనముల నిర్మాతలను, వాని తారీఖులను సరిగ దేల్చుట యనవసరము. పైవాని వలన ప్రజల సుఖ దుఃఖములు, సంఘాచారములు, ఆముష్మిక భావములు ఎటుల మారెనో దెలిపిన జాలును. మహాభక్తుల జీవితచరిత్రలు విడ్డూర్యముగనున్నను వారిబోధలవలన గల్గిన భావపరిణామమును సూచించిన జాలును.

ఈ పనికంతకును స్థల పురాణములును, స్థానిక గాథలును, క్షేత్ర మహిమలును మూలాధారముగ నుండును. ఈ కథాజాలము నెక్కడి వారక్కడ రచింపజేసి ప్రకటించిన యెడల సులభముగ పని జరుగును. గ్రంథాలయముల నిర్వహించు వారీ కార్యమును నిర్వహించగలరు. సామాన్యముగా ఉన్నత పాఠశాలలో విద్యగఱచు బాలురు శలవు దినములలో తమ విశ్రాంతి కాలము నిందు కుపయోగించిన మహోపకారమును జేయగలరు. వారు తమ గ్రామస్థులు జెప్పుకొను కథలను, తమకు వచ్చిన భాషలోనే వ్రాయవచ్చును. ఇట్టి వానిలో నుత్తమమైనవానిని రచించిన బాలురకు చిన్నచిన్న బహుమానములనిచ్చి ప్రోత్సహించవచ్చును. ఇందువలన వారికి ఆనందమును, నుత్సాహమును, దేశసేవగావించిన పుణ్యమును లభింపగలవు. గ్రామములందు ప్రాథమిక పాఠశాలల యుపాధ్యాయులుగూడ కథలను వ్రాసి యీ గలరు. వీరిని సత్కరించుట యనేక భంగుల నుపకారకార్యమగును.

ఇటుల చేయుటవలన మనదృష్టి గ్రామములపై కేంద్రీకరణమయినది. విశాలతర దేశాభిమానము సంకుచితమగునని కొందఱు భావింపవచ్చును. అటుల నెన్నడును జరుగదు. భారత దేశమంతయు మహాపురుషులయొక్కయు, అవతారములయొక్కయు, భక్తులయొక్క

యు, జన్మ నిర్యాణ క్షేత్రములతోడను, మఠములతోడను, మసీదుల తోడను, బౌద్ధస్తూపములతోడను పవిత్రీభూతమయి సర్వమతముల వారిచేతను పూజింపబడుచున్నది. అందందు జరుగు తిరునాళ్లు, పుష్కర తీర్థవిధులు, ఉత్సవములు, వేడుకలు నందఱిని నాకర్షించు చున్నవి. భారతమాతయొక్క అఖండ దివ్యమంగళ స్వరూపము అనుదినమును ధ్యానింపబడుచునే యున్నది. సప్తనదులను, సప్తకుల పర్వతములను, శైవతీర్థములను, వైష్ణవ తీర్థములను మున్నగు వానిని ధ్యానముచేయుట మనకాచారమైనది. వీనిని ప్రతిపాఠశాలయందును, విద్యార్థులచే బఠింపించి, చిత్రవర్ణములతో గోడలమీద లిఖించి యుంచి వాని మహిమలను బోధింపుచు నుండవచ్చును. అటుల భారత భూమియొక్క సర్వాంగములును మహాపవిత్రములే యను నుపదేశము లను ఉగ్గుపాలతో పసివారికి గ్రోలనిచ్చిన యెడల ఇంక దేశాభిమానము సంకుచితమై పోవునను భయమనవసరము. అనుదినమును స్నానములు గావించుపట్ల

"గంగేచ యమునే కృష్ణే, గోదావరి సరస్వతీ,
నర్మదా సింధు కావేరీ జలేస్మిన్ సన్నిధిం కురు"

అనుచు బఠించు మనము దేశారాధనను మఱచెదమా? గ్రామాభిమానము, దేశాభిమానమునకు బునాదియై స్థిరముగ నడుపును.

వారమునకో, పక్షమునకో ఒక్కసారి గ్రామమందలి బాలబాలికల నందఱను, గ్రంథాలయము చెంత జేర్చి వారికి మంచిమంచి బొమ్మల జూపుచు వీరుల చరిత్రములను, మహాభక్తులకథలను, పతివ్రతల పావన జీవితములను, వివిధ క్షేత్రముల మహిమలను తడవకొక చిన్న కథగా గూర్చి బోధింపవచ్చును. తుద కొక కీర్తనయో, పద్యమో భారతమాతంగూర్చి పఠింపించి జేజేధ్వానులతో వారి నలరింపవలయును. వీలునుబట్టి వారికి పంచదారయో, కొబ్బరియో, బెల్లమో, పప్పులో పంచిపెట్టవచ్చును. ఇందుకు రామాయణ, మహాభారత, భాగవతాది గ్రంథముల గాథల దెలుపు చిత్రపటములను, తదితర

చారిత్రాంశ బోధకములగు పటములను, ధనమున్నచో మాజిక్ లాంతరును ప్రతి గ్రంథాలయము నందు నుంచవలయును. కథకులు లభించినపుడెల్ల బాలనాగమ్మ కథ, బ్రహ్మనాయుని కథ, బొబ్బిలి కథ, ఇటువంటివానిని చెప్పించు చుండవలయును. గ్రామపాఠశాల లందు పర్వదినములం దుత్సవముల జరుపుచుండవలయును. ఆ యుపాధ్యాయులకు కథలు చెప్పు నేర్పును గల్గించవలయును. సామాన్య ప్రజలప్పుడు గ్రంథాలయముల నభిమానించుకొని సహాయము నొనర్పగలరు.

మనలో ప్రతివాడును తన సంఘమునకును, విశ్వమానవకోటికిని ఋణస్థుడై యుండును. తానెంతటి ధీశాలియైనను, ధనాఢ్యుడైనను, బలసంపన్నుడైనను ఈ ఋణమును దప్పించుకొనజాలడు. విశ్వమానవకోటి తరతరములనుండి సంపాదించిన విజ్ఞానపుంజము మనలో జీర్ణమైయున్నది. దాని ఫలమును మనము తెలియకుండగనే యనుభవించు చున్నాము. చిన్న యుదాహరణచే విశదము చేసెదను. ఒకడు ఒక్కముద్ద అన్నము దినినపుడెల్ల విశ్వమానవకోటికి ఋణస్థుడగుచున్నాడు. నరుడు ప్రాకృత జీవియై పుడమిని జన్మించినది మొదలు క్రమక్రమముగా క్షుద్ర జంతుజాలమును, ఆకలములను, కాయకసరులను, దుంపలను దిని ఆహార ద్రవ్యములను సేకరించి పెట్టుకొనుట వాని నుత్పత్తిచేయు విధమును గనిపెట్టి యిప్పటికి వ్యవసాయ శాస్త్రమును గొంతవఱకు పూర్ణతకు దెచ్చెను. ఆ విజ్ఞానమంతయు మనము తిను ప్రతి మెతుకునందున్నది. ఆ విజ్ఞానరాశియందొక్కొక్క కణమును జేర్చినవాడెల్ల నాకుపదేశకుడే. నా కుపకృతియొనర్చినవాడే. నాకు దాతయే. ఇట్లు దలపోసినయెడల నేనెంత మందికి ఋణస్థుడనైతినో గణించుటకే నా జీవితకాలము జాలదు. ఈ ఋణముతీరు నుపాయమెద్ది? ఈ విశ్వమానవకోటిలో నా జాతి యొక యంతర్భాగమై యున్నది. కావున నేనీజాతికి సేవజేసి నాశక్తి యుక్తుల విని యోగించి విశ్వమానవజాతి కూర్చిపెట్టిన జ్ఞానరాసికొక

నూతన కణమును జేర్చి, నా స్వజాతి బాలబాలికల విజ్ఞాన విస్ఫురణ మున కొకింత సహాకారము సలిపి, ఇతరు లార్జించిపెట్టిన జ్ఞానామృతము నొకింత ఈ చిన్నవారలకు బంచిపెట్టి, కృతకృత్యుఁడగా జనును. తాము స్వయముగ విద్యాధికులగువారి కీఋణము గురుతరముగ నున్నది. వారు తమ సమకాలికులు ప్రత్యక్షముగను, పరోక్షముగను బోషింపుచున్న పాఠశాలలలో విద్య గఱచుచున్నారు. వీరిలో నెవరును దాము గడించిన విద్యకు దగిన ప్రతిఫలమును జీతముల రూపమున నిచ్చివేసితిమని వక్కాణింపజాలరు. అయినను ఈ కాలపు విద్యావంతులు కేవలము కుక్షింభరులును, స్వకుటుంబ సేవకులును మాత్రముగ నుండి, ఇతరుల సేవ విధిగ చేయవలసిన వారని గ్రహించునంతటి విశాల హృదయులు గాకున్నారు. ఇతరులు చెమటనోడ్చి, కష్టపడి, తమకై పాటుపడుట తమ ఘనతకు తార్కాణమనుకొనుచున్నారేగాని, తమ ఋణభార మందువలన పెరుగుచున్నదని గుర్తించ జాలకున్నారు. అటువంటివారిని ప్రోత్సహించి దేశసేవయందు దింపనగును. వీరివలన పరిశోధనలు చేయించి చరిత్రలను, ప్రకృతి శాస్త్రములను, యంత్ర నిర్మాణ శాస్త్రములను సులభమగు భాషలో వ్రాయింపించవలయును. అన్యభాషలందున్న వాని ననువదించునటుల చేయవలయును. వీరి విజ్ఞానమును స్వలాభమునకే యుపయోగించుట అధర్మమనియు నొక్కి చెప్పి వాదించుడు. వీలు ననుసరించి లోకోపకార కార్యములకు దిగినవారిని సత్కరించి ప్రోత్సహించుడు. వారికి వలయు గ్రంథముల నరసి సంపాదించిపెట్టుడు.

వర్తమాన కాలమునందుకంటె భారతదేశమున పూర్వము చదువరులు హెచ్చుగ నున్నమాట నిజమే. అందువలన ప్రజలందఱును గ్రంథపఠనము చేయగలిగి యుండిరని భావించరాదు. పూర్వకాలపు చదువరులు విద్యావంతులయి, యితరులు చదువరులు గాకున్నను వారినిగూడ విద్యావంతులుగ నొనర్చుచుండిరి. చదువులకు ఫలము గ్రంథపఠనము, వ్యాసరచనము, ఉపన్యాసముల నిచ్చుటయు

నని యిప్పటివారు భ్రమించుచున్నటులున్నది. చదువు లేర్పిన దానికి ఫలము భగవంతుని మార్గములనరసి, అనగా లోకవృత్తమును గమనించి, తదనుగుణ్యాముగ దాను వర్తించుటయు నితరులను వర్తింప జేయుటయు నని మఱువదగదు. ఈ రీతిగ విచారించినయెడల మన యిండ్లలోనున్న ముసలమ్మలు భాగవతాది గ్రంథములలోని విషయములను దాము దెలిసికొని, యితరులకు దెలుపగలిగి యుండిరి. మన గ్రాడ్యుయేటుల కాశక్తి లేదయ్యె. జాతీయ సంప్రదాయ సిద్ధమగు విద్య ముసలమ్మల కున్నను గ్రాడ్యుయేటులకు లేకుంట శోచనీయము. జ్ఞానప్రచారమున కుపకరించని చదువులను విద్య యనదగదు. జ్ఞాన ప్రచారమును, చదువులును రెండును లభించిన పరమోత్తమము. ఒకవేళ చదువులు లభింపకున్నను జ్ఞానప్రచార మున్నచో సంతసించవలసినదే. ప్రస్తుత స్థితిలో మనదేశమున నూటికి నలుగురయినను ధారాళముగ వ్రాయను, జదువను శక్తులగువారు లేరు. జనాభా లెక్కలలోని చదువరుల సంఖ్యలను నమ్మకొనదగదు. కొందఱు దస్కతుమాత్రమే నేర్చి పరువు పోవునను కారణముతో చదువు నెఱుంగుదుమని జనాభా గణితిలో వ్రాయించుకొందురు.

మఱియు ఈ చదువులు జ్ఞానార్జనమునకుగాని, జ్ఞాన ప్రచారమునకుగాని కొఱగావు. మనదేశమున నిప్పుడు గ్రాడ్యుయేటులున్నారు. బిరుదాంకితులున్నారు. జాతీయ విద్యకొక స్వరూపమును సూచించుడనగా దానికి శక్తులుగాక యున్నారు. కావున ఆ చదువుల పద్ధతిని నమ్మకొన్నక జ్ఞాన ప్రచారమునకు గడంగవలయును. గ్రంథాలయము లీ జ్ఞాన ప్రచారమునకు జాలగ నుపయోగించగలవు. గ్రంథాలయ సభ్యులు ప్రజలతో గలసిమెలసి దిరుగుచు కథల మూలమునను, ఉపన్యాసముల మూలముననను, ఇష్టాగోష్ఠివలనను, సంభాషణ మూలముననను విజ్ఞానమును ప్రచారము గావించగలరు. ముప్పదేండ్లనుండి గ్రాడ్యుయేట్లు, లాయరులు చేయజాలని జ్ఞానప్రచారమును గాంధిగారు మూడు మాసములలో చేయగల్గిరి. ఆ ప్రచారము

నత్యద్భుతలీల జరిపినది సామాన్య విద్యావంతులేగాని గ్రాడ్యుయేటులుగారు. విషయమును సానుతాపముతో గ్రహించుట, ఆదరణపూర్వకముగా నితరులకు దెలుపుట జ్ఞానప్రచారమునకు ముఖ్య సాధనములు. పదేండ్లు పాఠము చెప్పినదానికంటె రాజకీయ సమస్య నొక్కదానిని మనస్సున పట్టించుటకు పదిమందిని జేర్చి యొక్క హరికథయో, ఒక్క చిత్రకథయో అల్లి దానిని హృద్యముగు తేలిక భాషలో త్రుటికాలములో బోధించనగును. దీనికొక్కడు తెలిసినవాడున్నం జాలును. వినువారందఱు అక్షరజ్ఞానము లేనివారైనను సరియే. ఈకాలపు పరిస్థితుల ననుసరించి యీ పద్ధతి నాచరణలో బెట్టవలయునేగాని, బేలతనమున చదువులు లేవేయని దిగులొంది గూర్చుండరాదు. ప్రతి సాయంతనమును ఆంధ్రపత్రికలోని ముఖ్య విషయములను వీధులలో విశాలమైనచోట నిలుచుండి బిగ్గఱగ చదువుటయో, లేక వానిగూర్చి ముచ్చటించుటో విధిగ బూనిన యెడల గ్రంథాలయ కూటము మహోపకారము చేసినదగును. కేవలము పత్రికాపఠనముచేయు వారికే యుపయోగపడు పఠనమందిరములు పూర్ణ ప్రయోజనములు గావనుటకు సందియములేదు. గ్రంథాలయమునందలి అలుమారులలో చాల పొత్తములున్నను వార్తాపత్రికలు విశేషముగ నచ్చటి బల్లలపై నలంకరించినను అనుదినమనేకులు హాజరై పుస్తకమున సంతకములిడినను, వీనిలెక్కలు గ్రంథాలయపు ప్రయోజనమును నిరూపింపజాలవని మనవిచేయుచున్నాను. నేను వివరించిన విషయములు కేవలము ధనసహాయములేక జరుగునవి కాకున్నను, ఎంతధనము చిక్కిన నంతటితోనే జరుగునవై యున్నవి. ధనము చాలగ లేదనియు, గ్రంథములు కొద్దిగ నున్నవనియు, గ్రంథాలయ భవనము కుదురలేదనియు సంకోచించి ప్రారంభమేలేక యుండుట యనవసరము. ఉత్సాహవంతులగు యువకులున్నంజాలును. చాల ప్రచారము గావించవచ్చును. పెద్ద పెద్ద పుస్తకములు గొనుట, ఉత్తమ గ్రంథముల బ్రకటించుట, విశాలతర భవనములను నిర్మిం

చుట విశేష ధనము చేకూరిన కొలదిని గావించదగిన కార్యములు. ఆ కార్యముల నిర్వహించు విధానములు, నుపాయములు ధనము తోడనే రాగలవు. ఇట్టి లాభము కొలది గ్రంథాలయములకే లభింప గలదు. వర్తమాన కాలమున నెవరిస్థితికి దగినటుల వారు కార్యక్రమ మును నడుపవలసియున్నది. ఇతరులతో పోటీలుపెట్టుకొనుట, ఒకరితో వంతు బెట్టుకొని యన్యులకై వేచియుండుట తగదు. ప్రతివాడును 'నా విధిని నేను చేయగలిగినంతమట్టుకు ప్రయత్నము లేకుండ నిర్వ హించితినా?' యని ప్రశ్నించుకొనవలయును. వాని యంతరాత్మ నడిపినటుల నడువవలయును.

కేంద్ర గ్రంథాలయములకు గ్రంథముల సేకరించు నుపాయ మొకటి దర్భంగ గ్రంథాలయ పాలకులగు ఎస్. సి. గుహాఠాకూరు గారు తెలిపి యుండిరి. యురపు అమెరికాలలో ప్రతి దేశమునను సామ్రాజ్య గ్రంథాలయములు గలవు. వానికి ఆయా సామ్రాజ్యము లలోని గ్రంథకర్తలందరును, తాము ప్రకటించిన ప్రతి పుస్తకమున రెండు ప్రతులు ఉచితముగ నొసగవలయునను శాసనము గలదు. అటుల ధనవ్రయములేకయే చాల గ్రంథములు లభించుచున్నవి. మనకు నటువంటి శాసనము గలదు. కాని యీ శాసనమువలన భారత దేశమున బ్రకటితమా గ్రంథములన్నియు లండను గ్రంథ భాండా గారమునకు లభించుచున్నవి. మన భారత ప్రభుత్వమువారు నొక గ్రంథాలయమును నటులనే నిలిపిరి. కాని దాని యుపయోగము ప్రజలకు లభించుటలేదు. అఖిలభారత కాంగ్రెసు సంఘమువారొక గ్రంథాలయమును నెలకొలిపిన బాగుండును. కాని వారికొక స్థిర కార్యాలయములేదు. వర్తమాన కాలమున ప్రతి రాష్ట్రీయ కాంగ్రెసు సంఘమును కేంద్ర గ్రంథాలయముల స్థాపించుట మంచిది. పుస్తక

నొకటి ముద్రణము కాగానే గ్రంథకర్తలు మూడేసి పుస్తకములను దేశమాత కర్పణము చేయవలయును. ఒకటి గ్రంథకర్త గ్రామము నను, లేక సమీప గ్రామముననున్న గ్రంథాలయమునకును, రెండవ దానిని, జిల్లా గ్రంథాలయమునకును, మూడవదానిని రాష్ట్రీయ గ్రంథాలయమునకును బంపు నియమమును, ప్రచారములోనికి దేవ లయును. అచిరకాలములో స్వల్ప వ్యయముతో కేంద్ర గ్రంథా లయములను బలపఱచగలుగుదుము. అన్నింటికిని ప్రధానాంశము విజ్ఞానప్రచారము! దీనిని గావించుటయే గ్రంథాలయములకు పరమ గమ్యముగ నుండవలయును.

— గ్రంథాలయ సర్వస్వము, 6 వ సంపుటము 3 వ సంచికనుండి



శ్రీ కోటగిరి వేంకటకృష్ణారావు బహద్దరు

(పేజీ ౪౯)



శ్రీ తల్లాప్రెగడ సూర్యనారాయణరావు

(పేజీ ౬౮)

# ద్వితీయ కృష్ణామండల గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ, జగ్గయ్యపేట

## శ్రీ కోటగిరి వేంకటకృష్ణారావు బహద్దరు

మనము గ్రంథాలయోద్యమము పాశ్చాత్యులవలన నేర్చికొంటిమని మనవారు భ్రమపడుచున్నారు. కాని ప్రాచీనకాలమునుండియు మనదేశమునందు గ్రంథాలయములు కలవు. ఆకాలమున ముద్రణాది సౌకర్యములులేవు గాన మిగుల నరుదుగ నుండెడివి. ఇప్పటికిని మనము ప్రాచ్య లిఖిత గ్రంథ పరిశోధనకై బయలువెడల నెన్నెన్నియో యముద్రిత తాళపత్ర గ్రంథములు లభించుచున్నవి. దానింబట్టి యీ గృహ యజమానుని వంశీయులలో బూర్వమెవరో యొక పండితుడో యొక భాషాభిమానియో నా పుస్తకముల సేకరించెననియు, ప్రపంచము నా పొత్తముల వ్యాపింపజేసెననియు దదితరులవలన వినుచున్నారము. మన గ్రంథాలయ నిర్వహణ మిందు గర్భితమై యున్నది. ప్రాయశః మనకిట్టి చరిత్రాంశములకు శాసనాద్యాధారములు కూడ లభించుచునే యున్నవి. ఆకాలమున విద్యాభిమానులైన శ్రీమంతులగు ప్రభువులు గ్రంథాలయముల నెలకొల్ప నేర్చుట కష్టకార్యము కాదనుట నిర్వివాదాంశము. నేటికిని గొన్ని కొన్ని సంస్థానములలో బండ్లకొలంది యపూర్వ తాళపత్ర గ్రంథములు కానవచ్చుట యిందుకు ప్రబలాధారము. పూర్వమువలె నిప్పుడును గ్రంథాలయములు మనదేశమున గలవు గాని నాటికి నేటికి బెక్కు తెఱంగుల భేదముండవచ్చును. రాను రాను దేశమున నవనాగరక దశ దినదినాభ్యుదయము గాంచుచున్నందున గ్రంథాలయముల నిబంధన లధికమై భాండాగారమున కరుదెంచు పాఠకులకెటుల సంతోషము గూర్పవలయునో, గ్రంథాలయము కర్షకుడు మొదలు పండితోత్త

ముని వారికి జనుల నెటుల నాకర్షించవలయునో, ఆబాల గోపాలమున కెటుల జ్ఞానము ప్రసాదింపవలయునో చక్కగ గుఱుతెఱింగి ప్రస్తుత గ్రంథాలయాధికారులు సంచరించుటయు, ప్రకృతము ముద్రణాది సౌకర్యములవలన బొత్తములు సులభసాధ్యములగుటయు లోనగు నుపయోగములవలన బూర్వముకంటె నేడె గ్రంథాలయములవలన నెక్కుడు జ్ఞానము సంపాదించు చున్నారమని నా యభిప్రాయము. మన పూర్వుల యున్నత జీవితాదర్శములగు చరిత్రలు పూర్వము నుండి మనకు లేనందున భరతఖండమున నెందెందు గ్రంథాలయములు గలవో యేవి యెటుల వృద్ధిక్షయముల గాంచెనో వాకొన నవకాశము లేకున్నది. గ్రంథ భాండాగారములుకూడ బూర్వము మన భరతఖండమున గలవని వ్రాయుటకు మాత్ర మొకటి రెండాధారములేని మనకు దొఱుకకపోవు. "నలంద" యను స్థలమున క్రీ. శ. 17 వ శతాబ్దమున నొక విశ్వవిద్యాలయము, గ్రంథభాండారముండెననియు, అమరావతికి సమీపముననున్న ధరణికోటయొద్ద 72 మంది ఉపాధ్యాయులుగల విశ్వవిద్యాలయము, గ్రంథాలయము కలదనియు శాసనాద్యాధారములవలన దెలియుచున్నది. ముఖ్యముగ బూర్వగ్రంథాలయములన్నియు దేవళములయందు, మఠములయందు స్థాపింపబడెను. అప్పుడందలి గ్రంథములు నిమ్నజాతులకు లభింపక పోవుటయు, దేవల పండితులకు దక్క సామాన్యులకా గ్రంథములు లభింపకుండుటయు లోనగు నిర్బంధములు పెక్కులుగలవు. క్రమక్రమముగ మనదేశమున మత ద్వేషములు ప్రబలుకొలందిని గ్రంథాలయములు, మఠములు, విశ్వవిద్యాలయములు లోనగు మానవుల పవిత్ర జీవితాదర్శములన్నియు రూపుమాసినవి. నామమాత్ర శేషములయినవి. క్రమశః శ్రీకృష్ణ దేవరాయలు, తిరుమల దేవరాయలు అనవేమారెడ్డి లోనగు విద్వన్నృపుల కాలమున భాషయు, గ్రంథాలయములు పునరుద్ధారణము నొందెగాని తురుష్కుల దాడులవలనను, అరాజకముల వలనను మన పవిత్ర గ్రంథాలయములు పరశురామ

ప్రీతి నొందినవి. అప్పుడె మనకనులమూసి పాశ్చాత్యులు మన పవిత్ర గ్రంథముల ఖండాంతరములకు జేర్చిరి. ఇంకను మన దేశమున హ్రాత శేషములగు నుత్తమ గ్రంథములు క్వాచిత్కముగ లేకపోలేదు. కాన దేశీయులందఱు గ్రంథాన్వేషణమునకు గడంగుట యుక్త విధియని విన్నవించు చున్నాను.

గ్రంథాలయముల కర్తవ్యములు

గ్రంథాలయమన నేదియో, దాని విధాయకకృత్యము లెవ్వియో జన సామాన్యమునకు జక్కగ బోధపడని యెడ గ్రంథాలయముల కర్తవ్యముంగూర్చి ముచ్చటించుట ప్రస్తుతము గాదు. ప్రథమమున గ్రంథాలయాధికారు లెట్టివారుగ నుండవలయును? అని విచారింతము. ప్రతి భాండాగారాధికారియు పాఠకులయొక్క యెట్టి సందేహములనేని నివృత్తిజేయగల శక్తిసామర్థ్యములు కలవాడయి యుండవలయును. వీరు తమ గ్రంథాలయమందలి యన్ని గ్రంథములను విమర్శనాదృష్టితో నామూలాగ్రము పరిశీలించి యుండుట యుత్తమము. లేక తమ గ్రంథాలయమునందలి గ్రంథముల గుణాగుణములైనను బాగుగా నెఱింగి యుండవలయును. గ్రంథాలయాధికారి ప్రతి పాఠకుని తనకు సమానునిగ బరిగణించుచో శాంతము, అహంకారశూన్యము, లోనగు సుగుణములలోగూడ బాఠకులకుమార్గదర్శకుడై యుండవలయును. గ్రంథాలయాధికారి తన జీవితము పరమార్థము కొఱకు ధారపోయు వాడుగను, ప్రియవక్తృత్వము కలవాడుగను, నిర్భర కార్యదీక్షాపరతంత్రుడుగను, పవిత్ర వర్తనముకలవాడుగను నుండవలయును. గ్రంథాలయాధికారి పాఠకులకు గ్రంథములొసంగుటయు, గ్రమ్మఱ పుచ్చుకొనుటయు మాత్రమె తన విధ్యుక్తమని తలంపక, తగుపాటి విద్యాపరిచయము కలవారయ్యు భాషాప్రపంచము కన్నెత్తి చూడక తమకుగల తెలివితేటల విద్యకయి వెచ్చింపని సామాన్య జనులను భాషాభిమానులుగను, జ్ఞానవంతులుగను, యుక్తాయుక్త వివేకవంతులుగను చేయుటకు బాటుపడవలయును.

ఇట్లనుటచే గ్రంథాలయాధికారి విద్యావంతులకు, బుద్ధిమంతులకు సహాయముజేయ నవసరములేదా యందురేమో! గ్రంథ పఠనాసక్తి కలవారొక గ్రంథాలయముననే గాక యిచ్ఛవచ్చినచోట గ్రంథముల సంపాదించి పఠించి ఫలమనుభవింపగలరు. కాన నట్టివారికి మనము చేయునది సహాయమా? అట్టివారు గ్రంథాలయములకు ప్రతినిధులుగ నుండి సమానబుద్ధితో జనసామాన్యమునకు నూతన వికాసముల గూర్చి విద్యాజ్ఞానముల బోధించుట యుక్తము. మనదేశమునందలి గ్రంథాలయాధిపతులిట్టి విధు లాచరణలోనికిం దెచ్చిన విజ్ఞానము ప్రజల నాకర్షింపకపోదు. గ్రంథపఠనమునందాసక్తిగల విద్యావంతులకు బుస్తకాలందింపగలము. విద్యగలిగి పఠనాసక్తిలేని వారి నెటులో యత్నమొనరించి చదువుకొనునటు లొనరింపగలము. ఇంతటితో మనము కృతార్థులము కాజాలము. పామరులకు గూడ విద్యయందలి శ్రేయోలాభము లెఱింగింప వలయును. గ్రంథాలయములు ముఖ్యముగ విద్యాగంధశూన్యులకొఱ కెన్నియో శ్రమలపడి వాండ్రకు విజ్ఞానము ప్రసాదింప వలయును. అప్పటికిగాని గ్రంథాలయ గర్భితమగు సంకల్పము ఫలవంతముకాదు. విద్యాగంధ శూన్యులను బైస్కోపు, మ్యాజిక్ లాంతరు, సినెమెటోగ్రాఫ్ లోనగు యంత్రములవలనను, హరికథా నాటక పురాణోపన్యాసాది కాలక్షేపముల వలనను, సులభగ్రాహ్యములగు నుపన్యాసములవలనను జ్ఞానాభివృద్ధిగలవారిగ గ్రంథాలయము లొనరింప దీక్షవహింపవలెను. భారతీయులలో వివిధైశ్వర్యములలో విద్యయే మిక్కిలి తక్కువగ నున్నది. అందు స్త్రీవిద్య లేనిదానిలోననే చేరినది. స్త్రీలలో నూటికి గోటి కొక్కర్తె యెట్టి గ్రంథమునైన జదివి యర్థము గైకొనగలదేమో. చదువువచ్చిన స్త్రీలలోగూడ నున్నతవిద్య చాల తక్కువ. అట్టివారికి మనము శక్తివంచన లేకుండ దోడ్పడవలయును. మనమిప్పుడు గ్రంథాలయములలోనికి హైందవస్త్రీలు వచ్చునటు లేర్పాటు చేయలేక పోయినప్పటికి స్త్రీలయొద్దకైనను వారికర్థమగు సద్గ్రంథముల బంపుచు

విద్యాభివృద్ధిచేసి స్త్రీవిద్య నున్నతిలోనికి దేవలయును. ఇప్పుడు మన యాంధ్ర దేశముననున్న గ్రంథ భాండాగారములెవ్వియు స్త్రీ విద్యాభివృద్ధికి దృష్టికరముగ బనిచేయుటలేదు. మనము స్త్రీవిద్యావశ్యకత దెలిసికొని తదభివృద్ధికై పయత్నింతుముగాక!

జ్ఞానశూన్యులగు పంచషడ్వత్సరులగు బాలురనుగూడ గ్రంథాలయము లాకర్షింపవలయును. భారతీయులకు గ్రంథాలయములపై ననురాగ మజ్ఞాన దశలోనే కలిగినగాని దేశమభివృద్ధి లోనికి రాజాలదు. బాలకులే హైంద వౌన్నత్య ప్రతిష్ఠానిర్వహణ యోగ్యులు కావున వారిని మనమెల్ల విధముల గన్పెట్టవలయును. బాలురను పాఠశాలాధికారుల సాహాయ్యముచే భాండాగారములకు రప్పించి వాండ్రకు దీరికయైనప్పుడెల్ల భాండాగారములకు వచ్చునంతటి యభిరుచి కలిగింపవలయును. ఇందులకుగాను బాలుర కుపయుక్తములగు న్నాట లేర్పఱుపవలయును. వీరు చూచి యానందించుటకు సద్భావబోధకము వైచిత్రములైన చిత్రములు గల గ్రంథములను గ్రంథాలయములు సమకూర్పవలయును. వీరికి దెలియునంతటి సులభశైలిలో గొన్ని గ్రంథములువ్రాయించి చదువుకొనగలవారి కొసంగి, చదువుకొనలేనివారి కందలి యంశముల బోధించి జ్ఞానము కలిగింప గ్రంథాలయములు ముఖ్యముగా బనిచేయవలయును. ఇట్టి గ్రంథములు ఆంధ్రభాషలో నరుదుగనున్నవి. గ్రంథాలయములలో మహాపురుషుల చిత్తరువులు సమకూర్చి వాని వృత్తాంతములు బాలురకు బోధించుచు బరీక్షలలో నుత్తీర్ణులగు బాలురకు బహూకృతు లొసంగుచు బాలుర విద్యాభివృద్ధి ముఖ్యముగ జేయవలయును.

గ్రంథాలయములలో బ్రాహ్మణుడని, వైశ్యుడని, శూద్రుడని, నిమ్నజాతీయుడని భేదముపెట్టుకొనరాదని నా యభిప్రాయము. జాతిభేదములు, గ్రంథాలయము లం దీషణ్మాత్రమేని గణింప రాదని సహేతుకముగ శాసింపవచ్చును. సాధ్యమైనంతవరకు భాండాగారములకు స్వంత భవన మావశ్యకము. ఇవి యన్ని యటులుండ సం

చార గ్రంథాలయములు నెలకొల్పుట మిగుల నావశ్యకము. సంచార గ్రంథాలయముల వలన పల్లెటూళ్ల పౌరుల కుపయోగ మెక్కుడు కలదు. ముఖ్యముగా పట్టణ వాస్తవ్యులకంటె పల్లెటూళ్ళ నివసించు వారు జ్ఞానశూన్యులుగ నుంటచే నీకార్యము పల్లెటూళ్ళవారి కెక్కుడుపయోగకరము. మనదేశము నిర్బంధ విద్యకు నోచుకొనలేదు. కావున గ్రంథాలయముల వారు రాత్రి పాఠశాలల నిల్పి పగలు చదువుకొన జాలని వారలకు తమ వ్యయముతో విద్యనేర్పి, ధర్మ విద్యా దాన మొనర్చి జనసామాన్యమునకు జ్ఞానము ప్రసాదింప వలయును. మఱియు ముద్రితగ్రంథముల గొన్నిటిని సేకరించి యొకచో గూర్చి నంతనే దానికి గ్రంథాలయమను పేరొప్పదు. ప్రతి గ్రంథాలయమువారును అముద్రిత గ్రంథములను, తాళపత్ర గ్రంథములను సంపాదించి గ్రంథాలయముల నలంకరింపవలయును. ముద్రిత గ్రంథములను మన నవీను లనేక విధముల మార్చి మూలకవుల యభిప్రాయముల చెఱచియున్నారు. అట్టి సందేహనివృత్తికై యచ్చుపడిన వేనియు లిఖిత గ్రంథముల సంపాదించవలయును. మన పెద్దలు పఠించు గ్రంథస్థములు కాని చాటుపద్యములను, ఆడువాండ్రు, కాపులు పాడుపాటలను, సామాన్యులు చెప్పుకొను చారిత్రోద్బోధకములగు కథలను గ్రంథాలయములు ముఖ్యముగా సమకూర్పవలయును. "ఇంట గెల్చి రచ్చగెలువవలె" నను సామెత జ్ఞాపకముంచుకొని మన చెయిజారి కంటికగపడక ఖండాంతరములకు, దేశాంతరములకు బోవనున్న లిఖిత పుస్తకములకై తొలుత యత్నించి, పిమ్మట ముద్రిత గ్రంథములకొఱకు యత్నించుట యుక్తము. మన ముపేక్ష యొనరించుకొలంది, అటుకుల పైబడి దుమ్ముకొట్టికొని రానురాను వినాశనము నొందనున్న నష్టశేషములగు మహాకవి కృత మహా గ్రంథములు నశించును. కాన నిది శీఘ్రముగ జేయదగినది. ముద్రిత గ్రంథముల సంపాదించుటలో నించుక యాలస్యము కలిగినను మునిగి పోవునదిలేదు గాని వ్రాతప్రతు లార్జించుటలో నాలసించిన గ్రంథ

ములు నామరూపములు లేకుండబోవును. ఇందులకై యొక గ్రంథాలయమువారేగాక ప్రత్యాంధ్రుడు యత్నింపవలయును. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు కొలదికాలములో నైదువేల తాళపత్ర గ్రంథములను, ఆంధ్రపరిశోధక సభవారు 1200 లిఖిత గ్రంథములను నిన్న మొన్న నార్జించిరి. కర్ణాటక దేశమునను, నిజామురాష్ట్రమునను, ద్రావిడదేశమునను నేటికి లిఖితపుస్తకములు కలవు. ఇందు నూటికి పదియేని, కడకొకటేని యముద్రిత గ్రంథము లభింపకపోదు. సకాలములో లిఖిత గ్రంథముల నార్జించి మనమెల్లరము గ్రంథాలయ ప్రదర్శనములకు యత్నింప వలసియున్నది. దైవానుగ్రహమువలనను, సరస్వతీ వరప్రసాదము వలనను మన మీ ప్రదర్శనముగూడ కొలది కాలములో నేర్పఱచుకొన శక్తులమగుదుముగాక.

ఆంధ్రదేశ కేంద్ర గ్రంథాలయము

ఆంధ్రదేశమున బ్రస్తుతమున్న గ్రంథాలయములలో భాషా గ్రంథము లన్నింటిని సమకూర్చుట దుర్ఘటకార్యము. కాన నింత వఱకు బ్రచురింపబడిన ముద్రణ గ్రంథములతోడను, దేశమున జీర్ణించుచున్న తాళపత్ర గ్రంథములతోడను ఆంధ్రదేశ మధ్యమున కేంద్ర గ్రంథాలయ మొకటి ముఖ్యముగా స్థాపింపవలయును. కేంద్ర గ్రంథాలయము లేనిది భాష వృద్ధిలోనికి రాజాలదు. దీనికి దొరతనము వారి సహాయము ఆంధ్రమహాజనుల సాహాయ్యము ముఖ్యముగా గావలయును. ఇది నూతనాంశముకాదు. గ్రంథాలయము లభివృద్ధిగనున్న ప్రతిదేశమందు నిట్టి కేంద్ర గ్రంథాలయములు కలవు. కేంద్ర గ్రంథాలయములయందు దేశమున వాడుకలోనున్న ప్రతి భాష యందలి గ్రంథములు జాగరూకతతో సమకూర్పవలయును. ఇతర గ్రంథాలయములయందున్న యముద్రిత గ్రంథ ప్రతులు సంపాదించవలయును. కేంద్ర గ్రంథాలయము స్థాపించు వఱకు శిశుగ్రంథాలయము లభివృద్ధిలోనికి రాజాలవు. ఇది యాంధ్రులందఱేకముఖమున జేయదగిన కార్యము.

గ్రంథాలయముల వలని లాభములు

గ్రంథాలయములవలన మనకు ముఖ్యముగా విద్యాలాభము కలుగును. విద్య యనునది మానవులకు పరంపరాగతమగు జ్ఞాన నేత్రము. అది లేని మానవుడు చతుష్పాదజంతువుల జేరును. దాని బూర్వ కవు లిట్లు వర్ణించిరి.

శ్లో॥ విద్యా నామ నరస్య రూప మధికం ప్రచ్ఛన్న గుప్తం ధనం
విద్యా భోగకరీ యశస్సుఖకరీ విద్యా గురూణాం గురుః
విద్యా బంధుజనో విదేశగమనే విద్యా పరాదేవతా
విద్యా రాజ సుపూజ్యతే నహి ధనం విద్యా విహీనః పశుః

— భర్తృహరి.

తే. గీ. విద్య యొసగును వినయంబు వినయమునను
బడయు బాత్రత పాత్రత వలన ధనము
ధనము వలనను ధర్మంబు దానివలన
నైహికాముష్మిక ఫలంబు లందు నరుడు.

అని పూర్వులు విద్యాధనము ప్రశస్తమయినదనియు, విద్య పరార్థ సాధకమనియు వాకొని యున్నారు. విద్యవలన గలుగు లాభములు వేఱుగా జెప్ప నవసరము లేదు. విద్యా జ్ఞాన శూన్యుడు ద్విపాద పశువను విషయము మన మెఱింగినదె. ఎక్కార్యమునకేని, ఎట్టి వానికేని విద్య తోడ్పడి తీరును. వ్యవసాయమునకేని, వర్తకమున కేని, వ్యవహారమునకేని విద్యవలె దోడ్పడునది మఱియొకటిలేదు. ఏ కార్యమున నేమి, ఏ రూపముననేమి ఘనత సంపాదించుటకు విద్యయే భిక్షము. విద్యావంతుం డెందున్నను పూజనీయుడె. విద్యలేని దేశ మధోగతి పాలుకాగలదు. అజ్ఞానాంధకారమునబడి తెన్నుగానక గిలగిల లాడు మనదేశము జ్ఞాన సూర్య కిరణ ప్రచారమున నచిరకాలమున నున్నత దశం గాంచుగాత! బరోడా రాష్ట్రము వలె మనదేశము గూడ విద్యాభివృద్ధి కావలయుననిన గ్రంథాలయముల నెక్కుడుగ స్థాపించి విద్యావృద్ధులు, దేశాభిమానులు తమ జీవిత సర్వస్వము నిందులకు ధారపోయవలయును. అట్లు వారొనరించినగాని

భాండాగారముల యుపయోగములు లోకమునకు దెలియజాలవు. తెలిసినగాని సర్వజనుల భాండాగార మాకర్షింప జాలదు. సర్వ జనుల నాకర్షింప గల శక్తి భాండాగారమునకున్నగాని విద్యాభివృద్ధి కాజాలదు. విద్యాభివృద్ధియైనగాని సాటిదేశీయులతో బాటు మన దేశీయులు విధ్యుక్త ధర్మముల నెఱుంగజాలరు. విధ్యుక్త ధర్మమెఱింగినగాని స్వదేశ సేవ జేయనివాడు జీవచ్ఛవంబని యెఱుంగలేరు. భారతీయులు స్వదేశాభిమానులైననేగాని మన హూణప్రభువులు మనము స్వపరిపాలనార్హుల మని తలంప జాలరు; అట్లు వారెఱిగిననేగాని భారతీయులు నిష్ప్రయోజకులను పేరు సాటిదేశములయం దంతరింపదు. కావున నర జన్మ మెత్తిన తరువాత దేశాభిమానము, భాషాభిమానము లేకున్న మన జన్మము పశుజన్మ మగునని గుఱుతెఱింగి స్వదేశమందు విద్యాభివృద్ధి నొనర్చి, దేశసేవజేసి భారతీయుల పేరు ప్రతిష్ఠల నిలుపుదురని ప్రార్థించుచున్నాను.

— గ్రంథాలయ సర్వస్వము, సంపుటము 2 సంచిక 2 నుండి

# మూడవ కృష్ణామండల గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ, గంపలగూడెము

[ 1918 మార్చి 31 ]

శ్రీ తల్లాప్రెగడ సూర్యనారాయణరావు

జ్ఞానము

జ్ఞానము దైవదత్తము. దానికి సాంగత్య విశేషమున నుద్బోధము కలుగును. తోడివారల తమయంతవారిగ, ఒక్కొకప్పుడు, తమకంటె నెక్కువవారిగగూడ జేయుచుండును. ఈజ్ఞానమొకనాటిదిగాదు. ఒక చోటిదికాదు. దానికాదిలేదు. అంతములేదు. ఆద్యంతశూన్యంబగు నీజ్ఞానాంబుధినుండి ధీవిశాలురు తమ బుద్ధివైశాల్యము కొలంది ప్రజ్ఞాబుద్ధుల సంగ్రహించి వానిని క్రమక్రమముగా విజృంభింపజేయుదురు. అయ్యది తోడివారలకు వాగ్రూపముననో, లిఖితరూపముననో లభింపజేయుచుందురు. వాగ్రూపకమైన యెడల నక్షరాస్యునకును, నిరక్షరకుక్షికినికూడ నుపయోగపడును. లిఖితరూప మొక్క యక్షరజ్ఞునకే విదితమగును. కాని వాగ్రూపక మాయొక్క యుపాధితోడనే యంతరింపగలదు. లిఖితరూపకము యుగముల కొలది నిలచి యుండును. గ్రంథములన నివియెకదా! వాగ్రూపకముగూడ స్వరయంత్రమూలమునను, సంజ్ఞాలేఖన మూలమునను చిరస్థాయిగ నిలువ నాధారము లేర్పడినవి.

కించిజ్ఞుండును, మితాయుష్మంతుండును నగు మానవునకు నాడు లభించిన జ్ఞానము నాటితోడనే యంతరించి చిరస్థాయిగ నిలువకుండిన యెడ నీజన్మబంధ విమోచనమునకు మార్గమేలేక యుండియుండును. యుగయుగముల లభియించిన జ్ఞానము నిల్చియుండుటచేతనే యైహికాముష్మిక సౌఖ్యంబులు రెండును గూడ నొకనాటికన్న నొకనాడెక్కువగ లభించుట కవకాశము లభించుచున్నది. అదిలేకున్న గాలికి

గ్రహింపఁజాలము. లక్ష్యలక్షణజ్ఞానము కుమారుపరకు గ్రంథరచనకు సాహా యపడఁజాలదు. అభ్యాసమునకై విడి వ్రాతలు వ్రాసి పండితులయొద్ద సవరింపఁ జేసికొనుచుండవలెను. పాండిత్యమునకుఁ గవితాశక్తికి సంబంధము లేదు. విద్వత్కవులే కవులు. "కేవల కవులు కేవల కవులే" యని సూక్తిగలదు.

"దేవునానఁ దొల్లి దేశాని కొకకవి
యిప్పు డూర నూర నింటనింట
నేవు రార్వు రేడ్వు రెనమండ్రు తొమ్మండ్రు
పదుగు రేసి కవులు పద్మనాభ"

యన్నట్టు లిప్పుడు బాలకవులు వెల్లివిరియుచున్నారు. ఏ దేశమునఁ గవు లెక్కువమంది యుందురో యా దేశము వృద్ధి చెందుననియు నే దేశమునఁ గవులు జనింపరో యా దేశము క్షీణించుననియు విజ్ఞుల మతము. ఏల? బుద్ధివికాసముగలవారు కవులు. వారు వైకుంఠము మొదలు పాతాళమువఱకు సంచరించి యాంధ్ర దేశ వాసులకుఁ దెలియని విషయములను మనోదృష్టిచేఁ జూచి చెప్పుదురు. కావునఁ గవులు పెక్కురు పుట్టుట శుభోదర్కమే కాని యట్టి పేరుపొందగోరువారు వంచన లేక లక్ష్యలక్షణజ్ఞానము, దానికిఁ దగిన యోగ్యత సంపాదించు కొనవలయు ననియే నా యభిలాషగాని యితరము కాదు.

గ్రామముల నుండువారు పేదలుగను, పుస్తకనామములు తెలియనివారుగను నుందురు గావున గ్రంథాలయములందు పుస్తకము లలవడిన నట్టివారి కెంతో సహాయపడును. జ్ఞానము సంపాదింపఁ గోరిక గల్గియు పేదలగుటచేఁ గొనలేక యుండువారును, యేపుస్తకములను జదువవలయునో తెలియనివారును గొందఱు కలరని నే నెఱుఁగుదును. అట్టివారికి గ్రంథాలయములు నిక్షేపములు.

సద్గ్రంథములఁ జదువుఁడని పలుమాఱు చెప్పితివిగాని గ్రంథము చదువక యదిమంచిదో చెడ్డదో తెలిసికొనుట యెట్లని ప్రశ్న వచ్చెను గదా! ఇది యడుగఁదగిన ప్రశ్నయే. నా ప్రత్యుత్తరమేమన, గ్రంథాలయ సర్వస్వము మూఁడవ సంపుటము రెండవభాగము పైపుటయందు వెనుకప్రక్క

నిట్లు ప్రకటింపఁ బడియున్నది.

**When you buy a book try this test.**

ఒకగ్రంథమును గొనునపుడు పరిశీలింప వలసిన ముఖ్య విషయములు:—

౧. అందముగా నున్నదా?

౨. మంచి భాషయందు వ్రాయఁ బడినదా?

3. మన జీవిత విధానమును దెలుపునా?

౪. మనజ్ఞానమును అభివృద్ధిఁ జేయునా?

౫. మనవ్యవహారమునకు ఉపకరించునా?

౬. హితమును బోధించునా?

౭. సన్మార్గజీవితమునకు సాయపడునా?

౮. మనజీవితమును సారవంతము చేయునా?

౯. ఆప్తునివలెఁ బ్రేమింపఁ దగియున్నదా?

ఈ ప్రకారము పరీక్షించి పుస్తకముల గ్రహింప వలయును. ఎట్టి పనికిమాలిన పుస్తకమందైనను నేదో యొకమూల నొక మంచి మాటయో నీతియో యుండును. అట్టిదానితోఁ బ్రయోజనము లేదు. కొన్నిటియందు విపరీత నీతులు, దురాచారములు వర్ణించి లోకమట్లు ప్రవర్తింపకుండుటకై యది వ్రాయఁ బడినదనియు నిదియు నీతి హిత బోధకమనియు నందురు. అది సరిగాదు.

గ్రంథాలయము లందు దుష్టగ్రంథములు, నిస్సార గ్రంథములు ప్రోగుగాకుండుటకు వేఱొక సదుపాయము కలదు.

ఇప్పటి గ్రంథాలయ స్థాపకులు గ్రంథకర్తలపాలి చీడపురుగులై యున్నారు. ఒక గ్రంథకర్త విద్య సేకరించుటయందు, నాలోచించుటయందు, గ్రంథము వ్రాయుటయం దెంత శ్రమించునో, ఎందఱ నాశ్రయించి పదిరూకల సంపాదించి దాని నచ్చొత్తించునో కోశ స్థాపకులకు బొత్తిగ మనస్సునకు దగుల లేదు. పది పుస్తకములు వెచ్చమగునా పదిరూపాయలు వచ్చునాయని డబ్బిచ్చి పత్రికలయందుఁ బ్రకటితము చేయఁ గానే ముందీ భిక్షాటకుల యుత్తరములు స్తుతి పాఠములతో దిన

మున కొకటి రెండు వచ్చుచుండును. కోశస్థాపకులలో దొంగలు కొందఱు కలరు. మూరెడు పొడుగు పేరితో నొక గ్రంథాలయమని పేరు పెట్టి తాను గార్యదర్శినని యీబిచ్చగాం డ్రుత్తరములు వ్రాయుదురు. విచారింపం బోయిన వ్రాసినవాని తలలోం దప్ప నీగ్రంథాలయ మాయూరనుండదు. ఉండినను వానియింట నుండును. అది పదుగురకుపయోగపడునది కాదు. కొన్ని గ్రంథములుచేర్చి యావల వానిని విక్రయింతురు. ఇట్టి వారిని గుఱించి సువర్ణలేఖయందొక వ్యాసముం జదివి యుంటిని.

ఇప్పుడు గ్రామగ్రామమునం గోశాగారములు నెలకొల్పంబడుచున్నవి. గ్రంథకర్త ముద్రించు గ్రంథముల సంఖ్యకంటె వీరిసంఖ్య యెక్కుడుగ నున్నది. ముద్రించిన పుస్తకములు వీరికిం బంచిపెట్టి తరువాత గ్రంథకర్త యేమిచేయవలయును? కావునం గోశస్థాపకు లీపుస్తకభిక్షము లెత్తకుండుట ప్రథమ కర్తవ్యము. పుస్తకముల యాచించుటకు మాఱు ధనవంతులయొద్ద ధనము యాచించి పుస్తకములను వెలయిచ్చి కొనవలయును. అట్లుకొనువారు మంచి గ్రంథములనే కొందురుగాని పనికిమాలిన పుస్తకములను గొనరు. ఇదియొకమేలు. పుస్తకము మంచిదాయెనా గ్రంథాలయముల వారందఱు కొనుటచే గ్రంథకర్తకెంతో సాహాయ్యము చేసినవారగుదురు. దానివలన నతం డుత్సాహియై యింకను సద్గ్రంథములు వ్రాయువాం డగును. ఈ విధానమున గ్రంథకర్తలు పోషింపం బడుదురు. భాషయుం బోషింపం బడును. కావునం గోశస్థాపకులు పుస్తకభిక్షయను నీచవృత్తిని మానుదురుగాక.

**ముద్రణమువలని లాభనష్టములు**

తక్కువ వెలకు లభ్యపడుట, సర్వజనులకుం గొనం దగియుండుట, యామూలమున విద్యాజ్ఞానములు లోకమున విరివిగ వ్యాపించుట లోనగునవి ముద్రణమువలనం గలుగు లాభములు. ఇవి మీరందఱెఱింగినవియే. లోకమున నీడలేని దీపములేదు. దుఃఖములేని సుఖములేదు. అట్టులే యిదియు. ఇప్పుడు ధనవంతులకువలె బీదలకును బుస్తకములు దొరకుచున్నవి. విజ్ఞానము వీథిజలదారియందలి నీళ్లవలె వీథులవెంట

బాఱుచున్నది. అయినను నిట్టి గ్రంథపఠనమువలన విశేషలాభము లభించుటలేదు. పుస్తకములు కొలఁదిగను, వెలయెక్కువగ నుండుకాలములో వానిని గొనువారు వానిని బలుమారు చదివి దానిసారమంతయు హృదయమునఁ బాదుకొనఁజేసి యుండిరి. అట్టివారి కట్టి పుస్తకములు కొలఁదిగను, వెలయెక్కువగనుండు కాలములో వానిని గొనువారు వానిని బలుమారు చదివి దాని సారమంతయు హృదయమునఁ బాదుకొనఁ జేసియుండిరి. అట్టివారి కట్టి పుస్తకములు వాస్తవముగ మిత్రములే యైయుండెను. ఇప్పుడో, యతిపరిచితి యవజ్ఞతకుఁగారణమయ్యెను. శ్రమపడక లభించినదానియందు గౌరవము తక్కువ. కావునఁ బుస్తకములందు మిత్రభావము పోయి సామాన్యమైన పరిచయభావము కలిగెను. బ్రాహ్మణ కల్లు దుకాణములని పేరుగొన్న కాఫీ హోటల్సునందుఁ జేరువారి పరస్పర పరిచయ మెట్టిదో యిప్పటి పుస్తక పరిచయ మట్టిదని యొకఁడు చెప్పెను. ఇప్పుడు వెలువడు ననేక పుస్తకములు సోమరులు కాలము గడుపుటకై వినియోగపడునవియే కాని వాస్తవ జ్ఞానదాయకములుగావు. సద్గ్రంథములు కొన్నియున్నను గడ్డిగాదమువలె నివి పెరుఁగుటచే వానినిఁ కనిపెట్టుటకుఁ గాని, వానియందే విశేషకాలము వెచ్చించి బాగుపడుటకుఁ గాని వలను లేకుండఁ దటస్థించుచున్నది. ఏది పొట్టో యేదిగట్టియో తెలిసికొనుట కష్టము. రసము, స్నిగ్ధము, స్థిరము నగు నాహారముగొని దేహబుద్ధి పటుత్వము సంపాదించుకొనుటయందుపేక్ష వహించి కాఫీ నీళ్లు త్రావి రోగముల పాలవు వారివలె నుత్తమ గ్రంథపఠనమున లక్ష్యపఱచి సులభంబులగు నల్ప గ్రంథములఁ జదివి వానియందలి విషయములఁ గొన్నిఁటి నెఱుఁగుటచే జ్ఞానులమైతి మనుకొను మహాజ్ఞానులు కొందఱు వెలువడుచున్నారు. కావున గ్రంథాలయములందు నల్పవిషయముల గుఱించి వ్రాయఁ బడిన గ్రంథములుండుట తగదని నాయభిప్రాయము.

చదువ నేర్చినవారు పుస్తకములయం దుద్దేశమేమి? కాల వ్యయము చేయుటకా? జ్ఞాన విజ్ఞానములు సంపాదించుటకా? యని యాలోచింప వలయును. ఆహారము దేహమును, బుస్తకపఠనము

మనస్సును మంచిదశయం దుంచవలయును. తద్విరుద్ధములైన యాహార, పుస్తకములు త్యాజ్యములు. తెలిసికొన యోగ్యమైనది విద్యగాని యచ్చొత్తింపఁబడిన దేనినైనఁ జదివి తెలిసికొనుట విద్యనార్జించుట కాదు. ఇంతయేల? పుణ్యమా పురుషార్థమా యను వాడుకమాట యిందు ముఖ్యముగా నన్వయించును.

కోశవంతుల కృత్యములు

౧. కోశవంతులు సద్గ్రంథము లేవేవి యెందెందుఁ బ్రచురింపఁ బడు చున్నవో తెలిసికొని వాని నార్జింప సమపాయములు వెదుక వల యును.

౨. సంపాదించిన పుస్తకముల నన్నిటిని దాను జదువవలయును.

౩. తాను జదివిన వానిలోని సద్విషయములను గ్రామములోని వారికి నుపన్యాసము లొసంగియో, పురాణపఠనముగఁ జదివి చెప్పియో మఱి యేవిధముగనో నప్పుడప్పుడు తెలుపుచుండ వలయును.

౪. తెలిసినవారిని బిలిపించి యప్పుడప్పు డుపన్యాసము లొసఁగఁ జేయవలయును.

౫. మంచి నడవడి గలవాఁడై జనుల గౌరవమునకుఁ బాత్రుఁ డుగా యత్నించుచుండవలయును.

౬. ఏవిషయమైనఁ బరిశోధింప మనస్సుగల వారి కే యే గ్రంథములం దా విషయము వ్రాయఁబడి యున్నదో తెలిపి సహాయుఁడు కావలయును.

౭. అముద్రిత గ్రంథము లెందైనఁ గలవా యని విచారించి యట్టివి యుండిన సేకరింపవలయును.

౮. అపూర్వ గ్రంథమేదైన లభించిన ముద్రింప యత్నమైనఁ జేయవ లయును. లేక తక్కిన కోశవంతుల కావిషయము వ్రాసి కోరిన వారికి దాని ప్రతులు లభింపఁ జేయవలయును.

౯. చదువుకొనుటకుఁ బుస్తకముల నిచ్చిన యెడల వానిని తీసికొనిన వారు మఱల నిచ్చునపుడు దానిచ్చిన పుస్తకమునే యిచ్చిరా, వేఱొక పుస్తకము నిచ్చిరా, పుస్తకములోని పత్రములను బటములను చించికొని పోలేదుగదా యని శోధించి యావల వానిని యథాస్థానమున నుంచవలయును. పుస్తకమును మార్చు పెద్దమనుష్యులు పటములను జించుకొనిపోవు పెద్దమనుష్యులు కొందఱుందురు.

౧౦. హైదరాబాదు నగరమున నుండు గ్రంథాలయమందుఁ బుస్తకమింటికిఁ గొనిపోవు సభ్యులు దాని వెల ముందుగ నియ్యవలయును. పుస్తకము మంచిస్థితిలో మరల నీయఁబడునేని వారిచ్చిన పైకము వారికి నొసఁగఁ బడును. ఇట్టి నియమము తక్కిన చోటుల నుండవచ్చును.

౧౧. వ్రాఁతపుస్తకముల సేకరించువారు మంచి పుస్తకములను దాము హరించి తక్కిన వానిని గ్రంథాలయములకుఁ బంపకుండునట్లు గ్రంథాలయములకు సంబంధించిన వారందఱు కనిపెట్టవలయును.

౧౨. ఏ పుస్తకములు లోకులచేఁ జదువఁ బడుచున్నవో యందు విశేషముగ నెట్టివి చదువఁ బడుచున్నవో కనిపెట్ట వలయును. దీనికై పుస్తకములఁ జదువువారి పేరు చదివిన పుస్తకముల పేరు వేరొక పుస్తకమున వ్రాసియుంచుచుండవలయును.

కోశవంతులు సంపాదింపఁ దగిన గ్రంథములు

గ్రంథ సంపాదనమందు భాషానియమ మక్కఱలేదు. తత్తత్ప్రదేశవాసు లెఱిఁగిన భాషలయందలి గ్రంథములెల్ల సంపాదింపఁ దగినవే. కేవలాంధ్రభాష ప్రచారముననుండు పల్లెలయందు నఱవ పుస్తకములుంచఁ బనిలేదు. మండలమున కొక్క ముఖ్యకోశాగార ముండవలయును. అందు సకలగ్రంథము లుండవలయును. ఆంధ్ర గ్రంథములు ప్రాముఖ్యము వహింపవలయును. వానికి సమానముగ సంస్కృత గ్రంథముల గౌరవింపవలయును. పెక్కురు నాగరలిపి యెఱుఁగరు కావున నివి

యాంధ్రలిపి నుండుట మేలు. అట్టివి లభింపనపు డేలిపిలో నుండినను గ్రహింపవచ్చును. తెనుఁగుచేయఁ బడని కొన్ని సంస్కృత గ్రంథములు గలవు. అవి యాంగ్లభాషయందు భాషాంతరీకరింపఁ బడినవి. ఇట్టి వానిని సంపాదించినచో మూలము లభ్యపడనపుడును, సంస్కృతము రానివారికిని నివి యుపయోగించును. సంపాదించిన గ్రంథములు విషయ మును బట్టి వేదాంతశాస్త్రములు, పురాణములు, కావ్యములు యోగము, వైద్యము, జ్యోతిషము, అని యిట్లు నానాభాగములుగ తరగతులుగ విభజింపవలయును. కోశ నామసూచిక నొకటి యుంచ వలయును. ఇది ముద్రితమగుటయే గాక వలయువారికి వెలకు లభింపఁ జేయుటయు మేలు.

— గ్రంథాలయ సర్వస్వము, 3 వ సంపుటము 6 వ భాగమునుండి.



శ్రీ సూరి వేంకట నరసింహశాస్త్రి

( పేజీ ౧౧౧ )



శ్రీ భూపతిరాజు సీతారామరాజు

( పేజీ ౧౨౮ )

# ఐదవ పుదుక్కోట గ్రంథాలయ మహాసభ, పుదుక్కోట

[1925]

## శ్రీ సూరి వేంకట నరసింహశాస్త్రి

గ్రంథాలయ సంఘ వార్షిక సభయందు గ్రంథాలయ పరిపాలనకు సంబంధించిన సాంకేతిక విషయములనుగూర్చి చర్చించుట సహజము. అయితే మనమింకను ఉద్యమమున నలుదెసలను ప్రచారణ చేయవలసి యున్నది. గ్రంథాలయముల వలన కలిగెడి అనేకలాభములు ప్రజాసామాన్యమునకు స్పష్టముగా బోధపడలేదు. దేశము నిరంతర కాంక్షతో వాంఛించుచున్న జాతీయ విద్యావిధానమున గ్రంథాలయముల యుచిత స్థానము ఇంకను నిరూపింపవలసి యున్నది. గ్రంథాలయములు కేవల గ్రంథములను భద్రపరచు స్థానములు మాత్రమేగాక జాతి మత వృత్తి వయో విచక్షణ లేకుండ జనసామాన్యము నందలి అందరు వ్యక్తులకును సౌభాగ్యము సమకూర్చునదిగా నుండనగునని ప్రజలింకను పూర్ణముగా గ్రహించ లేదు. అన్నితరగతుల ప్రజలు సమానస్కంధులుగా ఏకత్ర సమావేశమై ఓర్పు, సహనము మొదలగు పౌరవిధులను అలవడ చేసుకొనుటకు గ్రంథాలయము తగిన కేంద్రస్థానమను విషయమునకు తగిన ప్రాముఖ్యత ఇంకను జనసామాన్య మిచ్చుటలేదు. మన దేశము ప్రాచీన కాలమునుండియు నాగరికతఁ జెందినదని మనమెంత విఱ్ఱవీగు వారమైనను ఈడు ముదిరినవారి విద్యాభివృద్ధికొఱకు వర్తమాన కాలమందు మననేమియు కృషి చేయుచుండుటలేదు. గ్రంథాలయములు సంస్థాపితములైనచో ఈ పనిని మిక్కిలి జయప్రదముగ జరుపగలవను విషయము నిప్పుడిప్పుడే మన విద్యాధికులు గ్రహించుచున్నారు. విద్యా దానమొనర్చు ప్రతిష్ఠాపనలయందన్యోన్య సహకారభావమును నెలకొల్పుట ముఖ్యావసరమనియు, గ్రంథాలయముల మూలమున అట్టి పని సమకూరుననియు, ఇంకను మన దేశస్థులు తెలిసి

కొన వలసియున్నది. ఏ గ్రామమందున్న విద్యార్థియైనను నగరముల యందు నెలకొల్పబడి యున్న ఉన్నత గ్రంథాలయముల యందుండెడి ఉద్గ్రంథములను తగిన బందోబస్తులతో తెప్పించి చదువుకొనుట కర్హుడను రహస్యము మనదేశమున బహుకొలది మందికి గాని తెలియదు. ఇంకను ధర్మగ్రంథాలయ మ త ము మనదేశమున వ్యాప్తి చెందనే లేదని స్పష్టముగా చెప్పవచ్చును. ఈ యంశము లన్నియు ప్రజాసామాన్యము స్పష్టముగా తెలుసుకొని అనుభవము లోనికి తెచ్చినగాని "గ్రంథాలయము సామాన్య ప్రజల విశ్వ విద్యాలయము" అను లోకోక్తి కేవల గ్రంథస్థము గానే యుండగలదుగాని ప్రజల నిత్య జీవనమందు దానికి వ్యాప్తి కలుగ నేరదు. కాబట్టి యిట్టి సభల యొక్క ముఖ్యోద్దేశము సర్వతోముఖమగు ధర్మగ్రంథాలయము యొక్క పరమ ప్రాప్యము లేవో ప్రజలకు బోధించి వానిని ఆచరణలోనికి తెచ్చు విధానములను నిరూపణ చేయుటయే యని నేను మనవి చేయుచున్నాను. అట్లు చేసిన గాని గ్రంథాలయము లేని పట్టణము గాని, పల్లెగాని యుండకూడదనియు, గ్రంథాలయోపయోగమును పొందని పురుషుడుగాని, స్త్రీ గాని, బిడ్డగాని యుండగూడదనియు మన యుద్యమము యొక్క పరమప్రాప్యము కార్యా చరణకు రాదు.

ప్రాచీన గ్రంథాలయములు

ప్రథమమున మనదేశమందును, పరదేశముల యందును, పూర్వమున్నట్టియు, ప్రస్తుతము పనిచేయుచున్నట్టియు గ్రంథాలయములను గూర్చి సంగ్రహముగా పరిశీలింతము. సనాతనమగు ఈభరత వర్షమున గ్రంథాలయములు ప్రాచీనకాలమునుండియు నెలకొల్పబడి వర్ధిల్లుచుండెను. ఆదికాలమున జ్ఞానము గ్రంథస్థముగాక వాగ్రూపమున ఒకరినుండి మరియొకరు నేర్చుకొనుచుండిరి. ఆకాలపు బ్రహ్మర్షులును, రాజర్షులును ఒక్కొక్కరు ఒక్కొక్క సంచారగ్రంథాలయముగా నుండిరి. వారు సంచరించిన వాతావరణ మంతటను తమ తపోధనముచే సముపార్జనచేసిన తేజోపుంజము మూలమున కాంతిని వెదజల్లుచు అజ్ఞాన తిమిరమును పారద్రోలుచుండిరి. లిపి యేర్పడినపిదప అనేక

రకములగు వస్తువులతో గ్రంథము లేర్పడుచుండెను. ఈ గ్రంథములు ఆకాలమున హస్తలిఖితములుగా నుండెను. ఈ లిఖితగ్రంథములు మిక్కిలి శ్రద్ధతోను, ప్రయాసతోను తయారుకాబడుచుండెను. ప్రథమమున ఇట్టి లిఖితగ్రంథములు బౌద్ధవిహారములయందును, దేవాలయముల యందును ప్రత్యేకముగా భద్రపరుపబడుచుండెను. బౌద్ధయుగములో బౌద్ధవిహారము లన్నిటియందును గ్రంథములు భద్రపరుపబడు చుండెననియు చెప్ప వచ్చును. గ్రంథములను లిఖించుటయు, వానిని భద్రపఱచుటయు బౌద్ధ సన్యాసుల విధ్యుక్త ధర్మములలో అగ్రగణ్యము. ఫాహియానను చైనా దేశపు బాటసారి భారతదేశ సంచారమునుగూర్చి వ్రాసిన గ్రంథములో లిఖిత గ్రంథములను గూర్చియు, వానిని భద్రపఱచు విహారములను గూర్చియు పేర్కొని యున్నాడు. ఆ కాలమున లిఖిత గ్రంథములు వ్రాయుటకును, భద్రపఱచుటకును వారెంత కష్టపడిరో ప్రకృతి శక్తుల సాధనముల మూలమున శీఘ్రకాలమున ఉద్గ్రంథములను ముద్రించగల్గు సావకాశముగల ఈ కాలపువారు గ్రహించుట కొంచెము కష్టమైనపని. మనకు చరిత్ర సిద్ధముగ లభించు గ్రంథాలయమును గూర్చిన యుదంత ములలో మొదటిది నలందా విశ్వవిద్యాలయమును గూర్చియు, గ్రంథా లయమును గూర్చియు. ఇది చైనాదేశపు యాత్రాపరుల గ్రంథముల యందు లభించుచున్నది. నలందా విశ్వవిద్యాలయమున గ్రంథములు తొమ్మిది అంతస్తులుగల "రత్నోదధి" యని పేరుగన్న మహాసౌధమున భద్రపఱచబడి యుండెను. ఈ గ్రంథాలయము క్రీస్తుశకము 8 వ శతా బ్దమున నాశము పొందింపబడినది. పిమ్మట బంగాళాదేశ ప్రాంతమును పరిపాలన చేసిన పాలవంశపురాజులు విక్రమశిల, ఓదంతపురియను గ్రంథా లయములను స్థాపించి అభివృద్ధికి తెచ్చిరి. ఇవికూడ కాలచోదితములే. బాఖ్త్యారు కిల్జీయను యవనునిచే క్రీస్తుశకము 13 వ శతాబ్దమున నాశము పొందించబడినవి. అప్పుడు ఈ గ్రంథాలయముల యందుండు కొందరు బౌద్ధసన్యాసులు అమూల్యములగు గ్రంథములు కొన్నిటిని సంగ్రహించి నేపాళదేశమునకు పారిపోయి అచ్చట తలదాచుకున్నట్లు

చరిత్ర చెప్పుచున్నది. ఈ బౌద్ధ గ్రంథాలయములతోపాటు సనాతనార్య మత గ్రంథములను భద్రపరచు గ్రంథాలయములు హిందూ దేవాలయ ములయందును, రాజమందిరములయందును సుస్థాపితములై ప్రవృద్ధి నొందుచుండెను. గ్రంథాలయములకు గ్రంథ దానముచేయుట మిక్కిలి పుణ్యప్రదమని పురాణములు ఘోషించుచున్నవి. బౌద్ధ జైనమత గ్రంథ ములును నట్లే చాటుచున్నవి.

బౌద్ధ గ్రంథాలయములు నశించినట్లు మనదేశీయుల అదృష్టవశ మున జైన గ్రంథాలయములు నష్టమైపోక ఇప్పటికిని మంచి స్థితిలో నున్నవి. అందు బొంబాయి రాజధానిలో చేరిన సూరత్, క్యాంబే, అహమ్మదాబాదు నగరములందున్న జైన గ్రంథాలయములు మిక్కిలి ప్రఖ్యాతిని గాంచినవి. ఇవియన్నియు మధ్యయుగమున ప్రారంభమైనవి. వీని యన్నిటియందును కాగితపు అట్టలతో చేయబడిన పెట్టెలలో లిఖిత గ్రంథములు భద్రపరుప బడుచుండెను. జైన సన్యాసులు ఈ గ్రంథములు వ్రాయుటకును, భద్రపఱచుటకును మిక్కిలి శ్రద్ధతీసుకొనుచుండిరి. పఠాను వంశీయులు, మొగలువంశీయులు నగు మహమ్మదీయ చక్ర వర్తులు భరతవర్షమును పాలించినకాలమున రాజమందిరముల యందు అమూల్యములగు గ్రంథ సమూహములతో నిండిన ఉన్నత గ్రంథాలయ ములు నెలకొల్పబడి రాజసన్మానము నొందిన విద్వాంసుల యధీనమున మిక్కిలి ప్రసిద్ధిగాంచియుండెను. ఫిరోజిషా నగర కోటయను దేవాలయమును ముట్టడించినపుడు ఆదేవళమున భద్రపరచబడియున్న సంస్కృతగ్రంథములను ఆ మహారాజు తన రాజధానికి తెచ్చి వాని నన్ని టిని రాజభాషలోనికి తర్జుమాచేయించి ప్రచురించెను. హుమాయూను, అక్బరు, జహంగీరు విద్యాభివృద్ధి చేయుటయందును, విద్వాంసుల పోషణయందును మిక్కిలి శ్రద్ధాళువులై యుండిరి.

మహమ్మదీయ మహాయుగము హిందూదేశమున స్థాపితమై మహ మ్మదీయ ప్రభువుల పరిపాలనలో చేరిన చిన్నరాజ్యములుకూడ విద్యా పోషణయందు వన్నెకెక్కినవి.

గుప్తవంశము అవసానము పొందిన పిదప స్థాపితమైన చిన్నహిందూరాజ్యము లన్నిటియందును గ్రంథాలయములు విరివిగా స్థాపింపబడి యుండెను. ధారానగరమున రాజ్యముచేసిన భోజునిచే స్థాపితమైన గ్రంథాలయము ఇందుమిక్కిలి ప్రాముఖ్యత చెందినది. ధారానగరమును చాళుక్యులు జయించిన పిదప అచ్చటి గ్రంథాలయ మందలి గ్రంథములను చాళుక్యులు తెచ్చి తమరాజధానీనగరమున స్థాపితమై యున్న గ్రంథాలయమున భద్రపరచిరి. ఈ చాళుక్య వంశరాజులలో విశాలదేవుడనువాడు మిక్కిలి ప్రసిద్ధికెక్కినవాడు. ఈయనకాలములో సంగ్రహింపబడిన మహాభారతగ్రంథ సంచికనుండి తయారుచేయబడిన (మహాభారత) లిఖితగ్రంథము ఇప్పటికిని జర్మనీదేశమందలి 'బాను' అను నగరమున విశ్వవిద్యాలయమున నున్నది. ఇప్పటికిని ఆల్వారు, బికనీరు, జమ్మూ, మైసూరు, నేపాలు మొదలగు సంస్థానముల మహారాజులు ఉన్నతమగు గ్రంథాలయములను, పోషించుచు ఆ యా గ్రంథాలయముల యందు భద్రపరుప బడియున్న గ్రంథములకు విభజన పట్టికలను ప్రచురించియున్నారు. తంజావూరు రాజమందిరమున నాటికి నేటికిగూడ చూచువారందరికి అచ్చెరువును గొల్పుచున్నది సరస్వతీ విలాసమను ఉద్గ్రంథాలయము. ఇందలి గ్రంథములకు విభజనపట్టికను తయారు చేయుటకు దొరతనమువారిచే నియమింపబడిన బర్నెలుగారు దానిని గూర్చి ఇట్లు వ్రాక్రుచ్చియున్నారు. "ఈ గ్రంథాలయము నందున్న లిఖితగ్రంథముల సంఖ్యను బట్టిచూచిన ప్రపంచమందలి గ్రంథాలయము లన్నిటిలో ఇదియె అగ్రగణ్యమని చెప్పక తప్పదు." ఈ గ్రంథాలయము దక్షిణ ప్రాంతముల క్రీస్తుశకము 16, 17 శతాబ్దములలో పరిపాలించిన తెలుగు నాయక వంశపురాజులు ప్రథమములో స్థాపించిరి. ఈ విషయము ప్రతి ఆంధ్రునకు గౌరవావహముగదా! పిమ్మట 18వ శతాబ్దమున మహారాష్ట్రులు దీనిని మిక్కిలి యభివృద్ధికి తెచ్చిరి. ఇప్పటికిని 11 భాషలలో లిఖింపబడిన 18000 లిఖితగ్రంథములు ఇందున్నవి. ఆధునికకాలమున రాజధాని నగరముల స్థాపింపబడి ప్రవృద్ధినందుచున్న క్యానిమరా గ్రంథాలయమువంటి ప్రతిష్ఠాపనలను మనము చూచుచున్నాము. జిల్లా ముఖ్య

పట్టణములయందును, ఇతర నగరములయందును ఇప్పటికాలమున నూతనముగా స్థాపింపబడి సారస్వత సంఘములకుగాని, వ్యాయామ సంఘములకుగాని అనుబంధములగు గ్రంథాలయము లెన్నియో మనదేశమున గలవు. పూనానగరమునందు స్థాపింపబడి ప్రవృద్ధిగాంచుచున్న "హిందూదేశసేవక సంఘ గ్రంథాలయము", "భాండార్కరు విమర్శన కార్యాలయ గ్రంథాలయము" ఆధునికకాలమున అత్యున్నత నాగరికతను పొందిన దేశములకుకూడ అలంకారములుగా నుండనోపును.

నవ్యభారత వర్షయుగమున అభివృద్ధిమార్గాను సరణముగ గ్రంథాలయములను స్థాపించి అభివృద్ధికి తెచ్చుచున్నది బరోడా సంస్థానాధీశులగు శాయాజీ గాయక్వారు మహాప్రభువు. ఆ శ్రీమంతులు పాశ్చాత్య దేశములందు విరివిగా సంచారము చేయుచున్నపుడు ఈ యుద్యమ మూలమున ఆదేశప్రజలు పొందుచున్న యమూల్య జ్ఞానసంపత్తిని యారసి తమ రాష్ట్రమునగూడ ఆదేశపు విధానముల ననుసరించి, ఈ యుద్యమమును స్థాపించి భరతవర్షమున కంతకును మార్గదర్శకులైరి. ఇందుకొరకై వారు అమెరికానుండి 1911 సంవత్సరమున బోర్డెను అను గ్రంథాలయ శాస్త్ర పండితులను రావించి వారి యాజమాన్యముక్రింద తమ రాజధానీ నగరమున కేంద్రగ్రంథాలయ ప్రతిష్ఠాపనను శ్రీవారు నెలకొల్పిరి. ఈ ప్రతిష్ఠాపన కంగములుగ జిల్లా గ్రంథాలయములు, పట్టణ గ్రంథాలయములు, పల్లెటూరు గ్రంథాలయములు, సంచార గ్రంథాలయములు యంత్ర సాహాయ్యమున సేయుప్రదర్శన మూలమున జ్ఞానాభివృద్ధి నొందించు ప్రతిష్ఠాపనలు మున్నగు శాఖల నెన్నియో స్థాపించి తన్మూలమున గాయాక్వారుగారు వారి రాష్ట్రము నందంతటను జ్ఞానమును వెదజల్లిరి. పుదుకోట రాష్ట్రమున గ్రంథాలయోద్యమము చేయుచున్నపని ఆసంస్థానపు ప్రజలకు కరతలామలకమేగదా! తిరువాన్కూరు సంస్థానమున ఆసంస్థానపు రాజధానీ నగరమున స్థాపింపబడియున్న గ్రంథాలయము మూలమున ఉద్యమము వ్యాప్తినొందుచున్నది. ప్రభుత్వమువారు అచ్చట చిన్ని చిన్ని గ్రంథాలయములకు ధన సహాయము చేయుచున్నారు. మహారాష్ట్ర దేశమున అచ్చటచ్చట స్థాపి

కులు స్థాపించిన గ్రంథాలయములు పెక్కులు గలవు. వీని నన్నిటిని ఏకముఖమునకు దెచ్చి అన్యోన్య సహాయకములుగా చేయుటకై పూనా నగరమున కేంద్ర సంఘము స్థాపింపబడి చక్కగ ఆ ప్రాంతమున ఉద్యమము అభివృద్ధి నొందుచున్నది. మైసూరు, ఇందూరు సంస్థానాధీశులు కూడ తమ రాష్ట్రములయందు ఉద్యమమును చేపట్టి శ్రద్ధతో అభివృద్ధికి తెచ్చుచున్నారు. ఆంధ్ర రాష్ట్రమున 1880 సంవత్సరము ఆ ప్రాంతమున ఈ యుద్యమమునకు విత్తుగా నాటబడి తదాది ఈ యుద్యమము కొలదిగనో, గొప్పగనో కృషి సేయుచు ఇప్పటికి కొంతవరకు తృప్తికరమగు యభివృద్ధిని గాంచినదని చెప్పవచ్చును. అప్పుడప్పుడు జరిగెడి మండల, తాలూకా, రాష్ట్రీయ సభల మూలమున ఉద్యమమున కృషిచేయు వారు ఏకత్ర సమావేశమై ఉద్యమాభివృద్ధి మార్గముల నన్వేషించి కార్యాచరణకు తెచ్చుచున్నారు. ఇతర దేశములలో ఈ ఉద్యమమును గూర్చి జరుగుచున్న కృషినిగూర్చి ముచ్చటించ వలసినపుడు ఇందగ్రస్థానము వహించిన అమెరికా ఖండమున జరుగు పనినిగూర్చి ముందు ప్రశంసించవలసియున్నది. ఈ యుద్యమమున కృషిచేయు వారచ్చటచ్చట తఱచు సభలను జరిపి ఉద్యమనిర్వహణ విధానమును నిర్ణయించి కార్యాచరణకు తెచ్చుచుందురు. ఈ ఉద్యమనిర్వహణమందు పాండిత్యము వహించిన విద్వాంసులు ఇందునుగూర్చి సర్వతోముఖమగు వ్యాసములను వార్తాపత్రికలయందు ప్రచురింతురు. విద్యార్థులు విలాసముకొఱకు సెలవుదినములలో ప్రయాణములకు వెళ్లినపుడు వారలతో గ్రంథాలయములనుండి విద్యాధికులు పంపబడుదురు. వీరు విద్యార్థులు విశ్రాంతిని పొందుకాలమున వారలవద్దకుపోయి విద్యార్థులు గ్రహించెడి విషయములను గూర్చి వారలకుపన్యసించి, ఉపన్యాసాంతమున తా ముపన్యసించిన విషయమును గూర్చి విపులముగా వివరింపబడిన గ్రంథనామములను పేర్కొని ఆ గ్రంథములను తమను పంపిన గ్రంథాలయమున దొరకునని చెప్పుదురు. గ్రంథాలయములకు విరివిగా ప్రజల నాకర్షించుటకు ఎక్కువ సభ్యులుగల 'క్లబ్బులు' ఉపయోగించుకొనుటకు గ్రంథాలయమందలి ప్రత్యేకపు గదులు ఆ క్లబ్బుల యధీనముచేసి అచ్చట ఆ సభ్యులను సమా

వేశపరచుచుందురు. కర్మాగారములయందు పనిచేయు పాటకపు జనుల యుపయోగముకొఱకు వారు పనిచేయుచోట్ల పెద్ద బల్లలమీద వారి కుపయోగించు గ్రంథ నామములును, అవి దొరకు గ్రంథాలయముల పేర్లును లిఖించి ప్రచురింపబడును. పల్లెటూరి ప్రజల యుపయోగము కొఱకు మోటారుబండిలో గ్రంథముల పెట్టెలనుంచి దేశమంతటను పంపబడి ప్రజలకు పంచిపెట్టి వారలా గ్రంథములు చదివిన పిదప తిరిగి వానిని స్వీకరించి తెచ్చుట కేర్పాట్లు చేయబడును. విద్యార్థులకును, ఉపాధ్యాయులకును నుపకరించు గ్రంథముల నొకపెట్టెలో పెట్టి గ్రంథాలయములనుండి యుద్యోగులు పాఠశాలలకు తీసికొనిపోయి అచ్చట ముఖ్యమగు ఉపాధ్యాయుల పరముచేయుదురు. అచటి విద్యార్థులును, ఉపాధ్యాయులును ఆగ్రంథములనుండి పొందదగిన లాభమును పొందిన పిదప తిరిగి వానిని తెచ్చెదరు. పాటకపు జనులు నివసించు కుటీరములకు గ్రంథాలయోద్యోగులు గ్రంథములను పెట్టెలలోపెట్టి తీసుకొనివెళ్లి అచ్చటచదువగల వారలకు గ్రంథములను పంచిపెట్టెదరు. నిరక్షరకుక్షుల యుపయోగము కొరకు వారు గ్రంథములను అప్పుడప్పుడు చదువుచు కూడ యుందురు.

గ్రంథాలయముల కృషినిగూర్చి తెలిసినవారిలో అమెరికా ఖండవాసియు, మిక్కిలి ధనసంపన్నుడునగు కార్నీజీ మహాశయునిగూర్చి తెలియనివారుండరు. ఈ శ్రీమంతుడు తన యపారమగు ధనమును తన తోడి మనుజుల జ్ఞానాభివృద్ధికొరకై యసంఖ్యాకములగు గ్రంథాలయములను స్థాపించి కీర్తివహించెను. ఈమహనీయుడు ఆంగ్లేయ ద్వీపములయందు ఈ మహదుద్యమమును వ్యాప్తినొందించుటకు ఎక్కువ ద్రవ్యమును నిధిగానేర్పరచి దాని పరిపాలనకొఱకు ధర్మకర్తల సంఘమును నిర్మాణముచేసి వారల మూలమున గ్రంథాలయ ప్రతిష్ఠాపనా స్థాపనకు పూనకమున్ను ఆదేశమందీయుద్యమము అంతవ్యాప్తికి రాలేదనియే చెప్పవలసియున్నది. ఇప్పుడాదేశములయందు ఈ ధర్మనిధిమూలమున జరుగుచున్న కృషియు, తన్మూలమున ప్రజలు పొందుచున్న అమూల్యమగు జ్ఞానాభివృద్ధియు వర్ణనాతీతము. ముఖ్యపట్టణముల యందలి గ్రంథా

లయ భవనముల నిర్మాణముకొఱకు అమితముగ ద్రవ్యము వ్యయపెట్ట బడుచున్నది. ఆ ప్రతిష్ఠాపనల నిర్వహించుటకుగూడ ఎక్కువ ద్రవ్యము ఈ నిధినుండి ధర్మము చేయబడుచున్నది. కేంద్రగ్రంథాలయములను స్థాపించి తన్మూలమున పల్లెటూళ్లకు విరివిగా గ్రంథములను పంపుట కేర్పాట్లు చేయబడుచున్నవి. పల్లెటూళ్లలో జరుగు సంగీత సభలకును, నాట్యరంగములకును ఈ నిధినుండి సహాయము చేయబడుచున్నది. అంధుల విద్యాభివృద్ధికొరకు వీరు పాటుపడుచున్నారు. శిశు సంరక్షణ కొఱకు కూడ మిక్కిలి కృషిచేయుచున్నారు. ఈడుముదిరినవారి విద్యాభివృద్ధికొఱకు ఈనిధిపరిపాలకులు ప్రత్యేక ప్రయత్నములు చేయుచున్నారు. ఈపనులన్నియు తాలూకాలయందును, జిల్లాలయందును ప్రజాసేవ చేయుటకొరకై ఏర్పడియుండు ఐచ్ఛిక సంఘములు చేయుసూచనల ననుసరించి జరుగుచుండును. విద్యార్థుల గ్రంథాలయములకును, పట్టణ గ్రంథాలయములకును, పల్లెటూరి గ్రంథాలయములకును కూడ నిధినుండి విరివిగా సహాయము చేయబడుచుండును. సంగీత నాట్యశాస్త్రములనుగూర్చిన గ్రంథములను వీరు ప్రచురించెదరు. ఈ అన్ని యుద్యమముల కొరకును కార్నిజీ ధర్మనిధినుండి ధర్మముగా ఖర్చుచేయబడుచున్న సొమ్ము ఇంతయని చెప్పుటకు నలవికాదు. బెల్జియము అను చిన్ని దేశమున అర్ధణా పోష్టుఖర్చు పంపినచో ఆదేశమందలి ఏ యుత్తమ గ్రంథాలయమునుండియైనను ఎట్టి యుద్గ్రంథమునైనను ఏకుగ్రామమునకైనను తెప్పించుకొనవచ్చును.

ఇంతవరకును మనదేశమునందును, ఇతరదేశములయందును గ్రంథాలయము పక్షమున జరుగుచున్న కృషినిగూర్చి వివరించబడినది. ఈ యుద్యమమునుగూర్చి సామాన్య విషయములను కొన్నిటిని గమనించి వెంటనే యవలంబించ వలసిన కార్యవిధానము నిరూపించ వలసియున్నది. ధర్మగ్రంథాలయోద్యమ మననేమి? దీని పరమ ప్రాప్య మెద్ది? దీని వ్యాప్తి ఎంతవరకు? గ్రంథాలయమన పుస్తకములు భద్రపరచు స్థానమనియు, గ్రంథ భాండాగారియన పుస్తకముల కాపరియనియు పూర్వపు అభిప్రాయములు ఆధునిక కాలమున సంపూర్ణముగా

మారినవి. పురాతన గ్రంథాలయములును దొరతనమువారిచే నిర్వహింప బడుచున్న పెద్దగ్రంథాలయములును ఈ మర్యాదనే యిప్పటికిని యనుస రించుచున్నవి. పాశ్చాత్య గ్రంథాలయములును, బరోడా సంస్థానపు గ్రంథాలయములును ఇట్టివి కావు. గ్రంథాలయము నిజముగా ప్రజా సామాన్యపు విశ్వవిద్యాలయము. జాతి మత వృత్తి వయో విద్యా విష యిక భేదము లేకుండ ప్రతివ్యక్తి యందును నిగూఢమైయున్న అనంత శక్తులను ప్రవృద్ధి పరచు పరమ సాధనమీ ప్రతిష్ఠాపనమై వెలయు చున్నది. కావున ఈ నిర్మాణము మూలమున అభివృద్ధి బొందవలసిన వారు వేరు వేరు అభిరుచులు కలవారును వేరు వేరు అంతరములు కల వారును నైయుండుటచే ఎవరికితగినసాధనము వారల కనువగు నట్లువలం బించి కార్య సాఫల్యము చెందవలసియున్నది. ఇతర దేశములందు ఈ యుద్యమమువెట్లు కృషిచేయుచున్నదియు ఇదివరకు వివరింపబడినది. మనదేశమున కనువగు కార్యావిధానమేదియో ఇదివర కనేకమార్లు ఉపన్యాసముల మూలమునను వార్తాపత్రికల మూలమునను విశదీకరించ బడినది. ఈ యుద్యమ కార్యవిధానము మనదేశమందును ఇతర దేశము లందును ఎట్లు జరుగుచున్నదియుకూడ వివరింపబడినది. ఈ పుదుకోట గ్రంథాలయ వార్షిక సభలో సమావేశమైన ప్రతినిధులు సంస్థాన పరిస్థి తుల కనుకూలమగు కార్యవిధానమును ఈ సభలో నిర్ణయించ సమకట్టి యున్నారు. కావున అందునుగూర్చి ముందుగా చర్చించుట యుచి తముకాదు. "మనసుండవలెనుగాని మార్గము దొరకకపోదు." అని ఆంగ్ల సామెత యొకటికలదు. కావున మనము ముఖ్యముగా కోరవలసినది కార్యదీక్ష. అట్టి కార్యదీక్ష సంపాదించినచో కార్యవిధానము దానంత టది వ్యక్తమగును. కావున మనయుద్యమ ప్రచారణచేయు దీక్షాపరు లనుగూర్చి వివరించుట ముఖ్యావశ్యకము.

ఈ విషయమును గూర్చి చర్చించునపుడు ముఖ్యముగా మనము గమనింపవలసిన విషయ మేదియన ప్రభుత్వమువారు ఈ యుద్యమమును గూర్చి ఎంత శ్రమతీసుకొని, ఎంత ధనము వ్యయము చేసినను ఐచ్ఛిక సంఘములే ఇందును గూర్చి కృషిచేయవలసినవై యున్నవి. ప్రజా

స్వామిక తత్వము ప్రతి నరమందును, రక్తనాళమందునుకూడ నిండి నిబిడీకృతమైయున్న పాశ్చాత్య దేశములయందుకూడ ఈ తత్వ మాచరణలో నున్నది. ప్రభుత్వము ఇట్టి యుద్యమమును చేపట్టి నడిపినయెడల అది నిర్జీవమగును. ప్రతి వ్యక్తికిని, ప్రతి ప్రతిష్ఠాపనమునకును విలక్షణమగు వ్యక్తిత్వమున కనురూపమగు భేదభావ ముండినగాని ఏ వ్యక్తిగాని, ఏ ప్రతిష్ఠాపనగాని సంపూర్ణ వికాసము చెందనేరవు. ప్రభుత్వమువారు నడుపు యుద్యమములలో ఈ భేదభావమునకు తావుండదు. వారమలులోకి తెచ్చు శాసనములు, ఉత్తరువులు అన్ని ప్రతిష్ఠాపనలను ఐక్యభావమునకు తెచ్చి అభివృద్ధి సాధనములను నశింపజేయును. సనాతనమగు భారతీయ ప్రతిష్ఠాపనల చరిత్రము మనము పరిశీలించినచో ఈ తత్వము బోధపడగలదు. ప్రజల జీవిత మా కాలమున అన్యోన్య సంబంధ మంతగాలేని రెండు భాగములుగా విభజింపబడియున్నది. ఒకటి ప్రభుత్వమువారి యధీనమున నుండెడిది. రెండవది కేవలసంఘ సమిష్టి యొక్క యధీనమున నుండెడిది. ప్రజా వికాసమున కవష్టంభకములగు యుద్యమములన్నియు ఈ రెండవ తరగతిలో చేరినవే. ఇందువలననే పూర్వకాలమునుండి మన దేశమున జరుగు దానధర్మములన్నియు ప్రజాభివృద్ధికొరకై సద్వినియోగములై ప్రజా సమిష్టికి జవసత్వము నొసగుచుండెను. మన యుద్యమముయొక్క పరమ ప్రాప్యము మానవ మానస వికాసమని చెప్పవలసియున్నది. మనుజు లెందరున్నారో వారి స్వభావములుకూడ అన్ని యున్నవని చెప్పవలెను. వీని నన్నిటిని అభివృద్ధి నొందించు సాధనములుకూడ అంత అసంఖ్యాకములని చెప్పిన యతిశయోక్తి కానేరదు. మానవ వికాసమున కవసరమగు ప్రతిష్ఠాపనలను స్థాపించి నడుపవలసివచ్చినపుడు ప్రభుత్వ ప్రతిష్ఠాపనలకు సహజలక్షణమగు నియమబద్ధమైన సంపూర్ణైక్య స్వభావమునకు వానియందు తావీయగూడదు. ఇందువలన ప్రభుత్వమునుండి గ్రంథాలయములు సొమ్మును గైకొనగూడదని చెప్పుటలేదు. ప్రభుత్వమువారు ఈ యుద్యమమునకు తగు సహాయముచేసి తామిచ్చు ద్రవ్యము సద్వినియోగ

మగునట్లు తగు కట్టుదిట్టములు చేయుట మిగుల యావశ్యకము. కావున ఈ యుద్యమము జయప్రదమగుటకు ముఖ్యసాధనము కార్యదీక్షాపరులు. వీరు ఈ యుద్యమమున గట్టి నమ్మకము కలవారై సన్మార్గమున దీనిని నడిపి తన్మూలమున దేశోద్ధరణ చేయుటకు బద్ధకంకణులైనవారుగా నుండవలెను. పుణ్యభూమియగు ఈ భరతవర్షమున అనాదినుండియు మానవజీవిత మంతయు బ్రహ్మార్పణము చేయవలసిన నిబంధన యుండి యున్నది. కావున ఆత్మసమర్పణముయొక్క యావశ్యకతను గూర్చియు, అందలి ఫలమును గూర్చియు భారతీయులకు నొక్కి తిరిగి చెప్పుట యనావశ్యకము. మన దేశ చరిత్రమును పరికించి చూడుడు. ఎంత ఆత్మ సమర్పణ! ఎంత కార్యదీక్ష! ఎంత సేవాపరతంత్రము! ఎంత ఆత్మ శక్తిని మన పూర్వుల జీవితములు మనకు బోధించుచున్నవి. మన భారతజనని అన్ని విధములను దైన్యస్థితిని చెంది గగ్గోలుగా ఆర్తనాదము చేయుచున్న ఈ యాతురసమయమున మన విధులను మనము గుర్తెరిగి మన మాతృఋణము తీర్చి ధన్యులము కాజనదా!

ఆత్మసమర్పణము ప్రత్యక్షావతారము దాల్చెనో యన వెలసిన మహాత్మా గాంధి మన దేశమునంతను తేజఃపుంజముగా ముందుండి నడుపుచుండగను, మహాకవి రవీంద్రుడు దేశ దేశాంతరములకును, ఖండ ఖండాంతరములకును జని అచ్చట శాశ్వత శాంతిని నెలకొల్పుటకు విశ్వ ప్రయత్నములు జరుపుచుండగను, అరవిందుడు పుదుచ్చేరి నగరమున ఘోరతప మాచరించుచు విశ్వమానవజాతికి సంపూర్ణముగ సేవచేయు శక్తులను సముపార్జించుచుండగను సేవాపరత్వము ఆధునిక భారతీయులకు సక్రమముగ బోధపడకుండుటకు తావున్నదా? భారతజాతి ఆధునిక కాలమున చెందుచున్న పునర్నిర్మాణ కార్యవిధానమందు మన ధర్మ గ్రంథాలయోద్యమము ముఖ్యస్థానము నధిష్ఠించియున్నది. సంఘము నందు శాంతిని నెలకొలిపి అన్యోన్య స్పర్థలను నివారణ చేయుటకు ఈ యుద్యమమునకుగల శక్తి అనంతము. మన దేశము నిప్పుడు చీకాకు పరచుచున్న సాంఘిక వైరములన్నియు ఈ యుద్యమమును జయప్రదముగ నిర్వర్తించినచో మాసిపోగలవు. ఈ యుద్యమమువలన

జాతికిని, ప్రత్యేక వ్యక్తికిని కల్గెడి లాభములు కడు మెండు. ఈ యుద్యోమము మనుజుని కేవల వైషయిక వాతావరణమునుండి లేవనెత్తి అనంత కళ్యాణగుణాకరుడును, ప్రేమ సంపూర్ణుండును నగు పరమేశ్వరుని ప్రేమతత్వమును కించిత్కాలమైనను అనుభవమునకు తెచ్చును. మనుజుని జ్ఞానవంతునిగా చేయును. కావున భారతీయులారా! లెండు. నడుము బిగించుడు. మాతృసేవా పరతంత్రులు కండు. అప్పుడు ఈ ఆర్యావర్తమున ధర్మమోక్షములకు వ్యతిరిక్తముకాని అర్థకామములను మన భరతఖండమున పునఃప్రతిష్ఠించినవార మగుదుము. మహాత్మా గాంధీగారు సెలవిచ్చినట్లు మన హృదయ పీఠమున పరమేశ్వరుని పునః సింహాసనాసీనుని చేసినవార మగుదుము,

— గ్రంథాలయ సర్వస్వము, 6 వ సంపుటము 6 వ సంచిక నుండి

# 14 వ కళింగదేశ గ్రంథాలయ మహాసభ, విశాఖపట్టణము

[ 1933 మే 6 ]

శ్రీ పురిపండా అప్పలస్వామి
శ్రీ చేబ్రోలు సూరన్న

**స్వాగతోపన్యాసము**

గ్రంథాలయోద్యమము ఆంధ్రదేశంలో 1914 వ సంవత్సరంలో ప్రారంభమైనది. అన్ని ఉద్యమాలలో వలెనే ఈ ఉద్యమంలో కూడ కళింగదేశం తన భాగాన్ని స్వీకరించింది.

గ్రంథాలయ మహాసభ ఏర్పడడమునకు పూర్వమే 1886 వ సంవత్సరములో మావిశాఖపట్టణములో "సరస్వతీ నిలయము" అనే గ్రంథాలయం ఉండేది. ఆనాడు దీనిని శ్రీమంతిన ఆదినారాయణమూర్తి గారు సార్వజనీన గ్రంథాలయంగా స్థాపించినారు. ఆంధ్రదేశంలో ఇదే మొట్టమొదటి గ్రంథాలయం. 1914లో ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ బెజవాడలో జరిగినది. రెండవది రాజమహేంద్రవరంలోను, మూడవది నెల్లూరులోను జరిగినవి. 4, 5 సభలు కళింగదేశముననే జరిగినవి. 4 వ ది గంజాంజిల్లా బారువలోను, 5 వ ది విశాఖపట్టణములోను జరిగినవి. అప్పటినుండి ఈఉద్యమం కళింగదేశంలో సాగుతూనే ఉంది.

మనకళింగదేశములో 1926 వ సం॥ లెక్కప్రకారము 120 గ్రంథాలయాలున్నవి. ఈలెక్కలో చేరనివి యింకా ఉండవచ్చును. శ్రీయుత తిత్తి బలరామయ్యగారి కృషిఫలితముగా గంజాంమండలంలో ఈ ఉద్యమం అభివృద్ధికరముగా సాగుతున్నది. ఈ నాడీసభ జరగడమునకు కూడ చాలవరకు ఆయనయే కారకులు. ఆంధ్రదేశప్రథమ గ్రంథాలయ ప్రదర్శనము మన కళింగదేశముననే బారువలో వీరు జరిపినారు. ఆంధ్రదేశానికి అయ్యంకి వెంకటరమణయ్య గారిని, కళింగ

దేశానికి బలరామయ్యగారిని ఈఉద్యమానికి జీవగర్రలని పేర్కొంటే అతిశయోక్తికాదు.

ఈసభ లింతకుపూర్వం బరంపురం, బారువ, ఛత్రపురం, హీర మండలం, కళింగపట్నం, వారణాసి, సోంపేట, విశాఖపట్నం, విజయ నగరం, సాలూరు, ములగపాక, కసింకోట, పార్వతీపురం మొదలైన స్థలాల్లో జరిగినవి. 1929 వ సంవత్సరములో ఈసభ భారతీతీర్థమునకు అంగముగ చేరినది. ఈదినం తిరిగి యిక్కడ జరుగుతూ ఉన్నందుకు సంతోషంగాఉన్నది.

ఇది కళింగదేశ గ్రంథాలయసభ పూర్వచరిత్ర. పూర్వచరిత్ర ఏలాంటిదైనా మనకు పూజింప తగ్గదే. ఇక భవిష్యచ్చరిత్ర ఉజ్జ్వలంగా ఉండాలంటే అదిమన కృషిమీద ఆధారపడి ఉంటుంది. నిజానికి మన గ్రంథాలయాలు సరియైన ఉన్నత స్థితిలోలేవు. మనంచేయవలసినపని ప్రతిశాఖలోవలెనే యిందులోనూ ఎంతోవున్నది.

గ్రంథాలయం అభివృద్ధి దానిని నడిపేవిధానాన్ని బట్టివుంటుంది. గ్రంథాలయ కార్యదర్శులకు గ్రంథముల నెట్లుంచవలెనో, గ్రంథవిభ జనము నెట్లు చేయవలెనో, గ్రంథాలయాన్ని ఏలాగు నడుపవలెనో నేర్పడం అవసరం. ఈపనికి ఆంధ్రదేశగ్రంథాలయ సంఘంవారు పూనుకో వలసివుంటుంది.

కేవలం అస్వాభావికమయిన నవలలతో గ్రంథాలయాన్ని నింపక విజ్ఞానప్రదమయిన గ్రంథాలు, కళోజ్జీవనకరమయిన గ్రంథాలుకూడ చేర్చాలి. గ్రంథాలయాధికారులు వ్యావహారిక గ్రాంథిక వాదాలుగాని, భావికవిత్వం అభావకవిత్వం వాదాలుగాని మనస్సుల్లో ఉంచుకొని గ్రంథాలు చేర్చకూడదు. ఆధునిక గ్రంథాలు లేకపోవడం ఒకలోపంగానే భావించాలి.

మంచిగ్రంథాలమీద అభిరుచి కలిగించేబాధ్యత గ్రంథాలయ కార్యదర్శిది. మంచిక్రొత్త గ్రంథం ప్రకటనకాగానే దానిని తెప్పించి అందులోని విషయప్రాముఖ్యాన్ని సభ్యులకు తెలపడం ఉత్తమం. అందు కనే ఉపజ్ఞకలవాడే గ్రంథాలయ కార్యదర్శిగా ఉండాలి.

బాగా అట్టకట్టు ఉన్న నవలలు మాత్రం ఉంచి తాళపత్ర గ్రంథాలు పారవేస్తున్న గ్రంథాలయాలు నాకు తెలుసు. అలాగు కాకుండా వాటి ప్రాముఖ్యాన్ని గుర్తించి భద్రపరచాలి.

స్త్రీలుకూడ ఈ ఉద్యమంలో చేరి గ్రంథాలయాలు స్థాపించే అవకాశం కలిగించాలి. మా మండలంలో గొలజాం గ్రామంలో శ్రీమతి తూర్పాటి సన్యాసమ్మగారు చాలా కాలంనుండి ఒక గ్రంథాలయాన్ని స్థాపించి పనిచేస్తున్నారు.

గ్రంథాలయాల్లో ఆటపాటలకు ప్రాముఖ్యము తగ్గించడం అవసరము. ఈ ఆటలవల్ల చాలచోట్ల చదువుకోవడమునకు అంతరాయం గానే ఉన్నది.

ప్రతి పెద్ద గ్రామంలోను పాఠశాల లుంటవి. ఆ పాఠశాలల గ్రంథాలయాలనుకూడ మన ఉద్యమంలో చేర్చడం ఉత్తమం. ఆ మూలముగా తాలూకా బోర్డుల సహాయంకూడ సంపాదింపవచ్చును. మన ఉద్యమాన్ని ఆదరించి ఆర్థికముగా సహాయపడవలెనని వారిని కోరవలెను.

కళింగదేశ గ్రంథాలయ చరిత్ర ప్రకటించడము, సంచార గ్రంథాలయా లేర్పరచడము, తాలూకా గ్రంథాలయ సభలు, ప్రదర్శనాలు జరపడము, వీలయ్యేచోట్ల బాలశాఖ లేర్పరచడము చాల అవసరము.

—— పురిపండా అప్పలసామి

**అధ్యక్షోపన్యాసము**

ఒక దేశముయొక్క భావిభాగ్యము, ఔన్నత్యము ఆ దేశమునందలి విద్యాకోవిదులపై ఆధారపడియుండును. మన హిందూదేశములో చదువను, వ్రాయను నేర్చినవారి సంఖ్య యితర దేశములకంటె చాల తక్కువ. ప్రస్తుత గ్రంథాలయోద్యమములోని ముఖ్యోద్దేశము అట్టి విద్యాధికులను వృద్ధిచేయుటకేయని నా నమ్మకము.

అయితే గ్రంథాలయము స్థాపించినంత మాత్రమున ప్రయోజనము లేదు. ప్రజలలో విద్యాప్రబోధము లేనిదే ప్రయోజనము లేదు. పల్లెలలో విద్యాప్రబోధము చేయవలెను. ప్రౌఢజన విద్యా సంఘములు

స్థాపింపవలెను. అంతేకాని విద్యాగంధము లేనిచోట్ల గ్రంథాలయములు స్థాపించుటవలన ప్రయోజనము లేదు. చాల గ్రంథాలయములలో పుస్తకముల సంఖ్య పరికింతురేగాని గుణమును లెక్కింపరు. గ్రంథాలయమున ఒక గ్రంథమును చేర్చుచున్నామన్న ఒక విజ్ఞాన భాగమున గల లోపమును పూర్తిచేయుచున్నామని జ్ఞాపక ముంచుకొనవలసి యున్నది.

గ్రంథాలయములలో ఎవరునూ చదువని పుస్తకములుండి ప్రయోజనము లేదు. విశ్వజనీన గ్రంథాలయములు, పట్టణ గ్రంథాలయము,లు పల్లె గ్రంథాలయములని గ్రంథాలయములు మూడు తెరగులు. ఆయాగ్రంథాలయములలో చేర్చవలసినగ్రంథములు ఆయా వానికి తగియుండవలెను. గ్రామస్థులకు తగిన గ్రంథాలయములు తెప్పించుటకు గ్రంథాలయాధికారి పరిశ్రమ చేయవలెను. వారి అభిరుచుల గమనింపవలెను.

ప్రతి గ్రంథాలయమునకును చేరి పఠనమందిరము, ప్రదర్శనశాల అవసరముగా ఉండవలెను. ఈనాడు మనము హిందీ, ఆంగ్ల గ్రంథములు కూడ తగుపాటి చేర్చవలెను. గ్రంథాలయాధికారులు గ్రంథ పఠనము కూడ నేర్పవలెను.

— చేబ్రోలు సూరన్న

—1934 జూన్ నెలలోని ఆంధ్ర దినపత్రికనుండి

# 16 వ కళింగదేశ గ్రంథాలయ మహాసభ, బారువ

[ 1934 జూన్ 5 ]

## శ్రీ భూపతిరాజు సీతారామరాజు

**గ్రంథాలయోద్యమము**

గ్రంథాలయోద్యమము మన దేశములోనేగాక యితర దేశములలోకూడ వర్తమానకాల ప్రయత్నమై యున్నది. నాగరికతగల దేశము లన్నిటిలోను ఈ యుద్యమము శీఘ్రకాలములోనే వృద్ధి గాంచెను. ఇతర దేశములలో ప్రభుత్వ సహాయము కలదు. మన దేశములో నంతగా సహాయము లభ్యముగాక దేశసేవకులయందే విశేష ముగా ఆధారపడియున్నది. బ్రిటిషు పాలనక్రింద నున్న మన రాజధాను లలో యీ యుద్యమము మన ఆంధ్రదేశములో వృద్ధిగాంచుచున్నది. అయితే మనదేశములో గ్రంథాలయోద్యమమన గ్రంథసేవగానే భావింప బడుచున్నదిగాని విజ్ఞానోపార్జన వ్యాపనముగా భావింపబడుటలేదు.

గ్రంథాలయోద్యమమన కేవలము గ్రంథములను సంపాదించి గ్రంథాలయములను స్థాపించి చదువునేర్చినవారలకు గ్రంథసేవ చేయు టయే గాక జనసామాన్యమైన ప్రజల కెల్లరకును స్త్రీపురుష తారతమ్య మెంచక విజ్ఞానోదయము కలుగజేయు వ్యాపనముగా ననేక దేశీయులు గ్రహించి యీ యుద్యమమును విజ్ఞానోపార్జన వ్యాపనముగా భావించి పనిచేయుచున్నారు.

గ్రంథాలయోద్యమముయొక్క భావముకూడ విజ్ఞానోపార్జన వ్యాపనముగా నుండవలయును గనుక మనము ఈ యుద్యమమును విజ్ఞానోపార్జన వ్యాపనముగానే భావింపవలయును.

**విజ్ఞానోపార్జన వ్యాపనము**

విజ్ఞానోదయమునకును, విద్యాభివృద్ధికిని ప్రజలెల్లరు పాత్రులై యుండవలయుననియు, యీ ప్రయత్నములకు స్త్రీ పురుష విచక్షణగాని, జాతిమత భేదములుగాని లేవనియు తెలిసికొనవలయును.

దేశములో గల ప్రతి పురుషునియందు ప్రతి స్త్రీ యందును కొద్దియో, గొప్పయో విలువకలదుగాని లేకపోవుటలేదు. ఈ విలువ దేశముయొక్క ఆర్థిక విలువలో భాగమైయున్నది. కనుకనే దేశము యొక్క ఆర్థిక స్థితి లెక్కించునపుడు ఆ దేశములోగలవా రందరు ఆ దేశమునకు ఐవజనియు, కృషి వాణిజ్యసంబంధమైన సంగ్రామములో నట్టి ప్రతి మానవుడు నొక బంటనియు, వాని సత్తువమీదనే దేశము యొక్క సత్తువ ఆధారపడియున్నదనియు, కనుక అట్టి ప్రతి మానవుడు విజ్ఞానవంతుడై యుండుట దేశము వృద్ధిగాంచుటకు ముఖ్యావసర మనియు నాగరికత గల దేశములన్నియు తెలిసికొని ప్రజలందరు విజ్ఞాన వంతులుగా నుండుటకుగాను తీవ్రమైన ప్రయత్నములు చేయుచున్నారు.

ఈ ప్రయత్నములు ఆ దేశములలో కూడ నూతన ప్రయత్నములే అయినను స్వల్పకాలములోనే యింత బాహుళ్యప్రయత్నము కూడ వృద్ధిగాంచుచున్నది. దేశము వృద్ధిగాంచవలెనన్న ఈ ప్రయత్నమే ముఖ్యమని భావించిరి. రష్యను గాంధి అనతగ్గ లెనిను చెప్పినట్లుగా ప్రజ లందరు విజ్ఞానవంతులుగా నుంటనియెడల దేశముయొక్క ఆర్థికస్థితిగతులు వృద్ధిపొందుటగాని రాజకీయప్రయత్నములు కొనసాగి ఉపయోగపడుట గాని దుర్లభము.

మనదేశములో చదువు నేర్చినవారు స్వల్పసంఖ్యాకులు. స్త్రీపురుషులలో అక్షరాస్యులు నూటికి ౯ గురును, నిరక్షరాస్యులు ౯౫ గురును మనదేశమందు గలరు. ఈ స్వల్పసంఖ్యగల అక్షరాస్యులలోకూడ అనేకులు తాము నేర్చిన స్వల్పవిద్య వృద్ధిపొందుటకు అవకాశములు కలుగక చివరకు నిరక్షరాస్యుని అవస్థయే పొందుచున్నారు. మనపల్లె గ్రామాదులలో గల చదువునేర్చిన వారలకే యీ అవస్థ సంభవించు చుండగా, చదువునేర్వని, కోట్లకొలదిగనున్న ప్రజల యవస్థ చెప్పనేల? ఈ విశేషసంఖ్యాకులగు ప్రజలలో సుమారు నూటికి 80 మంది వ్యవసాయము వలన జీవించువారు. వీరు పేదలై అజ్ఞానులుగా నున్నారు. అక్షరాస్యులు గారు. నిరక్షరాస్యులై యున్నవారు. గ్రంథములు వారికి ఉపయోగ

పడునవి కావు. కేవలము గ్రంథసేవయే తలపెట్టిన అట్టివ్యాపనము వీర లకు ప్రయోజనములేదు. ఆవ్యాపనము స్వల్పసంఖ్యాకులగు ప్రజలకే ఉప యోగపడి విశేషసంఖ్యాకులై అజ్ఞానాంధకారములో మునిగియున్న మనపల్లెలలోని ప్రజలకుపయోగపడదు. మనదేశపు ఆర్థికస్థితి యీ యజ్ఞానులైన వ్యవసాయదారునిమీదనే ఆధారపడియున్నది. వీరందరును విజ్ఞానవంతులు కానియెడల, వీరి ఆర్థిక స్థితిగతులు వృద్ధిపొందవు సరే కదా, వీరినిఆధారముచేసుకొనియున్న దేశముయొక్క ఆర్థికస్థితిగతులును వృద్ధిగాంచవు. క్రమమైన సహకారము వీరివలన పొందజాలక రాజకీయ పురుషప్రయత్నములు నిష్ఫలమగును. కనుక వీరి కెల్లరకును ఉపయోగ పడుమార్గముననే మనప్రయత్నము లుండవలయును.

జనసామాన్యమైన ప్రజలకెల్లరకును ఉపయోగపడు విజ్ఞానోద యము కలుగజేయు ప్రయత్నములు కూడదనువారు లేరు. కాని విశేష వ్యయ ప్రయాసములు పడినగాని యింతబాహుళ్యముగా యీఘనకా ర్యము కొనసాగదు. దేశసేవకులు యెంత ఉత్సాహముతో పనిచేయ బూనినను, ప్రభుత్వ సహాయమును, స్థానికసంఘముల సానుభూతియును అత్యావశ్యకము.

ఇందు విషయమై మనదేశపరిస్థితులతో సరిపోలు నితరదేశము లలో జరుగుచున్న ప్రయత్నములే మన కుపయోగపడవలెను. మనదేశమువలె విశేషసంఖ్యాకులగు వ్యవసాయదారులు కలిగి, పేదలుగాను అజ్ఞానులుగా నుండిన జనులకు విజ్ఞాన ప్రాప్తిచేయు ప్రయత్నములె మన కవసరపడును.

రష్యాదేశములో జరుగుచున్నకృషి

ఈ విజ్ఞానోపార్జన వ్యాపనము, మన కన్నివిధముల ఉపయోగ పడుమార్గమున రష్యాదేశములో జరుగుచున్నది. ఆ దేశము మనదేశము కంటె విస్తీర్ణము కలది. మనదేశమువలె పేదదేశము. మనదేశమువలె నూటికి 80 మంది అజ్ఞానాంధకారములో మునిగియున్న వ్యవసాయ దారులు గల దేశము. మూఢభక్తి, అనాగరికతగల ప్రజలతో నిండి యున్న దేశము. ఇంతవిస్తీర్ణముగల దేశమంతటను, ఇట్టిప్రజల కందరకు,

ఈ విజ్ఞానోపార్జన వ్యాపనముమూలమున స్వల్పకాలములోనే జ్ఞానాభి వృద్ధి విద్యాభివృద్ధి కలుగుచు వారిస్థితిగతులు వృద్ధిపొందుచున్నవి.

అంతవిస్తీర్ణము గల దేశములోను అంతటను విజ్ఞాన కోశములు, గ్రామ గ్రంథాలయములు, విజ్ఞానవ్యాప్తిని జేయు కేంద్రస్థానములు స్థాపింపబడెను. అందుబాటుకాని స్థలములలో నున్న వారికైనను ప్రచారసేవ జేసి వారికి కూడ ఉపయోగపడు మార్గములు వెదకి విజ్ఞానాభి వృద్ధి కలుగజేయుటకలదు. కేంద్రస్థానముల కృషిమూలమున విద్యాభి వృద్ధి, అనేక విధములుగా విజ్ఞానోదయము జరుగుచున్నవి. ప్రచారక గ్రంథకోశముల మూలమున గ్రంథసేవ చేయుటయేగాక, చదువురాని వారికి ప్రకటనల మూలమున, ఆటలు, నాటకములాడి ప్రదర్శనముల మూలమున వారి కుపయోగపడు అన్ని విషయములలోను జ్ఞానాభివృద్ధి కలుగజేయుట గలదు.

చిత్రపటముల మూలమున, ప్రకటన పత్రముల మూలమున, పదర్శనముల మూలమున వ్యవసాయమున కుపయోగపడు పనిముట్లు, యంత్రములాది వస్తువులయందుగల ఉపయోగములు తెలుపుటయు, వ్యవసాయదారున కుపయోగపడు అంశములగూర్చి నూతన మార్గములు, అందుగల లాభములు తెలియజేయుటయు, ధరవరలు మొదలుగాగల అంశములగూర్చియు, పంట విక్రయించు మార్గములగూర్చియు, యింకను వ్యవసాయదారుని కుపయోగపడు విషయము లన్నిటిగూర్చియు ఈ సేవ చేయుప్రచారకులవలన సదా బోధనలు జరుగుచున్నవి. వ్యవసాయ సంబంధమైన విషయములగూర్చియేగాక, సదావచ్చు రోగములు వాటిని నివారణ జేసికొను విధములు, ఆరోగ్యభాగముగూర్చి నేర్చుకొన వలసిన అంశములగూర్చి కూడ బోధనలు చేయుట కలదు. నీతులు, కథలు, లోకసమాచారము మొదలుగాగల విషయము లందుకూడ భాగవతము, బొమ్మలాటల వంటి ప్రదర్శనముల మూలమున జ్ఞానసంపద కలుగజేయుట కలదు. చదువుకొనుటకు సామర్థ్యము లేకున్నను వినుటకు ఆసక్తిగలవారికి చదివి వినిపించుటయు ఉపన్యాసము లిచ్చుటయు కూడ కలదు.ఈపనులు యావత్తు కృషి కేంద్రస్థానముల

మూలమున సదా జరుగుచున్నవి. ఇన్ని ప్రయత్నములు ఈ యుద్యమమునకు ముఖ్యమని ఆ దేశనాయకులు గ్రహించిరి.

ఇంత బాహుళ్యముగా చేయవలసియున్న యీ ప్రయత్నము ప్రభుత్వ సహాయమును స్థానిక సంఘముల సానుభూతియు గోరియున్నది. మదరాసు శాసనసభలో ప్రవేశపెట్టబడిన చట్టము ఈ ప్రయత్నమంతటికిని ఉపయోగపడునదికాదు. ఇతరదేశములవలె మనప్రభుత్వముకూడ స్వయముగా దఖలు పుచ్చుకొని సహాయము చేయవలసినవిధి వారియందు కలదు. స్థానికసంఘములు ఆదరించినయెడల, ఈ ప్రయత్నములు సులభముగా జరుగుటకు అవకాశము కలుగును. ఆ సహాయములు పొందకున్నంతకాలము దేశభక్తుల మీద ఆధారపడి ప్రయత్నము జరుగవలయును.

ప్రాథమిక విద్యావిషయమై ప్రభుత్వము చేయుచున్న ధనసహాయము, స్థానికసంఘములు చేయుచున్న ప్రయత్నములు ఉపయోగములోనికి వచ్చుటకు ఈ వ్యాపనము ముఖ్యము. బాలునకు ప్రాథమిక విద్య 5 సం॥ కఱపినమాత్రమున ఆ బాలుడు విద్యావంతుడు కాలేడు. తాను నేర్చినవిద్య స్వల్పమగుటచేత, పురోవృద్ధికవకాశములు లేక యీ స్వల్పవిద్య క్రమముగానశించి తాను జీవయాత్ర స్వయముగా చేయుకాలమునకు తాను పాఠశాలలో నేర్చినవిద్య పూర్తిగా నశించి, విద్య నేర్వనివానివలెనె యుండును. కనుక పురోవృద్ధికవకాశము చూపని యీ ప్రాథమికవిద్య ఉపయోగపడక, యిందునుగూర్చి వ్యయపడుచున్న కోట్లకొలది ధనము బూడిదలో పోసిన పన్నీరుతీరున వృథా అవుచున్నది. ఈ అంశము ప్రభుత్వము, స్థానికసంఘములు గ్రహింపకుండుట శోచనీయము.

గ్రంథసేవ

జాతీయాభ్యుదయమునకు తోడ్పడు జనసామాన్యమునకు విజ్ఞానప్రాప్తి విషయమై యీ వరకు చెప్పియుంటిని. గ్రంథసేవ అంత విపులమగు ప్రయత్నము కాకున్నను ఆ ప్రయత్నములో ముఖ్య

భాగము. ప్రస్తుత దేశపరిస్థితులబట్టి కేవలము గ్రంథసేవయే తలపెట్టి పనిచేసినను జాతీయాభ్యుదయమునకు నెంతయో సహాయపడును.

గ్రంథసేవ యింకను మనజిల్లాలలో బాల్యావస్థలోనే యున్నది. ఈ సేవ చేయుచున్న మహనీయులు ఉత్సాహముతో పనిచేయుచుండుట చేత ఈ ఉద్యమము కొంత వృద్ధిలోని కయినను వచ్చెను. ఈ గ్రంథసేవ పండిత పామరులు అభిమానముతో కలసి పనిచేయుటయేగాక గ్రంథసంపాదన విషయమై పామరులకుపయోగపడు గ్రంథములు వ్రాయుటయు అట్టి గ్రంథము లితరభాషలలోనుండి ఆంధ్రీకరించుటయు, పురాతనగ్రంథములు వెలువడజేసి అచ్చొత్తించుటయు, పండితులయొక్క సహాయముచేత, భాషాభివృద్ధిచేయుటయు కలదు. ఈ యుద్యమమునెడల ప్రజల కుగల ఆమోదమునుబట్టి మనఆంధ్రదేశములో స్వల్పకాలములోనే అనేకగ్రంథాలయములు స్థాపింపబడెను. అనేకులు ఈ సేవ చేయబూనిరి. ఇంకను పూనికతో పనిచేయవలసియున్నది.

గ్రంథాలయములు స్థాపించినమాత్రమున, అనేక గ్రంథములు సంపాదించి సమకూర్చినమాత్రమున, ఈ ఉద్యమము నెరవేరుటలేదు. గ్రంథాలయము ఒకటి స్థాపించి అందు వేలకొలది గ్రంథములు పోగుచేసి యుంచినమాత్రమున, ఆ గ్రంథాలయము ఉపయోగపడుచున్నదని చెప్పుటకు వీలులేదు. గ్రంథాలయములోగల పుస్తకము లెన్ని వాడుకలోనికి వచ్చినది, ఎందరుపయోగించుచున్నది అను వానినిబట్టి ఆ గ్రంథాలయము యెంత ఉపయోగములోనికి వచ్చినది తెలియగలదు.

గ్రంథాలయముయొక్క ఉపయోగము ఆ గ్రంథాలయోద్యోగియుని (Librarian) సామర్థ్యముమీద ముఖ్యముగా ఆధారపడి యుండును. ఈతడు విద్యావంతుడు నేర్పరియునై ఈ ఉద్యమమునెడల భక్తివిశ్వాసములుగల సేవకుడై యుండవలయును.

గ్రంథాలయ ముపయోగించుటకు వచ్చువారిని అతిథులవలె సత్కరించి, స్నేహితులవలె ఆదరించి, శిష్యులవలె వారి విజ్ఞానప్రాప్తి కుపయోగపడు గ్రంథములలోని విశేషములు తెలిపి వాటియందు అభిరుచి కలుగచేయు సామర్థ్యముకలవారైయున్న ఆ గ్రంథాలయము క్రమమైన

వాడుకలోనికి వచ్చును. ఈ ఉద్యోగీయులు సదా ప్రజల కుపయోగ పడు గ్రంథములేవో కనిపెట్టి అట్టి గ్రంథములను సంపాదించి ఉంచుటకు గాను సదాపోషకులకు తెలియజేయుచు గ్రంథములను వేరువేరు భాగములుగా ఉంచి కోరినపుస్తకము చప్పున తీసి యిచ్చుటకు అవకాశముండు యేర్పాట్లుచేయుట అవసరము. ఈ నేర్పు పైకి కనబడునంత సులభమైనది కాదు. ఈ విధులగూర్చి ప్రత్యేకముగా ఒక శాస్త్రమే కలదు. ఈ యుద్యమముగూర్చి పాటుపడుచున్నవారు యీ భాగమునందు గల ప్రాముఖ్యత తెలుసుకొని ఈ విషయమై పనిచేయుచున్నారు. గ్రంథాలయోద్యోగీయులు గ్రంథములను భద్రపరచు గుమాస్తాలని మనము ఈ విషయమై ఉపేక్షించిన మనము సంపాదించిన గ్రంథములేవో భద్రముగానే యుండును గాని మనగ్రంథము లుపయోగపడుట అరుదు. మన యుద్యమము వృద్ధిగాంచుట దుర్లభము.

ఈ గ్రంథాలయోద్యమము బ్రిటిషు పాలనక్రిందనున్న రాష్ట్రములలో మన ఆంధ్రదేశములో చాలా ఉత్సాహముగాను పట్టుదలగాను జరుగుచున్నది. సుమారు 1000 గ్రంథాలయములైనను స్థాపింపబడి వ్యాపనము చేయుట మన ఆంధ్రదేశములో కలదు. ప్రప్రథమమున గ్రంథాలయ ఉద్యమము మన ఉత్తర జిల్లాలలో ప్రారంభమాయెను. దీని జన్మస్థానము విశాఖపట్టణము. 1886 సం॥లో మొదటి గ్రంథాలయము విశాఖపట్టణములో స్థాపింపబడెను. ఆంధ్రభోజుడను పేరుపొందిన ఆనందగజపతిమహారాజులుంగారి ఆదరణవలన విజయనగరం విద్యానగరంగామారి ఆంధ్రభాషాభివృద్ధి మొదలుగాగల ప్రయత్నములు కొంతకాలము జరిగి పిమ్మట యితర జిల్లాలలో యీ యుద్యమము వృద్ధిపొందెను. మనజిల్లాలలో ప్రయత్నము వెనుకబడకుండ మన తిత్తి బలరామయ్యగారు అనేక సంవత్సరములనుండి తీవ్రమైన పట్టుదలతో యీ వ్యాపనము చేయుచు, ఆంధ్రదేశములో యీ యుద్యమమునకు జీవనాధారము కలుగజేసిన నాయకులలో ముఖ్యులని ఆంధ్రదేశమంతటను పేరుపొందియున్నారు. ఇంకనూ ఆయన యీ పూనిక విడువకుండ ప్రయత్నము చేయుచున్న కారణమున యీ ఉద్యమము జయప్రదముగా జరుగుటకు

సందిగ్ధము లేదు. తమందరి సానుభూతి ఆయనకు సహాయపడి ఆంధ్రదేశో ద్ధరణమునకు తమందరు తోడ్పడి ఈ ప్రయత్నములన్నియు జయప్రద ముగా జరిగింతురుగాక యని కోరుచు విరమించుచున్నాను.

విజ్ఞానోపార్జన వ్యాపనావశ్యకత

మన దేశములో అజ్ఞానులు విశేష సంఖ్యాకులుగా నున్న కార ణమున యీ విజ్ఞానోపార్జన వ్యాపనము అత్యావశ్యకము. మనము యీ వ్యాపనముచేయ బూనినపుడు పై చెప్పియున్న అన్ని విధములగు ప్రయత్నములు చేయుటకు సిద్ధపడి యుండవలెను. ఇంత బాహుళ్యముగా యీ ప్రయత్నము లన్నియు చేయుటసులభసాధ్యమైన పనికాదు. విశేష వ్యయ ప్రయాసములు పడినగాని యీ ఘనకార్యము నెరవేర జాలదు. కష్టమని మనముపేక్షించి యీ విధముగా ప్రయత్నించని యెడల క్రమమైన వ్యాపనము చేయుటకు మనకు సామర్థ్యము లేదని విచారించ వలసి వచ్చును. ధైర్యము వహించి సాహసించువారికి లోబడనిది లేదు గావున, యెంత శ్రమపడి అయినను యీవిధముగా ప్రయత్నించుట యుక్తము. మనము చక్కగా గ్రహించిన యీ ప్రయత్నములు మనకు తెలియనివి కావు. మన పల్లెగ్రామములలో గల ప్రజలకు, బొమ్మ లాటలు, భాగవతములు, హరికథలు మూలమున జ్ఞానాభివృద్ధి కలుగ జేయుట చిరకాలమునుండి కలదు. ఇట్టి ప్రదర్శనముల యందు ప్రజలకు గల ఆసక్తి, వినోదము, యీమార్గమున వారికి కలుగుచునన్న విజ్ఞా నాభివృద్ధి మనకు తెలిసిన విషయమే కాని యీ ప్రదర్శనము లన్నియు, భక్తిమార్గము ననుసరించి యుండుటంజేసి, తత్సంబంధమైన జ్ఞానోదయ మునకై ఉపయోగ పడుచున్నవిగాని, వాటివలన తదితర అంశముల గూర్చికూడ ప్రయత్నించుట అంతకష్టసాధ్యమైన పని కాదు. మనరాజ ధానిలో ఆరోగ్యశాఖ ఉద్యోగీయులు యీ విధమగు ప్రయత్నములు ఆరోగ్యభాగవిషయమై చేయుచునే యున్నారు.

—1934 జూన్ నెలలోని ఆంధ్ర దినపత్రికనుండి

# తెనాలితాలూకా గ్రంథాలయ ప్రతినిధులసభ, కూచిపూడి

[1920]

శ్రీ ఆరె సుబ్బయ్య *

### గ్రంథాలయమనగనేమి ?

దేవుని ఆలయము దేవాలయమైనటుల గ్రంథసముదాయము యొక్క ఆలయము గ్రంథాలయము. ఈ ఆలయములో శారదాంబ గ్రంథముల రూపమున వెలసియుండును. దేవాలయములోని దేవుడు మనము కోరిన వరముల నిచ్చుటకు సంశయించునేమొగాని; సరస్వతి మనకు కావలసిన వరములనొసంగుటకు సిద్ధపడియుండును. దేవాలయము లెంత పూజనీయములో సరస్వతీ ఆలయములును అంతపూజనీయములే. దేవాలయములు పామరుల కవునేమో గాని సరస్వతీ ఆలయములు పండితులకును పామరులకును లాభకరములు. కనుక సర్వజనులకును ఉపయోగపడు గ్రంథాలయమే సార్థక నామధేయముకలది. పూర్వుల యొక్కయు, ఆధునికులయొక్కయు, జ్ఞానము గ్రంథములలో నిమిడి యుండును. సంఘాభివృద్ధికి వీరి సద్గ్రంథములు యెంతయు తోడ్పడును. అందుచే దేశాభ్యుదయమునకు ప్రతియూరను గ్రంథాలయములుండుట ఆవశ్యకము.

### గ్రంథాలయావశ్యకత

దేశము గొప్పసంధిగ్ధావస్థలో నున్నది. భారతీయులు రాజ్యాంగ విషయములలో ఆశాభంగమును బొందుచుండిరి. దేశీయుల పట్టుదల ఎక్కువగుచున్నది. ప్రతి భారతీయుడును రాజ్యాంగము తెలిసికొన ఆతురత బొందుచున్నాడు. ఈ సమయములో నాయకులు జనసామాన్యమునకు దేశస్థితిగతులను తెలియజెప్పుట విధియైయున్నది. నాయకులకు దేశాభివృద్ధికై యేర్పడినసంఘములు తోడ్పడవలసియున్నవి. ఈపనిని

---

* ఆహ్వాన సంఘాధ్యక్షులు



శ్రీ ఆరె సుబ్బయ్య
(పేజీ ౧౩౬)



శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు
(పేజీ ౧౪౦)

నిర్వహించుటకు గ్రంథాలయములకు యెక్కువ అవకాశములున్నవి. జనులు రాజకీయజ్ఞానమును సంపాదించుటకు ముందు విద్యావంతులై యుండుట ప్రయోజనకరముగా నుండును. కనుక ఈ విధులను నెరవేర్చుటకు ప్రతి యూరను గ్రంథాలయములుండుట ఆవశ్యకము.

తాలూకాసంఘము

తాలూకాలోనున్న గ్రంథాలయముల మంచిచెడ్డల విచారించుతగ్గు సలహాల నొసంగుటకును, తాలూకాలో గ్రంథాలయోద్యమమును వ్యాపింపజేయుటకును తాలూకా సంఘముయేర్పాటు చేయబడెను. తాలూకా సంఘము పక్షమున తెనాలిలో జరిగిన గుంటూరు మండల సభతో బాటు ఒకసారి తెనాలి తాలూకా గ్రంథాలయముల మహాసభ కూడినట్లు జ్ఞాపకము. తరువాత సంఘము విషయమై యెవరును జోక్యము పుచ్చుకొనక పోవుటచే నంతటితో నదిపోయె. మరల క్రిందటిసంవత్సరము ఫిబ్రవరిలో శ్రీ భారతీ విద్యానిలయము (అనంతవరము) యొక్క వార్షికోత్సవముతో బాటు తాలూకా గ్రంథాలయముల సమావేశముకాబడినది. కొన్ని తీర్మానములు చేయబడినవి. శ్రీ కుప్పా శ్రీరామశర్మగారు తాలూకా సంఘ కార్యదర్శిగా నెన్నుకోబడిరి. శ్రీ భారతీ విద్యానిలయము కేంద్ర గ్రంథాలయమని తెలుపబడినది. కేంద్ర గ్రంథాలయమన నేమో, అది చేయవలసిన పనియేమో ఎవరికిని తెలుపబడలేదు సరిగదా ఇంతవఱకు అదిచేసిన పనియైనను సరిగా తెలియదు. తాలూకా సంఘము ఎంతవరకు పనిచేసినది ఎవరు నెరుగరు. ఒక చిన్న సంఘమునే పరిపాలించుటకు సామర్థ్యము లేనివారమైతిమి. సామర్థ్యములేకపోయినదా? ఉన్నది. కాని ఎవరికివారు ఇందులో మనకు లేనిపోనిజోక్యమెందుకు? ఎవరో ఒకరుండిరిగదా అనుకొందురు. అందుచే మనపని నవ్వులపాలయినది. ఈ విధముగ మనము పనిచేయుచు వచ్చినయెడల ఏయుద్యమమైననుగట్టెక్కనేరదు. పరిపాలనా స్వాతంత్ర్యమును పొందజాలము.

**మండల గ్రంథాలయ సంఘము**

తాలూకా గ్రంధాలయ సంఘమునకు పైన మండల గ్రంథాలయ సంఘము కలదు. ఇదివఱకు ఈ సంఘము తాలూకా సంఘమువలెనే నామమాత్రావశిష్టమై యుండెను. ఈ సంవత్సరము కొంచెము పని చేసినది. కరపత్రముల నచ్చువేయించి ప్రజలకు దేశ స్థితిగతులను కొంతవఱకు తెలియజెప్పినది. అయినను గ్రంథాలయముల విషయమై అంతగా జోక్యము తీసికొనినట్లు తోచదు. మండల గ్రంథాలయ సంఘమైనను తాలూకా సంఘ మెట్లు పనిచేయుచున్నదో తెలుసుకొనదయ్యె. ఇక మన గ్రంథాలయము లెట్లు బాగుపడును?

**గ్రంథాలయ సంఘముల విధులు**

గ్రంథాలయములు దేశసేవ చేయుటకు వానికి తగిన అవకాశము లున్నవి. విద్యావిహీనులకు రాత్రి పాఠశాలలు స్థాపించి విద్యను బోధింపవచ్చును. పదుగురు గూడుచోట్ల పత్రికలను చదివి దేశ స్థితిగతులను దెలియజెప్పవచ్చును. మన జిల్లా సంఘమువారివలె కరపత్రములు అచ్చువేయించి పంచిపెట్టవచ్చును. జాతీయ పండుగలు సల్పుచు జనులలో జాతీయాభిమానమును పుట్టించవచ్చును. మంచి సామర్థ్య మున్నయెడల గ్రామమును పరిపాలించవచ్చును.

తాలూకా సంఘమువారు తాలూకాలోని గ్రంథాలయముల మంచి చెడుగులను కనుగొని తగిన సలహాల నీయవలయును. సంవత్సరమునకు రెండుమారులయినను తాలూకాలోని గ్రంథాలయములనుండి లెక్కలు తెప్పించుకొని మండల గ్రంథాలయ సంఘమునకు పంపవలెను. మండల గ్రంథాలయ సంఘమువారు యీ లెక్కలను జూచి తగిన సలహాలను తాలూకా సంఘమువారి కీయవలెను. మండల గ్రంథాలయ సంఘ కార్యదర్శి సంవత్సరమున కొకమారైనను ప్రతి గ్రంథాలయమును పరీక్షించి అభిప్రాయముల నిచ్చిరావలెను. మన గుంటూరు మండల గ్రంథాలయ సంఘమువారు కరపత్రముల నచ్చువేసి పంచిపెట్టుట ప్రశంసార్హముగా నున్నది.

ము గిం పు

సభ్యులారా! మండల సంఘములకుగాని, తాలూకా సంఘము లకుగాని తగినంత ప్రోత్సాహము లేకపోవుటకు అనేక కారణము లుండును. "తాలూకా గ్రంథాలయ మహాసభ ది 3-9-20 న కూడును" అని ఆ సభ విషయమై ఒక పత్రికకు వ్రాస్తిమనుకొనుడు. కొన్ని రోజు లకు పత్రికలో యేదో యొక మూలను యీ విషయమై యుండును. ఆ పత్రికలో దీనికి ప్రధాన స్థాన ముండదు. అందుచే కొందరు చూడ వచ్చును; కొందరు చూడకపోవచ్చును. చూచినవారైనను అంత గొప్ప విషయముగా దలచరు. అందుచేత సభనాటికి యే నలువురో వచ్చెదరు.

మన నాయకులుగూడ యివి చిన్న సభలనియు, పల్లెటూళ్ళలో నంత బాగుగ జరుగవనియు తలచిగాబోలు నిరాకరణ జూపుదురు. నాయకులు యీలోపములనుతీర్చినగాని వారి యుద్దేశ్యములు సక్రమ ముగ నెరవేరజాలవు.

గ్రంథాలయ కార్యనిర్వాహకులకు ప్రథమమున ఉన్నంత పట్టుదల రానురాను తగ్గిపోవుటకుకూడ హేతువు లుండకపోవు. ఒక గ్రంథా లయ వార్షికోత్సవమునకు ఒక నాయకుని అధ్యక్షునిగా నెన్నుకొని అధ్య క్షుని అంగీకారమును పొంది తగుయత్నములు చేయుదురు. వార్షికోత్స వము రెండు మూడు దినములున్నదనగా అధ్యక్షుని వద్దనుండి రాలే నందుకు చింతిల్లుచున్నానని జాబువచ్చును. అప్పుడు కార్యనిర్వాహకు లకు నిరుత్సాహము గాకయుండునా? ఇటుల రెండు మూడు వార్షికోత్స వములకు జరిగినయెడల ఆగ్రామములో కార్యనిర్వాహకులు తలయెత్తి తిరుగగలరా? పల్లెటూరులోవిద్యావంతులు స్వల్పసంఖ్యాకులుగనుందురని అందరెరింగినవిషయమే. అట్టి సమయములో నాయకులు వచ్చి వీరికి తగువిధముగా సదుద్యమములపట్ల అభిమానమును కలిగించకపోవుట చేతనేగదా పలెటూళ్లింత వెనుకబడియున్నవి.

— గ్రంథాలయ సర్వస్వము, 4 వ సంపుటము 4 వ సంచిక 1 వ భాగము నుండి

# ప్రథమ పల్నాడు తాలూకా గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ, గంగవరము

[20-11-1920]

## శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు

ప్రజల జ్ఞానాభివృద్ధి కావించి, వారిలో ఐకమత్యము స్వయం సహాయము, కార్యదీక్ష, దేశాభిమానము పురికొల్పుటకే గ్రంథాల యోద్యమము బయలు దేరినది. దేశాభ్యుదయ కరములగు సదుద్యమముల కన్నిటికని గ్రంథాలయోద్యమము చేయూత నొసంగవలయు ననియే ఉద్యమస్థాపకుల వాంఛ. గ్రంథాలయోద్యమ మతి త్వరితముగ నాంధ్ర దేశమంతటను వ్యాప్తిచెంది ఆంధ్రుల పురోభివృద్ధికి ముఖ్య సాధకముగ వెలయుచున్నది.

గ్రంథాలయోద్యమ చరిత్ర పరికించినవారికి రెండు విషయములు పొడగట్టును.

౧. దొరతనమువారి సహాయమును పొందకయే గ్రంథాలయ ములు స్థాపితములయి వర్ధిలుచున్నవి.

౨. ఉత్సాహవంతులగు యువకులు స్వశక్తివలన నీయుద్య మమును జయప్రదముగ నిర్వహించుచున్నారు.

ప్రతివిషయమునను దొరతనమువారి సహాయ్యమపేక్షింపక, ఐక మత్యమువలనను, స్వయం సహాయము వలనను, మన దేశీయులు ఉత్త మకార్యములను నెరవేర్చగలుగుదురనుటకే నిదర్శనము చాలదా? ఆంధ్ర యువకులు కేవలము నిరర్థక వాగ్వివాదములతో కాల యాపన చేయక కార్యరంగమున ప్రవేశించి దేశసేవ చేయగలుగుదు రనుట కే నిదర్శనము చాలదా?

గ్రంథాలయోద్యమము మనదేశమునకు నూతనము గాదనియు ప్రాచీన భారతవర్షమున ప్రశస్త గ్రంథాలయములుండి భాషాసేవ కావిం

చినవనియు విరూపించుటకెన్నియో సాధనములు కలవు. కాని ప్రాక్తన భారత వర్షమును గూర్చియు, ఆంధ్రగ్రంథాలయోద్యమ ప్రాశస్త్యమును గూర్చియు మీరు పలుమారులు పత్రికలలో పఠించి యున్నారు. ప్రస్తుతము పల్నాడు తాలూకా యందీ యుద్యమమును నిర్వహించు విషయము కొంత ముచ్చటించెదను.

ఇచ్చట సుమారు ౧౨ గ్రంథాలయముల ప్రతినిధులు సమావేశమైనట్లు నమ్ముచున్నాను. వెంటనే తాలూకా గ్రంథాలయ సంఘము నేర్పరచి సమర్థులగు కార్యనిర్వాహకుల నెన్నుకొనుడు. ధనవంతులును వయోవృద్ధులును మీకు తప్పక సాయము చేయుదురు. కాని కార్యభారమంతయు యువకులే వహింపవలసియుందురు. ఆడంబరము లేక నిర్మల హృదయములతో ఉద్యమవ్యాప్తి కావింపవలెను.

వీలు ననుసరించి కారెంపూడి గ్రామమునగాని మఱియొక గ్రామమునగాని తాలూకా గ్రంథాలయసంఘ కార్యస్థాన ముండవచ్చును. తాలూకా యందలి ప్రతి గ్రంథాలయమును సంఘమునకు శాఖగాచేరి కొంత మొత్తమును చెల్లించుచుండ వలెను.

ప్రతిగ్రంథాలయమును చుట్టు ప్రక్కలనున్న గ్రామములనున్న ప్రజలకు ముఖ్యవిషయముల గూర్చి బోధించుచు గ్రంథాలయ స్థాపన గూర్చి హెచ్చరించుచుండ వలెను. గ్రంథాలయమనిన విశేషధనము కావలెనను అపోహ మనలో ప్రబలియున్నది. విశేష ధనము వ్యయపరచి వేల సంఖ్యగల పుస్తకములను సేకరించియు ప్రజా సామాన్యమున కుపకరింపని గ్రంథాలయములు కొన్ని గలవు. స్వల్ప సంఖ్యాపుస్తకములున్నను అమూల్యమగు దేశసేవ చేసిన గ్రంథాలయములును కొన్ని కలవు. గ్రంథాలయములను వెంటనే స్థాపింప లేకపోయినను నెల కొకరూప్యము ఖర్చుతో పఠన మందిరములైనను నెలకొల్పవచ్చును.

గ్రంథములను సేకరించుటయు వార్తాపత్రికలను పఠించుట మాత్రమే గాక గ్రామజీవనము నందెన్నియో విధముల పాల్గొని మన గ్రామములను భూలోక స్వర్గములుగ మార్చగలశక్తి గ్రంథాలయ సోదరులు జూపవలెను.

గ్రామములందలి కక్షలను రూపుమాపి, ఐకమత్యమును పెంపొందించి చేతిపనులనువృద్ధిపరచి సర్వవిధముల సేవ యొనర్చి గ్రంథాలయ సోదరులు ఆదర్శప్రాయు లయ్యెదరుగాక!

“పల్లెపదాల జీవము నిల్పుకొన్న పల్నాటివీరుల రక్తనాళపటిమ” ననుసరించి పూర్వమువలెనే, పల్నాటిసీమ దేశాభిమానమునకును విజ్ఞానమునకును ఆటపట్టగున ట్లొనర్పుడు:

— గ్రంథాలయసర్వస్వము, 4 వ సంపుటము 6 వ భాగమునుండి

# భీమవరం తాలూకా గ్రంథాలయ ప్రథమ సమావేశము

## శ్రీ కలవగుంట వెంకట రంగాచార్యులు *

ప్రకృతిదేవి సకలప్రాణుల జీవనతంతువులపై అనంతపరిణామ గీతి కల మేలవించుచున్నది. 'అర్హులే నటింపుడు; అనర్హులు ప్రపంచక రంగ మునువీడి యవనికాంతరమునకుబొండు' అను గంభీరమగు పల్లవి నామె క్షణక్షణమునను విస్పష్టముగా నుచ్చరించుచున్నది. దుర్బల ప్రాణులు బలవంతములగు జంతువులకు దినుబండములగుచున్నవి. పాశవశక్తులు చెల్లుబడియైనంతకాలము భుజబలముగల మానవజాతిబలహీనులను బరి మార్చి వారి సర్వస్వము నాక్రమించుకొన్నది. అమెరికాలోని రెడ్డిండి యనులు, ఆఫ్రికాలోని నీగ్రోలు, ఆస్ట్రేలియాలోని మెయోరీలు నధిక తరపాశవశక్తి సంపన్నులగు నితరజాతీయుల పాదఘట్టనలచే రజమైపోయిరి. తనసంతతి ప్రపంచమంతయు నాక్రమింపవలెనను నాశ ఆరని యగ్నివలె ప్రతిప్రాణియందును వెలుగొందుచున్నది. ఈ ప్రవృద్ధికి జంతువులెల్ల తమ సనాతన పాశవధర్మమునే యనుష్ఠించుచున్నవి. కాని మానవుడు మాత్రము పశుబలముకంటె ననేకవిధముల సునిశితమగు నాత్మశక్తి నవ లంబన మొనర్చుకొనెను. నేడు నైతికసాత్వికస్థైర్యమను పరమాయు ధము గైకొని మనుష్యుడు జగమునందెల్లెడ స్వైరవిహారధీరుడగుచు న్నాడు. పశుబలమే ప్రధానాయుధముగాగల మానవులెల్లరు నతనిమోల నిర్వీర్యులై పరాజితులగుచున్నారు. ఆ మహావీరునాయుధము జ్ఞానలో హాముతో తయారగుచున్నది. ఈ రహస్యమును మానవజాతి యనేక యుగములకు పూర్వమే గ్రహించినది. నాగరికతా ప్రారంభదశలో నొక సంఘము సంపాదించుకొనిన జ్ఞానభాండారము మరియొకసంఘమునకు స్వాధీనముగాకుండుటకై యనేకదుర్గము లేర్పరుపబడెను, కాని మానవ జాతి యంతయు నొకటేయను సిద్ధాంతము వెల్లడియైనపిమ్మట వివిధ సంఘము లార్జించిన జ్ఞానసర్వస్వము సార్వజనీనముగా జేయబడెను.

---

* ప్రత్యేక వ్యాసము.

ప్రారంభమున నొక మనుష్యుని జ్ఞానవిజ్ఞానము లింకొకనికి సంక్రమింపవలసి వచ్చినపుడు వాక్కుమాత్రమే సహాయకారిగానుండెను. మన వేదములును పారసీకుల జెండ్ ఆవస్థాయును వాగ్రూపముననే యొక తరమునుండి మరియొకతరమువారికి సంక్రమించినవి. వాఙ్మయమైన జ్ఞానము నెంతని మానవుడు స్మృతిపేటికలో నిక్షేపించుకొనగలడు? కాలక్రమమున వాగ్వికృతియు, భావవైపరీత్యములును, విస్మృతిశైథిల్యమును గలుగ మొదలిడినవి. పూర్వాగతమైన జ్ఞాననిధిని సంరక్షించుకొను నుపాయమన్వేషించుట మనుష్యునకు కర్తవ్యమయ్యెను. ఫోనీషియనులు, ఖాల్డియనులు, బేబిలోనియనులు, ఐగుప్తీయులును చిత్రలిపి (hieroglyphics) నలవరచుకొనిరి. సౌధకుడ్యములును, సమాధిగోడలును చిత్రలిపి మయమైన జ్ఞానముచే నలంకరింపబడెను. ఈ చిత్రములు భావములకు సంజ్ఞలు గాని భావముయొక్క వాగ్రూపమునకు సంజ్ఞలుగావు. కావున వీనిని వ్రాయనేర్చుకొనుట చాల కష్టముగా నుండెడిది. అవసరము నిర్మాణకౌశలమునకుఁ దల్లివంటిది. కఠినతరమైన చిత్రలిపి కాలక్రమమున సంజ్ఞాలిపిగా పరివర్తనమొందెను. క్రీటనులు, మెస్సీనియనులు, ఐగుప్తీయులు, గ్రీకులు, ప్రాచీనరోమనులును తమతమ భావములను సుబోధకముగా సంజ్ఞారూపమున దారుశిలాఫలకములపై విలిఖించెడివారు. ప్రాచీనరోమనులును, గ్రీకులును దేశీయవీరుల ఘనకార్యములను, ప్రభుత్వన్యాయవిధులను ఈ విధమున జెక్కించి సంరక్షించెడివారు.

ఈ శిలాదారు లేఖనములను భావికాలమువారికై ప్రత్యేకభవనములందు జాగ్రత్తచేసెడివారు కాని యీ సంజ్ఞాలిపి చాల స్థలము నాక్రమించుకొనెడిది. ఇందు లేఖనాసౌకర్యముకూడ తక్కువ. కావున మానవుడు సులభతరమగు మార్గముకై యన్వేషించుచు వచ్చివచ్చి తుదకక్షరలిపిని గనిపెట్టెను. ఈ లిపి కాలక్రమమున, వివిధ నాగరికతలు గల మానవులచేతులలో నవసరములనుబట్టి వివిధరూపములు దాల్చినది.

శిలాదారు లోహఫలకములు బరువైనవగుటచే నొకచోటనుండి మరియొకచోటికి గొనిపోవుట కష్టమయ్యెడిది. కావున తేలికవస్తువులపై వ్రాయుట యవసరమయ్యెను. ఐగుప్తీయులు పేపైరస్ (Papyrus)

అనునీటిచెట్టుపట్టాతోడను కర్రగుజ్జుతోడను తయారుచేయబడి, యొక విధమగు బట్టవలెనుండు కాగితములపై తమభావములను రంగులతో చిత్రింప మొదలిడిరి. ప్రాచీన హిందువులు భూర్జపత్రములపైనను తాళ పత్రములపైనను లిఖించెడివారు.

వేరువేరు పత్రము లొకసూత్రమువలన సంగ్రథితములై యుండు టచే గ్రంథమనుమాట రూఢమయ్యెను; ప్రత్యేకవ్యక్తులును సంఘము లును ప్రసాదించిన జ్ఞాన విజ్ఞానములను సమకూర్చి పూర్వులు గ్రంథ ములలో జాగ్రతపెట్టిరి. ఏథెన్సు, మెసినీ, రోము, ట్రోయ్, బాగ్దాడ్, అలెగ్జాండ్రియా, కెయిరో, పెకింగ్ మొదలగు పురాతన పట్టణములందిట్టి యమూల్యగ్రంథములను భద్రపరచుటకు గొప్పనిలయము లేర్పడినవి.

ప్రాచీనహిందూదేశమున నిట్టి యమూల్య గ్రంథభాండాగారము లుండెడివి. నలందా, తక్షశిల, విక్రమశిల, ఉజ్జయిని, తంజావూరు, వార ణాశి మొదలగు మహానగరములిట్టి గ్రంథాలయములతో చెన్నొందు చుండెడివి. రాజులు తమ నగరులను పుస్తకాలయములతో నలంకరించు కొనెడివారు. దేవాలయములందుగూడ సరస్వతీ ఆలయములుండెడివి. బౌద్ధయుగమున భారతదేశమున విజ్ఞానము వ్యాపించి వాఙ్మయాభివృద్ధికి కారణమయ్యెను. జ్ఞానసంపాదనకై యనేకయువకులు తమ సర్వస్వమును సన్యసించి భిక్షువులైరి. వీరికి వలయు సౌకర్యముల నేర్పరుచుటకు ప్రభు వులెప్పుడు సిద్ధముగానుండిరి. నలంద తక్షశిల మొదలగు పట్టణములందు గొప్ప విశ్వవిద్యాలయములు నిర్మింపబడెను. ఈ విశ్వవిద్యాలయము లలో మహాపండితులుమాత్రమేగాక గొప్ప గ్రంథాలయములుగూడ నుండెడివి. ఈ గ్రంథాలయపుస్తకములను జదువుటకు విదేశములనుండి గూడ విద్యార్థులేతెంచెడివారు. గ్రంథాలయోద్యమము మానవునికి జ్ఞానోదయమైననాడే పుట్టినది. ఇది నేటిదికాదు —

నేడు మానవజాతిలో— అందుముఖ్యముగా హైందవజాతిలో— గొప్పపరివర్తన జరుగుచున్నది. ఇది హైందవజాతికి పునరుజ్జీవన యు గమని చెప్పవచ్చును. హైందవజాతికి నూతనోత్తేజము కలిగినది. దుస్స

మా సంకుచితభావములు పండుటాకులవలె రాలిపోవుచున్నవి. విశ్వ మానవ సౌభ్రాతృత్వమును నెలకొల్పుజాతీయ వ్యక్తిత్వమును మనజాతి వాంఛించుచున్నది. ఈశ్వరుడెల్లరకు సమముగా పంచియిచ్చిన స్వామ్య ములముందు ప్రత్యేక జన్మహక్కులన్నియు కంపించిపోవుచున్నవి. ప్రపం చార్థిక విధానమునందలి తరంగములు మనలగూడ దాకుచున్నవి. ఇట్టిచో మన జాతీయనౌకను భద్రముగా నడుపుకొనుటకును, మన యాంధ్రవ్యక్తిత్వమును, మనజాతివ్యక్తిత్వమును నిల బెట్టుకొనుటకును జ్ఞానవిద్యుద్దీపాలయమగు గ్రంథాలయములు కావలెను.

గ్రంథాలయమన వేర్వేరు గ్రంథములు ప్రోగుచేసియుంచిన యొక భవనముమాత్రమేకాదు. అదియొక సజీవమగువ్యవస్థ. ప్రజలజ్ఞానపిపాసకు నమృతప్రప. అది దివ్యప్రభాబంధురము. అవిరళకళ్యాణకారణము. మానవసాంఘిక ప్రవృత్తికి చిహ్నము.

'గ్రంథభాండాగారమునకు ముఖ్యలక్షణములేవి'? యనునది తరు వాత ప్రశ్నయగును. గ్రంథములను భద్రపరచుట కొకభవనమును, అందులకు వలయు పరికరములును, గ్రంథాలయము నాదరించు నుదార స్వభావులును గల వ్యవస్థయు, బాధ్యతగల యొక కార్యనిర్వాహక వర్గము లేక నిర్వాహకుడు నుండవలెను. ఇది గ్రంథాలయము లన్నిటికి గావలసిన ప్రథమలక్షణము.

స్థానికగ్రంథాలయములు, సంచారగ్రంథాలయములు కేంద్ర గ్రంథాలయములని గ్రంథాలయములు మూడువిధములు. ఒక గ్రామ మందు నెలకొల్పబడిన ప్రత్యేక గ్రంథాలయముగాని ఒక కేంద్రగ్రంథా లయముయొక్క శాఖగాని యైనచో నది స్థానిక గ్రంథాలయమని పిలువ బడును. ఈసానిక గ్రంథాలయములన్నిటితో సంబంధముగలిగియుండి వానికి మార్గప్రదర్శకమగు గ్రంథాలయమునకు కేంద్రగ్రంథాలయ మనిపేరు. చిన్న స్థానిక గ్రంథాలయములకును గ్రంథాలయములేని గ్రామముల ప్రజలకును పుస్తకములిచ్చుచు, వసూలుచేసికొనుచు తిరు గుచుండెడి గ్రంథాలయమునకు సంచారగ్రంథాలయమని పేరు. ఈసం చారగ్రంథాలయములు రెండువిధములుగా నుండవచ్చును. గ్రంథముల

నన్నినొకేతావుననుంచి, అవసరమగు గ్రంథములను చిన్న పెట్టెలలోపెట్టి నిర్ణీతకాలమున రైలుద్వారాగాని సంచారోద్యోగుల ద్వారాగాని వివిధ గ్రామముల వారికందజేయుచు నియమితకాలానంతరము వానిని తిరిగి వసూలు చేసికొనుచుండునవి యొకవిధమగు సంచారగ్రంథాలయములు. బస్సీ మిఠాయి బండ్లవంటి చక్రగృహములలో గ్రంథములు, పత్రికలు, మాజిక్కులాంతర్లు, చిత్రపటములు సేకరించుకొని యూరూరు దిరుగుచు తమ విధిని నిర్వహించెడివి మరియొక నమోనా సంచారగ్రంథాలయములు. దేశమునకీ మూడువిధములగు గ్రంథాలయములు నవసరములే. ఒక్కొక్కదానివలన కొన్నిప్రత్యేక లాభములును సౌకర్యములును గలవు.

గ్రంథాలయ మెల్లవ్యక్తులు నుపయోగించుకొనుట కనుకూలమైనదిగా నుండవలెను. సాధారణవిద్యావంతులు- నిరక్షరాస్యులు, నవజవానులు, పూర్వాచారప్రియులు, బాలురు, వయస్కులు, స్త్రీలు పురుషులు వేయేల ఎల్లరికి గ్రంథాలయ ముపయోగ్యముగ నుండవలెను. లోకము భిన్న భిన్న రుచులు గలిగినది; కావున ప్రపంచమున నెన్ని విధముల రుచులున్నవో తెలిసికొని సామగ్రి సంపాదించుకొనవలెను. గ్రంథాలయాశయమునకు సరిపడు నిర్మాణవిధానముండవలెను, సాధారణముగా దొరకిన తుక్కుపుస్తకములన్నిటిని దెచ్చి గ్రంథసంఖ్య పెంపొందింపజూతురు. ఇది సరియగు పద్ధతికాదు. ఒకతావుయొక్క అవసరమునుబట్టియు, ఒకకాలము యొక్క అభిరుచినిబట్టియు గ్రంథములు నిర్ణయింపబడవలయును. వేర్వేరు తరగతులవారికి, వేర్వేరు వయస్సులుగలవారి కాయాతరగతులకు వయఃప్రకృతులకు రుచించు గ్రంథములుండవలెను. పురుషులకు రుచింపని పాకశాస్త్రాది గ్రంథములు స్త్రీలకు రుచించును; నాగరికులు పాటింపని వ్యావసాయకశాస్త్రములను జానపదులభిరుచితో జదువుదురు. కావున ఒకే పోతలోని గ్రంథములను సేకరించుట తగదు. ఈ గ్రంథములను వర్గములుగా విభజింపవలెను. నిరక్షరాస్యుల కనుకూల సౌకర్యములు గ్రంథాలయమందుండవలెను. గ్రంథపట్టికను తయారుచేయు విషయమున కార్యనిర్వాహకులు కౌశలమును జూపవలెను. వేదాంత

గ్రంథములు, అర్థశాస్త్ర గ్రంథములు, చారిత్రక గ్రంథములు, సైన్సు గ్రంథములు, రాజకీయ గ్రంథములు, పురాణ గ్రంథములు, ప్రబంధములు, పాటలు, నాటకములు, నవలలు, ప్రయాణిక గాథలు, కథలు, కథానకములు, సాహసకృత్యములు అని యీ విధమున గ్రంథములను వర్గీకరింపవలెను. ఆ గ్రంథముల పట్టికయందు విషయసూచికయు అను క్రమణికయు నుండుట మేలు. దీనివలన ప్రతివారును వారి వారికి వలయు గ్రంథములను సులభముగా నెన్నుకొనగలరు.

అక్షరాస్యులగువారికి మాత్రమేగాక, నిరక్షరాస్యులకును, మూగ వారికిని, జన్మాంధులకును జ్ఞానము నొసగూర్చుటకు పాశ్చాత్య దేశములలో ననేక విధానములనవలంబించుచున్నారు. మాజిక్కులాంతరుపన్యాసములు, సినిమాలు, చిత్రపటములు, ప్లానులు, అనురూపములు (models) మొదలగు సాధనములతో జ్ఞాన విజ్ఞానములను సర్వజనాళికిని వెదజల్లుచున్నారు. వయస్కుల పాఠశాలలను రాత్రి పాఠశాలల నేర్పరచి నిరక్షరకుక్షిత్వమును రూపుమాపుచున్నారు. ఆధునిక సాంఘిక రాజకీయ జ్ఞానము నుపన్యాసముల మూలమున ప్రజలకు గలిగించుచున్నారు. ప్రాచీన భారతమునగూడ జ్ఞానవ్యాప్తికొరకిందు కొన్ని మార్గము లవలంబింపబడెడివి. ఇప్పటికిని పురాణపఠనము, సుద్దులు, బొమ్మలాటలు మొదలగునవి విద్యావ్యాప్తి కుపకరించుచున్నవి. కాని, సినీమాలు, టాకీలును, ఓపేరాలు, గ్రామఫోనులు, రేడియో బ్రాడ్ కేస్టింగులు, దినపత్రికలు, మాసపత్రికలు గల యీ రోజులలో ప్రజల భావ పరివర్తననుబట్టియు అభిరుచుల మార్పులనుబట్టియు జ్ఞానప్రసరణ పద్ధతులుకూడ మారవలయునుగదా! కావున సాధ్యమైనంతవరకు నవీనపద్ధతులపైననే గంథాలయములు విద్యావ్యాప్తి గావింపవలెను. గ్రామఫోనులు, సినీమాలు, అనురూపములు, చిత్రపటములు, ప్లానులు లేనిదే ఏ గ్రంథాలయమును సంపూర్ణము కాజాలదు.

ఇట్టి గ్రంథాలయ వ్యవస్థ సక్రమముగా పనిచేయుటకు సరియగు కార్యవిధానముండవలెను. గ్రంథపట్టిక, సాధన సామగ్రి పట్టిక, గ్రంథ ప్రచారముల వివరములు, దినపాఠకుల పట్టిక, ఆదాయ వ్యయములపట్టిక

సభావ్యవహారముల వివరములు, వార్షిక విజ్ఞాపనలును సుబోధకముగా వ్రాసియుంచవలెను. గ్రంథాలయ చందాదారుల మహాజనసభలు, కార్య నిర్వాహక వర్గసభలును తరచు జరుగుచుండవలెను. చందా హెచ్చుగానున్నచో గ్రంథాలయము బీదసాదల కందుబాటులో నుండదు. కావున సాధ్యమైనంతవరకు చందాతక్కువగానుండుట మంచిది. గ్రంథాలయ గౌరవోద్యోగుల నధికార పిశాచ మావేశించినచో అసలు సంస్థకే నాశనము సిద్ధించును గాన నట్టిదేదియు గ్రంథాలయ కార్యనిర్వాహణ శాఖయందు దలచూపకుండ జూడవలెను.

గ్రంథాలయము సామాన్యముగా నేకొద్దిమంది అక్షరాస్యులనో మాత్రమాకర్షించుటయు, సామాన్యప్రజలకు దానితో నే జోక్యము లేకుండుటయు గలదు. ఇట్లు ప్రజాసామాన్యము దూరముగా నున్నంత కాలము గ్రంథాలయోద్యమము విజయ మొందదు. గ్రామస్థుల ప్రతి యుత్సాహ కార్యమునకు గ్రంథాలయము పుట్టినిల్లుగా నుండవలెను. గ్రామస్థుల నవజీవనోజ్జ్వలత కదియే శక్తిమందిరమై యుండవలెను. సర్వగ్రామీణ సంవాద సమాజమొకటి ప్రతి గ్రంథాలయమునకు నుండవలెను. నానావిషయములనుగురించి యుపన్యసించుటకు ప్రముఖుల నాహ్వానించుచుండవలెను. గ్రంథాలయమున తరచు పురాణపఠనము, హరికథలు, సంగీత కచేరీలు, గాన కథలు, (బొబ్బిలిపాట మొదలగునవి) జరుగుచుండవలెను. గ్రంథాలయములలో గ్రామఫోనులు, మాజిక్కులాంతర్లు నుండవలెను. గ్రామస్థులెల్లరకును సంబంధించిన విషయములు ధర్మకార్యములును, గ్రంథాలయముననే జరిపింపవలెను. గ్రంథాలయము తరపున నేవో పోటీపరీక్షలు పెట్టుచుండవలెను. పామరులను ప్రత్యేక సానుభూతితో నాదరింపవలెను. దినపత్రికలను మాసపత్రికలను చదివి వర్తమాన వ్యవహారములను ప్రజాసామాన్యమునకు బోధించుచుండవలెను. గ్రంథాలయమును సాధ్యమైనంతవరకన్ని వేళలయందును తెరచియుంచవలెను. గ్రంథాలయమున జాతి మత సంఘ విషయక విభేదములకు తావొసంగరాదు. వేయేల దేవునారాధించుటకెల్లర కెట్లు హక్కుగలదో యదే విధమున గ్రంథాలయము నుపయోగించుకొను

టకు ప్రజలందరికిని హక్కుండవలెను. గాలియు నీరు నాహారమును తప్పనిసరియగునట్లే గ్రంథాలయముకూడ ప్రతి మానవునకును ముఖ్యావసరములలో నొకటియని యెల్లరునుగ్రహించునట్లు చేయవలెను. గ్రంథాలయమును విలాస మందిరముగా మాత్రముపయోగింపజనదు. పేకాట, చదరంగము మొదలగు నాటలకును, కాఫీ టీ త్రాగుడు వ్యసనమునకును గ్రంథాలయమున తావొసంగరాదు.

శరీరమునకు రక్త మెంతముఖ్యమో ప్రతివ్యవస్థకును ధనమంత ముఖ్యము. గ్రంథాలయాభివృద్ధి కుత్సాహ మెంత యవసరమో ధనముకూడ నంత యవసరమే, కావున సాధ్యమైనంతవరకు ధనమును సంపాదింప ప్రతి గ్రంథాలయవ్యవస్థయు యత్నింపవలెను. దేశకాలపరిస్థితులనుబట్టి ద్రవ్య సేకరణోపాయముల నాలోచింప వలెను. గ్రామస్థుల శక్తి సామర్థ్యముల నుబట్టి చందాలు వసూలుచేయవలెను. గ్రామముయొక్క యుమ్మడి సొమ్మునుండి వీలుకొలది కొంతభాగమును గ్రంథాలయముకొరకు ప్రత్యేకించుచుండవలెను. పచ్చగడ్డిపాటల డబ్బునుండియు చేపలవేలము సొమ్మునుండియు కొంతభాగము సాలీనాగా గ్రంథాలయముల కొసంగవలెను. రైతు కుప్పను నూర్చినపుడు గణాధిపతి చేటయని చేటెడు ధాన్యమును ధర్మమునకు ప్రత్యేకించును. అట్లే గ్రంథాలయముచేట యని యింకొకచేటెడు ధాన్యము నేల ప్రత్యేకించరాదు? ఆదేవిధమున వర్తకులు రూపాయికొక కాసువంతున తమలాభమునుండి గ్రంథాలయమునకు ధర్మముచేయవచ్చును. రథోత్సవ సమయములందును, ఉత్సవములయందును గ్రంథాలయభిక్షలు వసూలుచేయవచ్చును. గ్రామస్థులు తమయిండ్లలో శుభకార్యములు జరుగునపుడు సభాకట్నము లిచ్చునట్లే గ్రంథాలయ కట్నములగూడ నీయవచ్చును. దేవాదాయము సత్రాదాయము మొదలగు ధర్మాదాయములనుండి యొకభాగము గ్రంథాలయమున కీయవచ్చును. స్థానిక పరిపాలనా సంస్థలనుండియు రాష్ట్రీయ ప్రభుత్వమునుండియు దగిన సంచలనముచేసి గ్రంథాలయ విరాళములను పొంద ప్రయత్నింపవలయును. ఇట్లు గ్రామస్థులు తమ బుద్ధికుశలతకొలది ఎవ్వరికి నొప్పికలిగింపకయే అనేక విధముల ద్రవ్య

మును సేకరించి గ్రంథాలయములను పోషింపవచ్చును. ప్రతిస్థానిక గ్రంథాలయమువారు కేంద్రసంచార గ్రంథాలయములకు కొంతచందా నొసంగవచ్చును.

గ్రంథాలయములు తమ బాధ్యతలను సక్రమముగా నిర్వర్తించెడిచో దేశమున కమూల్యమగు సేవ చేయును. ప్రజలలో జాతీయ భావములను, దేశభక్తియు పురిగొల్పును; ఆరోగ్యవిధుల నేర్పును. జ్ఞాన నేత్రమును తెరచి ప్రస్తుత ప్రపంచవ్యవహారములను స్పష్టముగాజూపును; సాంఘికధర్మములను బోధించును. పౌరసత్వహక్కులను తెలియజేయును. నూతనపద్ధతులపై వివిధవృత్తులను నెరవేర్చు విధానమును గరపును. గ్రంథాలయములు మానవుని సకలజీవితపథములందును సౌందర్యోపాసకుని గావించును.

— 'భీమవరం తాలూకాలోని గ్రంథాలయముల చరిత్ర' నుండి

అనుబంధము : ౧

# కర్నూలు మండల గ్రంథాలయముల

## ప్రథమ మహాసభ వృత్తాంతము

1933 సం॥ నవంబరు 29-30 తేదులలో కర్నూలుమండల గ్రంథాలయ మహాసభయున్నూ, బేస్తవారపుపేట శ్రీ వరదరాజమ్మ గ్రంథాలయ సప్తమ వార్షికసభయు జరుపుటకు వరదరాజమ్మ గ్రంథాలయపాలకవర్గమువారు ది 7-10-33 న కొన్ని తీర్మానములు చేసిరి. ది 25-10-33 తేది ఆహ్వాన సంఘమును ఎన్నుకొనిరి. నాటినుండియు అధ్యక్షులు శ్రీ సేపూరి యల్లమందయ్యశ్రేష్ఠిగారు శక్తివంచనలేక స్వంతపనులు వీడి ప్రచారముచేసిరి. శ్రీ భావనాఋషి స్వామివారి ఆలయములో 27-11-33 వ తేదీ నాటికి సభ జరుగుటకు విశాలమగు పందిరియు, దేవాలయ ఆవరణము అంతయు గొప్ప పందిరియు వేసి గ్రామమంతయు తోరణములతోను, గ్రంథాలయాభివృద్ధికరమగు వాక్యములు, అధ్యక్షుల స్వాగత. వాక్యములతోను, ఆర్చీలు అమర్చి అలంకరించిరి.

27-11-33 ఉదయం సభాధ్యక్షులు శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు బెజవాడనుండి వచ్చిరి. బాలభటులు రైలుస్టేషనువద్ద వారిని పుష్పమాలాలంకృతులనుచేసి స్వాగతముచెప్పి జయజయధ్వానములతోను, బ్యాండువాయిద్యములతోను గ్రామములో ఊరేగించి విడిదిగృహమునకు చేర్చిరి.

29 తేది ఉదయమగుసరికి సభల అధ్యక్షులు శ్రీ రాజా పెద్దసుబ్బరాయశ్రేష్ఠిగారు, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, శ్రీ కొల్లా సుబ్బారాయ గుప్తాగారు, పెక్కండ్రు ప్రతినిధులు విచ్చేసిరి. పురవాసులు, బాలభటులు వీరిని బ్యాండు వాయిద్యములతో నెదుర్కొని సగౌరవముగా సభాస్థానము జేర్చిరి.

## ప్రతినిధులు

నంద్యాల కన్యకాపరమేశ్వరీ గ్రంథాలయమునుండి కొప్పరపు రామయ్యశ్రేష్ఠిగారు, నెరవాటి బాలయ్యశ్రేష్ఠిగారు, అలవాల తిరిపేలయ్యశ్రేష్ఠిగారు, బాలభారతీ గ్రంథాలయమునుండి బొగ్గరపు వేంకట గురవయ్యశ్రేష్ఠిగారు, కైప సుబ్రహ్మణ్యశర్మగారు, విక్టోరియా గ్రంథాలయమునుండి గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, మిట్టపాలెం కన్యకా గ్రంథాలయమునుండి కొల్లా సుబ్బారాయగుప్తగారు, యర్రగుంటపాలెం వేణుగోపాల రీడింగురూమునుండి యెక్కల రామయ్యశ్రేష్ఠిగారు, మార్కాపురం వివేకానంద గ్రంథాలయమునుండి వి. ఐ. కృష్ణమూర్తిగారు, గజ్జలకొండ సచ్చిదానంద గ్రంథాలయమునుండి జి. రామకృష్ణశతావధానిగారు, శారదా గ్రంథాలయమునుండి మట్టా అల్లూరయ్యగారు, వాసవ గ్రంథాలయమునుండి భాగవతం సీతారామాచార్యులుగారు, వరదరాజమ్మ గ్రంథాలయమునుండి వి. సుబ్బారాయుడుగారు, యేకునాంపేట వీరాంజనేయ గ్రంథాలయమునుండి కె. జోగయ్యగారు, పెద్దదోర్నాల గోనుగుంట్ల అల్లూరయ్యగారు ఇంకను పలువురు ప్రముఖులు విచ్చేసిరి.

## సరస్వతీ పతాకోత్సవము

ఉదయము 8-30 గంటలకు గ్రంథాలయ మహోత్సవము అయ్యంకి వేంకటరమణయ్యగారి అధ్యక్షతక్రింద ప్రారంభమైనది. ప్రథమమున సరస్వతీదేవిపూజ గావింపబడినది. పిమ్మట ఆశుకవిచక్రవర్తి అభినవబాణ గౌరావఝ్ఝుల రామకృష్ణశాస్త్రిగారు సరస్వతీదేవి ప్రార్థనను జేసిరి. అనంతరము అధ్యక్షులులేచి ఏ కార్యమైన జేయుటకు ముందు ఇష్టదేవతా ప్రార్థనయు పతాకోత్సవమును జేయుటయు మనదేశ ప్రాచీన సంప్రదాయప్రకారము మన ఉద్యమము జయప్రదమగుటకుగాను అత్యంతావసరమనియు, అయితే అట్టి పతాకము మన యుద్యమముయొక్క చిహ్నమై మనలకు ఉత్తేజము కలుగజేసి, మన కార్యక్రమమునందు నిరంతరము చేయూత నొసంగ గలిగినదైయుండవలెననియు, అట్టి శక్తి వాగ్దేవి యగు సరస్వతికి తప్ప మరియొకరికి లేదనియు, గ్రంథాలయోద్యమమునకు అధిష్ఠాన దేవతయగు అట్టి దేవినే ఈ పతాకము నలంకరింప జేయుటచే మనకు కార్యసిద్ధి తప్పక చేకూరగలదనియు, అట్టి కార్యసిద్ధికై ఈ పతాకము నెగురవేయుచున్నాననియు చెప్పి, పతాకోత్సవమును జేసిరి. అనంతరము బాలభటులు శ్రావ్యములగు గీతములను పాడిరి. అప్పుడు అధ్యక్షులగు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారికి స్వాగతపత్రమును స్వాగత గీతములును అర్పింపబడినవి. పిమ్మట ఛాయాపటము తీయబడెను.

సరస్వతీదేవి పతాక ప్రాముఖ్యతనుగూర్చి శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారును, వేంకట సుబ్బరాయ శర్మగారును ఉపన్యసించిరి. పిమ్మట శతావధాని రామశాస్త్రులుగారు శ్రీకృష్ణదేవరాయల ధర్మపత్నియు, ఈ తాలూకాకు జీవప్రదాయినియు నగు శ్రీ వరదరాజమ్మ ప్రశంసజేసిరి.

## వరదరాజమ్మ గ్రంథాలయ వార్షికసభ

సాయంత్రం 4 గంటలకు శ్రీ వరదరాజమ్మ గ్రంథాలయ షష్టమ వార్షికసభ ప్రారంభింప బడెను. దైవప్రార్థనలతో అధ్యక్షులను పుష్పమాలాంకృతులుగా నొనర్చి స్వాగతము సమర్పించబడెను. ప్రారంభోపన్యాసానంతరము కార్యదర్శి నివేదిక చదువబడెను. గ్రంథాలయోద్యమమునుగూర్చి పలువు రుపన్యసించిరి. అధ్యక్షుల ముగింపు మాటలతోటి వందన ములతోటి రాత్రి 6 గంటలకు సభ ముగించబడెను.

## మండల గ్రంథాలయ మహాసభ

30 వ తేది ఉదయం 9 గంటలకు మంగళవాయిద్యములతో యెల్లరు సభాస్థానమున సమావేశమైరి. మండల గ్రంథాలయముల మహాసభను దైవప్రార్థనలతో ప్రారంభించిరి. ప్రారంభోపన్యాసము చదువబడి అధ్యక్షుల ఎన్నికలు జరిపి శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారిని అధ్యక్షులుగా నెన్నుకొని పుష్పమాలాకృతుల జేసి స్వాగత మర్పించబడెను. ప్రారంభోపన్యాసము కాగానే చర్చనీయాంశముల గురించి అనేకులు ఉపన్యసించి తీర్మానములు చేసిరి. వందనములతోటి 1 గంటకు ఉదయపు సమావేశము ముగింపబడెను.

మధ్యాహ్నము 4 గంటలకు సభాస్థానమున వెనుకగల విశాలమైన భవనమున అమర్చబడిన గ్రంథాలయ ప్రదర్శనము శ్రీ కె. శరభారెడ్డి, మాజీ యం. యల్. సి. గారి ఆధిపత్యమున జరుపబడెను. అధ్యక్షుల స్వాగతానంతరము ప్రదర్శనమును గురించి ఉపన్యసించి ప్రదర్శనశాల తెరచిరి. అందుగల వివిధరకముల పత్రములు శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు అధ్యక్షులకు చూపుచు, వాటి వివరములు తెలుపుచుండిరి. ఎల్లరు ఆనందించిరి. సభ ఫోటో తీయబడిన తరువాత వ్యాయామ ప్రదర్శనము కొల్లా సుబ్బరాయగుప్తాగారి ఆధిపత్యమున సమావేశమాయెను. అధ్యక్షుల పుష్పమాలాలంకృతుల నొసర్చి స్వాగతము సమర్పింపగానే ప్రారంభోపన్యాసము చదివిరి. పలువురు ఉపన్యసించిన తదుపరి నంద్యాల శ్రీ అలవాల తిరుపేలయ్యశ్రేష్ఠిగారున్నూ, శ్రీ బొగ్గరపు వేంకట గురవయ్యశ్రేష్ఠి కు॥ 6½ సం॥ వయస్సుగల పుల్లయ్యగారు వ్యాయామ ప్రదర్శనములు చేయుచు, కత్తి, కర్రసాములు మిగుల సమర్థతతో జూపి సభ్యుల నానందింపజేసిరి. శ్రీ తిరుపేలయ్యశ్రేష్ఠిగారికి ఖద్దరు వస్త్రము సమర్పింపబడి, బాలకునకు అభినవాభిమన్య బిరుదము నిచ్చి బహుమానపతకము నొసంగుటకు సంఘమువారు వాగ్దత్తము చేసిరి. శతావధానులచే వ్యాయామ ప్రశంస పద్యములు, వీడ్కోలుపు పద్యములు చదువబడి వందనములతోటి 9 గంటలకు ముగింపుచేసి అధ్యక్షుల నెల్లవెని గ్రామమున వుత్సవము జేసిరి.

ది 1-12-33 న వుదయం 8 గంటలకు అధ్యక్షులను, ప్రతినిధులను బ్యాండు వాయిద్యములతోటె వీడ్కోలు జరిపిరి. శ్రీ భావనాఋషి స్వామివారికి లక్ష కుసుమార్చనా విధులు ది 29 న ప్రారంభించబడి ది 2-12-33 తేది సాయంత్రికి పూర్ణాహుతితోటి పూర్తి కావింపబడెను. శ్రీ మట్టా అల్లూరయ్యగుప్తగారి ఆధిపత్యమున సభ జరిపి అభినవాభిమన్య శ్రీ పుల్లయ్యశ్రేష్ఠిగారికి బహుమానపతక మొసంగబడెను.

అనుబంధము : ౨

# తాడేపల్లిగూడెము తాలూకా తృతీయ గ్రంథాలయ మహాసభ నివేదిక

తాడేపల్లిగూడెం తాలూకా, అలంపురము గ్రామములోని పంచాయతీ గ్రంథాలయమువారి యాజమాన్యమున, పంచాయతీ గ్రంథాలయ తృతీయ వార్షికోత్సవమును, తాడేపల్లిగూడెము తాలూకా తృతీయ గ్రంథాలయ మహాసభయు శ్రీయుత శనివారపు సుబ్బారావుపంతులుగారి అధ్యక్షతను, గ్రంథాలయ భవనమునందు, 8-9-36 వ తేది పగలు 2 గంటలకు అత్యంతజయప్రదముగా జరిగెను.

సభకు, సుమారు అయిదారు వందలమంది హాజరు అయిరి. 25 గ్రంథాలయముల నుండి గ్రంథాలయప్రతినిధులు వచ్చి పాల్గొనిరి. దైవప్రార్థన పిమ్మట శ్రీ పెనుమర్తి భూలోకరాయుడుగారు స్వాగతపత్రము సమర్పించిరి. శ్రీ గోరింట చిన వెంకటసోమరాజుగారు, పంచాయతీ గ్రంథాలయవార్షిక నివేదికనుచదివిరి. తాలూకా గ్రంథాలయ సంఘ కార్యదర్శి డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారు 1935-36వ.సం.పు. తాలూకా గ్రంథాలయ సంఘ తృతీయవార్షిక నివేదికను, జమాఖర్చులును చదివిరి. అంతట శ్రీయుత శనివారపు సుబ్బారావుగారు ప్రారంభోపన్యాసకులగు శ్రీయుత ఎజ్జుమిల్లి నారాయణమూర్తి పంతులుగారిని సభికులకు పరిచయమొనర్చిరి.

శ్రీయుత నారాయణమూర్తిగారు గ్రంథాలయములు రాజకీయ విజ్ఞానమునకు ఎట్లుపకరించునో, ప్రపంచపరిస్థితులు, నూతనరాజ్యాంగసంస్కరణములు, ప్రజలబాధ్యతలు, మున్నగు విషయములు తెలిసికొనుట ఎట్లుఅవశ్యమో, వివరముగా, సుమారు 45 నిముషములు చక్కగ ఉపన్యసించిరి.

అంతట అధ్యక్షులు శ్రీయుత శనివారపు సుబ్బారావు పంతులుగారు లేచి వారు అలంపురమునకు పూర్వపరిచయులనియు, వారికిని అలంపుర పరిసరగ్రామములకును చిరకాలమునుండియు రాజకీయమగు సంబంధము కలదనియు తెలుపుచు పంచాయతులస్థాపనము, వానివలన గ్రంథాలయస్థాపనము మున్నగు ఉద్యమములెట్లు ప్రారంభమైనదియు, గ్రంథాలయోద్యమ వ్యాప్తికిని విద్యావ్యాప్తికిని దేశ స్వాతంత్ర్యము ఎట్లుఅవసరమగునదియు, గ్రంథాలయపరిపాలనలోగల చిక్కులును, వాటిని పరిష్కరింపవలసిన పద్ధతులును తెలుపుచు ఉపన్యసించిరి.

పిమ్మట శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులుగారు గ్రంథాలయోద్యమమునకు తోడ్పడుటకు స్థానికసంస్థలకుగల చిక్కులను వివరించుచు జిల్లాగ్రంథాలయ సంఘము వారు తయారుచేసిన ప్రణాళికను జిల్లాబోర్డువారి రాబోవుసమావేశమున ప్రవేశ పెట్టెదమనియు, యథాశక్తిగ తోడ్పడెదమనియు చెప్పిరి. తదుపరి శ్రీయుతులు ముదిగంటి జగ్గన్నశాస్త్రి, యద్దనపూడి వేంకటరత్నము, దళిక సుబ్బయ్య, వితాల వీరభద్రరావుగార్లును ఉపన్యసించిరి.

డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారు తాలూకా గ్రంథాలయసంఘపు తీర్మానములను చదివి ఆహ్వాన సంఘమువారికి వారుచేసిన చక్కటి యేర్పాటులకు కృతజ్ఞతాభివందనములు సమర్పించిన పిమ్మట సభ సాయంకాలము 7 గంటలకు ముగిసెను.

## వార్షిక నివేదిక

సంఘస్థాపనము :— ఈ తాలూకా గ్రంథాలయ సంఘము, 17-11-33 వ తేదీన కేశవరములో, శ్రీయుత నరసింహదేవర సత్యనారాయణగారి అధ్యక్షతను జరిగిన తాలూకా ప్రథమ గ్రంథాలయ మహాసభయందు స్థాపింపబడినది.

గ్రంథాలయయాత్ర :— 1935 ఫిబ్రవరి, మార్చి నెలలలో శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్యపంతులుగారి నాయకత్వమున, తాలూకా గ్రంథాలయ యాత్ర 20 దినములు జయప్రదముగా జరిగి గ్రంథాలయముల సంఖ్య 38 నుండి 51 కి పెరుగుటయేగాక, తాలూకా గ్రంథాలయోద్యమ చరిత్రకు పూర్తి వివరములు గ్రహింపబడెను.

ద్వితీయసభ :— ద్వితీయ గ్రంథాలయ మహాసభ శ్రీయుత అచ్యుదేవర కాశీశ్వరరావుగారి అధ్యక్షతను, పెంటపాడులో 6-7-35 వ తేదీన, శ్రీ శ్రీనివాస గ్రంథాలయమువారి యాజమాన్యమున జరిగెను.

తృతీయ సభ :— తృతీయ గ్రంథాలయ మహాసభ ఏప్రియలు మాసములోనే జరుగవలసియుండినను, కారణాంతరములచే నేటివరకు జరుగలేదు. గ్రంథాలయోద్యమములో విశేషానుభవముగల శ్రీయుత ఎఱ్ఱమిల్లి నారాయణమూర్తి పంతులుగారును, శ్రీయుత శనివారపు సుబ్బారావు పంతులుగారును ఈ సభ నలంకరించుట ముందు సంవత్సరపు కార్యక్రమమునకు మా కెంతయు శుభసూచకము.

గ్రంథాలయములు :— ఈ తాలూకాలోని గ్రామముల సంఖ్య 110; ఈ సంవత్సరాంతమునకు గ్రంథాలయములు 51 నుండి 57 కు పెరిగెను. ఇప్పుడు తాలూకా యందలి సగము గ్రామములలో గ్రంథాలయములు కలవు. ఇందు 36 పంచాయతీ గ్రంథాలయములు; 18 కమిటీ గ్రంథాలయములు; 3 జిల్లాబోర్డు గ్రంథాలయములు.

గ్రంథాలయ సంఘము :— గ్రంథాలయ సంఘమునకు, ఈ 57 గ్రంథాలయముల ప్రతినిధులును, మరికొందరు వ్యక్తులును సభ్యులుగా చేరి 22 గురు కార్యనిర్వాహకవర్గ సభ్యులు, వారిలోనుండి అధ్యక్షుని, ఉపాధ్యక్షుని, కార్యదర్శిని, సంయుక్త కార్యదర్శిని ఎన్నుకొనిరి. ఈ 57 గ్రంథాలయములను 12 కూటములుగ విభజించి ఒక్కొక్క కూటమునందుగల 5, 6 గ్రంథాలయములకు ఒక్కొక్కరు బాధ్యత వహించుచు, తమ సొంత ఖర్చులతోనే గ్రంథాలయములకు తరచు వెళ్ళుచు, గ్రంథాలయ నిర్వాహకులకు తోడ్పడుచుండిరి.

కార్యదర్శులు :— వారమునకొక గ్రంథాలయము చొప్పున, తాలూకా యందలి అన్ని గ్రంథాలయములకు, ఆయా గ్రూపు డైరెక్టరులతో వెళ్ళియుంటిని. సంయుక్త కార్యదర్శి శ్రీయుత పుట్టా సుబ్బారావుగారు నాతో చాల గ్రంథాలయ

ములకు వచ్చి నాకెంతయు తోడ్పడిరి. మేము గ్రంథాలయములకు వెళ్ళినప్పుడు గ్రంథాలయ నిర్వాహకులను సమావేశపరచి ఆంధ్రదైనిక పత్రిక లేనిచోట, దానికి ఆర్డరు ఇచ్చియు, గ్రంథాలయములకు చందాదార్లను చేర్పించియు, రిజిష్టర్లు లేనిచోట ప్రారంభించి అవి వ్రాయవలసిన పద్ధతులను తెల్పియు, కొన్నిచోట్ల వార్షిక సభలను ఏర్పాటు చేసియు, కొన్నిచోట్ల రిజిష్టర్లు గ్రంథాలయ పరిపాలనమునుండి సలహానిచ్చియు, కొన్నిచోట్ల నూతన గ్రంథాలయమునకు ఆర్డరిచ్చియు, గ్రంథాలయములు లేని గ్రామములలో కొన్నింటియందు గ్రంథాలయములను పెట్టించియు కృషి చేయుచుంటిమి.

నూతన గ్రంథాలయములు :– 1. పడాల 2. ముద్దాపురము 3. మారంపల్లి 4. ఉప్పాకపాడు 5. నంపమూరు 6. చోడవరములలో నూతన గ్రంథాలయములు పెట్టిరి.

వార్షికోత్సవములు :– 1. తాడేపల్లిగూడెము శ్రీ శారదా గ్రంథాలయము 2. వల్లూరు శ్రీ లక్ష్మీనరసింహ గ్రంథాలయము 3. పెదతాడేపల్లి శ్రీ సరస్వతీ గ్రంథాలయము 4. పెంటపాడు శ్రీ శ్రీనివాస గ్రంథాలయముల వార్షికోత్సవములు జరిగెను.

గ్రంథాలయ భవనములు :– 1. మాధవరములోని శ్రీ భారతి గ్రంథాలయమునకును 2. పడాలియందలి శ్రీ రామగ్రంథాలయమునకును సొంత భవనములు నిర్మింపబడి, వాని ప్రవేశ మహోత్సవములు జరుపబడెను.

గ్రాంటులు :– గవర్నమెంటు గ్రాంటునుండి మాధవరము గ్రంథాలయమునకు రు 114 లును, తాడేపల్లిగూడెము గ్రంథాలయమునకు రు 114 లును, ఉంగుటూరు, పెదనింద్రకొలను గ్రామములలో పీపిల్స్ లైబ్రరీ అసోసియేషన్ క్రింద రిజిష్టరు కాబడిన రెండు గ్రంథాలయములకు చెరి యొక పాతిక రూపాయలును ఇయ్యబడినవి. పంచాయతీ గ్రంథాలయములకుగాని, రిజిష్టరుకాని కమిటి గ్రంథాలయములకుగాని, ఎట్టి గ్రాంటును లభింపలేదు. జిల్లాబోర్డువారు వారి యాజమాన్యముననున్న మూడు గ్రంథాలయములకు అయిన ఖర్చులు పెట్టుట తప్ప తక్కిన గ్రామ గ్రంథాలయముల కెట్టి సహాయమును చేసియుండలేదు.

పత్రికలు :– ఆంధ్రపత్రికాధిపతులు, గ్రంథాలయ సంఘమువారు సిఫార్సు చేసిన గ్రంథాలయములకు, దైనిక ఆంధ్రపత్రికను రు 18 లకు ఇచ్చుచుండుటవలన, ఈ అవకాశమును తీసుకొని, చాల గ్రంథాలయములు, దైనిక పత్రికను తెప్పించుచున్నవి. మరియు కృష్ణాపత్రిక, భారతి, గృహలక్ష్మి, గ్రంథాలయ సర్వస్వము, మున్నగు పత్రికలు కొన్ని గ్రంథాలయములు తెప్పించుచున్నవి. జిల్లాబోర్డు గ్రంథాలయములు, ఇంగ్లీషు దైనిక పత్రికలను, మరికొన్ని మాసపత్రికలను కూడ తెప్పించుచున్నవి.

గ్రంథములు :– గ్రామ గ్రంథాలయములు, ధనసహాయము లేనికారణమున నూతన గ్రంథములను తెప్పించియుండలేదు.

ప్రకటనములు :- గ్రంథాలయ నిర్వహణకు తోడ్పడుటకు అప్పుడప్పుడు అన్ని గ్రంథాలయములకును కొన్ని ప్రకటనములు పంపియుంటిమి. రిజిష్టర్లు వ్రాయు పద్ధతులు, మాస నివేదికలు, గ్రంథములను వర్గీకరణ పద్ధతిని విభజించుట, మహాపురుషుల వర్ధంతులజాబితా, గ్రంథాలయ నిబంధనలు మున్నగు విషయములను గురించి, యీ ప్రకటనము పంపబడెను.

కార్యనిర్వాహకవర్గ సమావేశములు :- ఈ సంవత్సరము కార్యనిర్వాహక వర్గము 5 పర్యాయములు, వివిధ గ్రామములయందలి గ్రంథాలయములవద్ద సమావేశమై ముఖ్యవిషయముల చర్చించి తీర్మానించియుండిరి.

పీపిల్సు లైబ్రరీ ఎసోసియేషను :- ఈ తాలూకాలో శ్రీయుత దశిక సుబ్బయ్యగారు ఉపాధ్యాయులుగనుండియు, గ్రంథాలయోద్యమమునందు విశేషానుభవముగలిగి, పై సంఘమును నెలకొల్పి, దానికనుబంధముగా ఉంగుటూరు, పెదనిండ్రకొలను గ్రామములందు గ్రంథాలయములు నెలకొల్పి, ఉపాధ్యాయులయు, విద్యార్థులయు సహాయముతో ఉద్యమవ్యాప్తికి చాల పాటుపడుచున్నారు.

జమాఖర్చులు :- సభ్యులనుండి ఆదాయము రు 16-0-0 లు. వ్యయము రు 24-0-0 లు. ద్వితీయ గ్రంథాలయసభకు రు 14-0-0 లు పోస్టు ఖర్చులు రు 6-0-0 లు స్టేషనరీ ఖర్చులు రు 2-0-0 లు చిల్లరఖర్చులురు 2-0-0 లు.

పోలీసువారి సోదా :- పోలీసువారు రాచెర్ల, గణపవరము, పెంటపాడు, ఉంగుటూరు, తాడేపల్లిగూడెము, రాచూరు, అలంపురము గ్రామములలోని గ్రంథాలయములను సోదాచేసిరి. నిషేధించిన గ్రంథముల కొన్నింటిని, నిషేధింపని గ్రంథముల కొన్నిటిని పట్టుకొని వెళ్ళిరి. కొన్నిచోట్ల సెర్చివారంట్లు లేవు. పట్టుకొని వెళ్ళిన గ్రంథములకు కొన్నిచోట్ల రసీదు లియ్యలేదు. కొన్ని గ్రంథములను కొన్నిచోట్ల తిరిగి యిచ్చిరి.

జిల్లా విద్యాశాఖాధికారి అప్రూవలు :- తాలూకా గ్రంథాలయ సంఘము తరపున 600 తెలుగు గ్రంథముల జాబితా నొకటి తయారుచేసి, జిల్లా విద్యాశాఖాధికారి అప్రూవలుకు పంపియుంటిమి. గవర్నమెంటు నిషేధింపని గ్రంథములను కొన్నింటిని వీరు అప్రూవుచేసి యుండలేదు. నిషేధింపబడిన గ్రంథముల జాబితా సాలునకొకసారి అన్ని గ్రంథాలయములకు పంపినచో అట్టి గ్రంథములను తీసివేయుటకు వీలుండెడిది. జిల్లా విద్యాశాఖాధికారిచే అప్రూవలు చేయబడిన తాలూకా గ్రంథాలయ సంఘమువారి గ్రంథముల జాబితానుండి పంచాయతీబోర్డు గ్రంథాలయములకు మరల జిల్లా విద్యాశాఖాధికారికి వ్రాయ నక్కరలేకుండగనే గ్రంథములు తెప్పించుటకు అనుమతి యిచ్చుట ముఖ్యావసరము.

కృతజ్ఞత :- రైతు ఋణసమస్య, వయోజనవిద్య మున్నగు గ్రంథముల నుచితముగా అన్ని గ్రంథాలయములకు సప్లయిచేసిన శ్రీయుత శనివారపు సుబ్బారావు పంతులుగారికి మా కృతజ్ఞతాభి వందనములు.

కర్తవ్యము :- వయోజన విద్యావ్యాప్తికి చేయవలసిన దెంతయో కలదు. ఇది కొనసాగుటకు గ్రంథాలయములే ముఖ్యాధారములు. అందులకు 1. గ్రంథాలయము లేని గ్రామముల గ్రంథాలయములు నెలకొల్పవలెను. 2. రాత్రి పాఠశాలలు నెలకొల్పి వార్తాపత్రికా పఠనము, పురాణపఠనము, సద్గ్రంథపఠనము గ్రామస్థుల కలవాటు చేయవలెను. 3. చదువురాని యువకులకు అక్షరజ్ఞాన మొసంగవలెను. 4. వార్షికోత్సవములు, వర్ధంతులు, సభలు ఏర్పాటుచేసి వయోజనవిద్య కుపకరించు ఉపన్యాసము లిప్పింపవలెను. 5. చర్చా సంఘములు (డిబేటింగు సొసైటీలు) నెలకొల్పి గ్రామస్థులు అందు పాల్గొనుటకు అవకాశము కల్పింపవలెను. 6. వేసవి సెలవులలో కాలేజీ విద్యార్థులను, నిరుద్యోగులను గ్రామములలో విద్యాప్రబోధముచేయుటకు ప్రోత్సహించవలయును. ఈ కార్యక్రమమునకు గ్రంథాలయ సేవకులు హెచ్చుగ రావలెను. భగవంతుడీ సేవకులకు దృఢసంకల్పమును కార్యదీక్షయు నొసంగుగాకయని ప్రార్థించుచున్నాను.

— గ్రంథాలయ సర్వస్వము, సంపుటము 10 సంచిక 6 నుండి

అనుబంధము : ౩

# గుంటూరుమండల గ్రంథాలయ సంఘము నిబంధనలు

౧. పేరు : ఈ సంఘము గుంటూరు మండల గ్రంథాలయ సంఘము అని వ్యవహరింపబడును.

౨. కేంద్ర గ్రంథాలయము : బాపట్ల తాలూకా వేటపాలెము నందలి శ్రీ సారస్వత నికేతనము మండల కేంద్ర గ్రంథాలయముగ పరిగణింపబడును.

౩. కార్యస్థానము : సంఘ కార్యస్థానము కార్యదర్శి యుండు గ్రామమున నుండును.

౪. ఉద్దేశములు :

1. గుంటూరు మండలమునగల ప్రతి గ్రామమునందును గ్రంథాలయములు, పఠనాలయములను స్థాపింపచేయుట, తద్వారా గ్రంథాలయోద్యమమును వ్యాపింప జేయుట.

2. మ్యాజికులాంతరులు, సినిమెటోగ్రాఫులు, గృహ బయస్కోపులు మున్నగు సాధనముల సహాయముతో మండలమునందదంతటను ప్రచారోపన్యాసముల నిప్పించుచు ప్రజలలో జ్ఞానమును ప్రబోధించుట.

3. సంచార గ్రంథాలయములను నెలకొల్పియు, సాంఘికాభివృద్ధికరములగు సద్గ్రంథ ప్రకటనను, రచనను ప్రోత్సహించియు దేశ హితైక విషయములపై కరపత్రములను ప్రకటించియు, దేశసేవ, మానవసేవ, భగవత్సేవ మున్నగు పరమార్థ కార్యములొనర్చియు ప్రజలలో జ్ఞానాభివృద్ధిని కలుగజేయుట.

4. జ్ఞానాభివృద్ధికి సాధనములుగనుండు జాతీయ సంస్థాపనలను నెలకొల్పుట, ప్రోత్సహించుట, ఉద్ధరించుట.

5. ఆంధ్ర జాతీయ వికాసమునకును, ఆంధ్ర వ్యక్తి వికాసమునకును, ఆంధ్ర భాషావికాసమునకును కృషియొనర్చుట.

6. ఈ సంఘోద్దేశములతో ఏకీభవించు ఉద్దేశముగల యితర సంఘములతో కలిసి పనిచేయుట, అట్టివానిని తనలో కలుపుకొనుట.

7. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు శాఖా సంఘముగనుండి దాని యుద్దేశములను నెరవేర్చుచుండుట.

౫. కార్యనిర్వాహణము : ఈ సంఘ కార్యకలాపములు 1. సాధారణ సంఘము 2. కార్యనిర్వాహకవర్గములచే నిర్వహింపబడును.

౬. సాధారణ సంఘము : ఈ సంఘమునందలి సభ్యత్వము దిగువరీతిగ విభజింపబడును.

1. గౌరవసభ్యులు: మండలములో ఏగ్రంథాలయమునకైన ఒకేతూరి రు 1000/- లకు తక్కువగాని గ్రంథ, ధన, వస్తు, వాహనాదిరూపములలో విరాళ మిచ్చువారు.

2. శాశ్వతసభ్యులు: మండలగ్రంథాలయ సంఘనిధికి ఒకేసారి రు 15/- లకు తగ్గని విరాళమిచ్చువారు.

3. సామాన్యసభ్యులు: సంవత్సరమునకు రూపాయకు తగ్గనిచందా యిచ్చువారు.

4. ప్రతినిధిసభ్యులు:

(అ) సం॥ 1కి రు 1-0-0 చందా నొసగు గ్రంథాలయ, పఠనాలయముల అధ్యక్ష కార్యదర్శులు.

(ఆ) సం॥1కి రు 2-00 చందానొసగు స్థానికసంస్థలు, సహకారసంస్థల ప్రతినిధులు

(ఇ) సం॥ 1కి రు 2-0-0 చందానొసగు తాలూకా గ్రంథాలయసంఘముల అధ్యక్ష కార్యదర్శులు.

(ఈ) అధికారసభ్యుడు: కేంద్రగ్రంథాలయ భాండాగారి అధికారరీత్యా సభ్యుడు

౭. కార్యనిర్వాహకవర్గము: ఈ సంఘకార్యనిర్వాహక వర్గములో ఒక అధ్యక్షుడు, ఇద్దరుపాధ్యక్షులు, ఒక కార్యదర్శి, ఇద్దరు సహాయ కార్యదర్శులు, 9మంది సభ్యులు చేరి దీని కార్యనిర్వాహక సంఘముగ నుందురు.

౮. సాధారణ సంఘ సభలు: సం॥ నకు అధమపక్ష మొక పర్యాయమైనను సాధారణ సంఘము సమావేశమగుచుండవలెను. సభకు కనీసము 12మంది సభ్యులు హాజరు కావలెను. ఈ సంఖ్యపూర్తిగానిచో సభను మరొక్క నిర్ణీత దినమునకు నియమిత స్థలమున పునస్సమావేశపరచి కనీస సంఖ్యతో నిమిత్తములేకనే హాజరైన సభ్యులతో సభావ్యవహారములను నిర్వహించవచ్చును.

౯. కార్యనిర్వాహకవర్గ సభలు: సామాన్యముగ నెలకొక పర్యాయము, సాధ్యమైనంతవరకు తడవకొక తాలూకాలో సమావేశమగుచుండవలెను. సభకు కనీసం 5 మంది సభ్యులు హాజరుకావలెను. కనీస సంఖ్యయేర్పడనిచో మరొకతేదీన స్థలకాలనిర్ణయములు గావించి పునస్సమావేశము జరిపి హాజరైన సభ్యులతో సభావ్యవహారములు నిర్వహించవచ్చును.

౧౦. సాధారణసంఘవిధులు: కార్యనిర్వాహక వర్గసభ్యులను సంవత్సరమునకొకసారి యెన్నుకొనుట, వ్యవహారనిర్వహణకు వలయు నిబంధనలను నిర్మించుట, మార్చుట, తీసివేయుట, క్రొత్తవానిని చేర్చుట, ఆదాయవ్యయమదింపును అంగీకరించుట, ఉద్యమవ్యాప్తిని గావించుట మున్నగు సమస్తకార్యముల విచారణ చేయుచుండుట సాధారణసంఘ విధులు. ఏవిషయమునందైనను సాధారణ సంఘతీర్మానమే అఖరు తీర్మానముగనుండును.

౧౧. కార్యనిర్వాహక వర్గ విధులు: సంవత్సర ఆదాయవ్యయముల మదింపునుతయారుచేయుట, చందాలను, విరాళములను, ఇతర స్థిరచరాస్తులను సంపాదించుట, ఆదాయ వ్యయములను పరిపాలించుట, అవసరమునను సరించి అప్పులుచేయుట తీర్చుట, ధన వసతినిబట్టి సంఘోద్దేశములను ఆచరణయందు బెట్టుట, సంఘమునకు కావలసిన సిబ్బందిని నియమించుట, శిక్షించుట, తీసివేయుట, కార్యనిర్వహణ సౌలభ్యము కొరకు ఉపసంఘములను నియమించుట, సంవత్సరంమధ్యలో కార్యనిర్వాహక సంఘములో వచ్చు ఖాళీలను భర్తీచేయుట మున్నగునవి కార్యనిర్వాహక సంఘము విధులు.

౧౨. ఉద్యోగుల విధులు:-

1. కాలపరిమితి: సాధారణముగా ఉద్యోగులు, కార్యనిర్వాహక సభ్యులుకూడ ఎన్నికైననాటినుండి సంవత్సరంవరకు తమతమ పదవులలోనుందురు. ఎన్నికలు ఆలస్యముగ జరుగుచో క్రొత్తయెన్నికలగువరకు పాతవారే తమ ఉద్యోగములలోనుండి వ్యవహారములను నిర్వహించుచుండవలెను.

2. అధ్యక్షుని విధులు: సాధారణ సంఘసభలకు, కార్యనిర్వాహక వర్గ సభలకు అధ్యక్షతవహించి సంఘముయొక్క స్థిరచరాస్తులపైనను, లెక్కలపైనను విచారణాధికారమును కలిగియుండుట, ఇతర ఉద్యోగులు చేయుపనులను తనిఖీచేయుచుండుట, తానుకోరిన 10 దినములలోపల కార్యదర్శి సభను సమావేశపరచనిచో తాను స్వయముగ సభను సమావేశపరచుట, సంఘవ్యవహారములన్నింటిని సక్రమపద్ధతిని పరిపాలించుచుండుట అధ్యక్షుని విధులు.

3. ఉపాధ్యక్షుల విధులు: అధ్యక్షుడు హాజరు లేనప్పుడు ఉపాధ్యక్షులలో నొకరు సంఘసభలకధ్యక్షత వహించుట, సంఘపుటాస్తిని, సంఘవ్యవహారములను తనిఖీ చేయుచుండుట ఉపాధ్యక్షులవిధులు.

4. కార్యదర్శి విధులు: చందాలు, విరాళములు, ఇతర ఆస్తిని సంపాదించుట, ఉద్యమవ్యాప్తికై ప్రచారమొనర్చుట, సంఘమునకు సంబంధించిన యావత్తు లెక్కలు, దస్తావేజులు, రికార్డులు వగైరాలను తనదగ్గరనుంచుకొని వ్యవహరించుట, తీర్మానముల ప్రకారం ధనమును వినియోగించుట, కనీసం ౕ రోజులవ్యవధితో సంఘ సభ్యులకు ప్రకటనలనుపంపి సంఘ సమావేశములు జరుపుట, సాధారణ సంఘసభ్యులు 10 మందిగాని, కార్యనిర్వాహక వర్గసభ్యులు ౕ గురుగాని కోరినప్పుడు ఆయా సభలను సమావేశపరచుట, సంఘక్షేమాభివృద్ధికరమగు వ్యవహారములనన్నిటిని నిర్వహించుట కార్యదర్శి విధులు.

౧౩. ఉపసంఘములు: కార్యనిర్వహణ సౌకర్యమునిమిత్తం ఉపసంఘములు నియమింపబడవచ్చును. అట్టిఉపసంఘములందు సంఘాధ్యక్షుడు ఉద్యోగరీత్యా అధ్యక్షుడగును. కార్యదర్శి సభ్యుడుగ ఎన్నుకొనబడని ఉపసంఘమునకు సభ్యులలో నొకరిని వ్యవహర్తగ ఎన్నుకోవలెను.

౧౪. తాలూకా గ్రంథాలయ సంఘములు: ఈ సంఘములు నిర్మింపబడినపుడవియెల్ల ఈ సంఘమున కంగములుగ నుండును. తాలూకా సంఘాధ్యక్ష, కార్య

దర్శులు మండల సంఘమునందు సభ్యులుగ నుందురు. మండల సంఘము యొక్కయు, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము యొక్కయు నిబంధనలకును, ఉద్దేశ్యములకును వ్యతిరేకముగాని పద్ధతిలో తాలూకా సంఘములు వ్యవహరించుచుండవలెను.

౧౫. శాఖాసంఘములు: మండలములోని వివిధస్థానికసంస్థలు, సహకార సంఘము లాదిగా గలవి ఈ సంఘమునకు శాఖలుగ చేరవచ్చును. అట్టి ప్రతి సంఘము సంవత్సరమునకు రు 2-0-0 చందా నొసంగవలెను. ప్రతి సంఘము ఒక్కొక్క ప్రతినిధి నెన్నుకొనవలెను. ఈ ప్రతినిధులు చందా చెల్లించిన సంవత్సరమునకు మండల సంఘ సభ్యులుగ నుందురు.

౧౬. లెక్కలు — తనిఖీ: ఈ సంఘముయొక్క లెక్కలు వగైరాలు ప్రతి సంవత్సరము కార్యనిర్వాహకవర్గమువారిచే నియమింపబడిన ఆడిటరుచే తనిఖీ చేయబడవలెను. ఇట్లు తనిఖీ చేయబడిన లెక్కలు కార్యనిర్వాహకవర్గముచే అంగీకరింపబడవలెను.

౧౭. ద్రవ్య వినియోగ విధానము: (1) మండల గ్రంథాలయసంఘ వ్యవహారములకు శాశ్వతసభ్యు లొసంగు విరాళములపై రాగల సాలీనా వడ్డీయు, సామాన్య సభ్యు లొసంగు చందా ధనమును, గ్రంథాలయములు, పఠనాలయములు, శాఖా సంఘముల నుండి వసూలగు చందా ధనమునుండి తాలూకా గ్రంథాలయ సంఘములకు, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు ఇచ్చు దామాషా పోను నిల్వ ధనము వినియోగింపబడును.

(2) తాలూకా గ్రంథాలయ సంఘము లేర్పడినప్పుడు ఆ సంఘములకు ఆయా తాలూకాలలోని గ్రంథాలయములు, పఠనాలయములు, శాఖా సంఘములనుండి సాలీనా వసూలగు చందా ధనమునుండి రు 1-0-0 కు రు 0-8-0 చొప్పున దామాషా యివ్వబడును.

౧౮. గ్రంథాలయ చరిత్ర: ఈసంఘము ప్రతిసంవత్సరము మండలగ్రంథాలయ చరిత్రను ప్రకటించుచుండవలెను.

౧౯. గ్రంథాలయమహాసభ: మండలగ్రంథాలయ మహాసభను యేటేట సామాన్యముగ డిసెంబరు నెలలో సంవత్సరమున కొక్కొక తాలూకాలో జరుపుచుండవలెను. మహాసభ జరుగు తాలూకాయందే ఆహ్వానసంఘ మేర్పడి మండల సంఘము వారి సలహాతో వివిధ గ్రంథాలయములవారు గావించు సూచనలను గమనించి ఆహ్వాన సంఘమువారు మహాసభాధ్యక్షుని యెన్నుకొనవలెను. ఆహ్వాన సంఘమువారు వసూలు చేసిన ధనములో మహాసభ నిర్వహణ ఖర్చులు పోను మిగిలిన మొత్తమును మండల గ్రంథాలయ సంఘమునకు చెల్లించవలెను.

౨౦. ఇతర విషయములు: సాధారణ సంఘ సభ్యులు 10 మందిగాని, కార్యనిర్వాహకవర్గ సభ్యులు 5 గురుగాని కోరినప్పుడు కార్యదర్శి ఆయా సభలకు, నియమిత వ్యవధితో సభ్యులందరికీ సభా ప్రకటన పత్రములను పంపి జరుపవచ్చును.

అనుబంధము : ౪

# తెనాలితాలూకా గ్రంథాలయ సంఘము - నిబంధనలు

౧. పేరు : ఈ సంఘము పేరు తెనాలితాలూకా గ్రంథాలయ సంఘము.

౨. ఉద్దేశ్యములు:

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘముయొక్క శాఖగా తెనాలితాలూకాయందంతటను గ్రంథాలయోద్యమ ప్రచారమును సాగించుట యీ సంఘోద్దేశ్యము. ఇందులకుగాను,

(అ) విజ్ఞాన వ్యాప్తికి సాధనములగు గ్రంథాలయ పఠనాలయ సంస్థలలో పరస్పర మైత్రిని వృద్ధిపొందించి, తద్వారా ప్రజానీకమున, అందు ముఖ్యముగ బాలుర లోను, స్త్రీలలోను, నిమ్న జాతులలోను విజ్ఞానవ్యాప్తిని, విద్యాభిరుచిని కలిగించ ప్రయత్నించుట.

(ఆ) తెనాలి తాలూకాలోనున్న సార్వజనిక విజ్ఞానవ్యాప్తికి తోడ్పడు గ్రంథాలయ పఠనాలయాది సంస్థలనన్నిటిని యీ సంఘమునకు సభ్యులుగా చేర్చుట, ఇట్టి సంస్థలు లేనిచోట్ల వీని ప్రతిష్ఠాపనకై కృషిసల్పుట.

(ఇ) అవకాశమునుబట్టి తాలూకాలో ఒకచోటగాని, అంతకంటె ఎక్కువ స్థలములలోగాని, కేంద్రగ్రంథాలయములు స్థాపింపబడి పనిచేయునట్లుచూచుట.

(ఈ) అప్పటప్పట సంచార గ్రంథాలయములును, ప్రత్యేక గ్రంథాలయములును (స్త్రీ, బాల, పాఠశాల, బోటు, బందిఖానా, వైద్యాలయ గ్రంథాలయములు వగైరా) స్థాపింపబడునట్లు ప్రోత్సహించుట.

(ఉ) తాలూకాలోని వివిధప్రాంతముల నేటేట గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ యేర్పాటుచేయుట.

(ఊ) జనుల విజ్ఞానాభ్యుదయమునకును, గ్రంథాలయోద్యమ ప్రచారమునకును తోడ్పడు రకరకముల గ్రంథములు, కరపత్రములు ప్రచురించుట; ఉపన్యాసములు, ప్రదర్శనములు, తాలూకాలోని అన్ని ప్రాంతములలోను విరివిగా ఏర్పాటు చేయుట.

(ఋ) ఇట్టి ఉద్దేశ్యములుగల యితరప్రతిష్ఠాపనలతో కలసి పనిచేయుట, వానితో సంబంధమును కలుగజేసికొనుట.

౩. కార్యనిర్వహణ

ఈ సంఘముయొక్క కార్యనిర్వహణ యీ క్రింది సంఘములవలన జరుపబడును.

(అ) సాధారణ సంఘము (ఆ) పాలకవర్గము

(అ) సాధారణ సంఘము: ఈ క్రిందివారు సాధారణ సంఘ సభ్యు లగుదురు.

(౧) సంవత్సరమునకు నాల్గణాలు, అంతకుపైన చెల్లించు వ్యక్తులు.

(౨) సంవత్సరమునకు రూపాయి,అంతకుపైన చెల్లించు గ్రంథాలయాదిసంస్థలు.

(3) ఒకే పర్యాయము ఐదు రూపాయలుగాని, అంతకు ఎక్కువగాని చెల్లించు వ్యక్తులు, పదునైదు రూపాయలుగాని, ఎక్కువగాని చెల్లించు గ్రంథాలయాది సంస్థలు – వీరు సంఘమున శాశ్వత సభ్యత్వము గలిగియుందురు.

(ఆ) పాలకవర్గము: సాధారణ సంఘ సభ్యులలోనుండి ప్రతి సంవత్సరమును ౧ అధ్యక్షుడు, ౧ ఉపాధ్యక్షుడు, ౧ కార్యదర్శి, ౧ సహాయ కార్యదర్శి, ౧౧ మందికి మించని పాలకవర్గ సభ్యులు ఎన్నుకొనబడుదురు.

ఇట్లెన్నుకొనబడిన పాలకవర్గము, యీ సంఘ వ్యవహారములను నిర్వహించు చుండును.

౪. సభలు

(క) ఈ సంఘముయొక్క సాధారణ సంఘ సభలు కనీసము సంవత్సరమున కొకమారును, పాలకవర్గ సభలు కనీసము సంవత్సరమునకు నాల్గు పర్యాయములును తప్పక కూడుచుండవలెను.

(చ) ఇందు సాధారణ సంఘ సభలకు కనీసము పదునైదుగురును, పాలకవర్గము నకు కనీసము ౫ మందియును తప్పక హాజరు కావలెను. ఈ నిర్ణీత సంఖ్య హాజరు కానప్పుడు, సభ్యులసమ్మతులు పోస్టుద్వారా తెప్పించి, అధిక సంఖ్యాకుల అభిప్రాయ ములు కార్యదర్శి అమలు జరుపవచ్చును.

(ట) సాధారణ సంఘ సభలు పది దినములకును, పాలకవర్గ సభలు ఐదుదినముల కును తక్కువగాని గడువుతో పిలువబడవలయును. అవసర సమావేశములకు, సాధారణ సంఘ సమావేశములకు ఐదు దినములకును, పాలకవర్గ సమావేశములకు ౨౪ గంటలకును తక్కువగాని గడువు ఉండవలెను. సాధారణ సంఘ సభల ప్రకటనలు పత్రికలద్వారా వెల్లడించినను, పాలకవర్గ సభల ప్రకటనలు పోస్టుద్వారా సభ్యుల కందరికీ అందజేయ వలెను.

౫. సాధారణ సంఘ విధులు

(క) సంవత్సరమున కొక పర్యాయము పాలకవర్గము నెన్నుకొనుట.

(చ) సంఘముయొక్క వార్షిక ఆదాయ వ్యయములను, కార్య నివేదికను అంగీక రించుట.

(ట) సంఘ నిబంధనలలో అవసరమైన మార్పులుజేయుట, ఉన్నవానిని రద్దు చేయుట, క్రొత్తవానిని చేర్చుట.

(త) సంఘమునకు సంబంధించిన అన్ని విషయములలోను అంత్యపరిష్కారము చేయుట.

౬. పాలకవర్గపు విధులు

(క) సంఘోద్దేశ్యముల నిర్వహణమున కవసరమైన తీర్మానముల జేయుట.

(చ) కార్యనిర్వహణమున కవసరమైన ఉపసంఘముల నిర్మించుట, రద్దు చేయుట.

(ట) కావలసిన సిబ్బందిని ఏర్పాటు చేయుట, వారి పనిని పరిశీలించుట, వారిని తొలగించుట.

(త) సంఘమునకు వలయు ధనమును సేకరించి, దానిని అవసరముల నిమిత్తము వెచ్చించుచు సరియైన లెక్క లుంచుట, ధనమును భద్రపరచుట కేర్పాటు చేయుట.

(ప) పాలకవర్గములో సంవత్సరము మధ్య సంభవించు ఖాళీలను భర్తీచేయుట.

(గ) సంఘోద్దేశ్యములకు భిన్నముగాని యితర కార్యములను నిర్వహించుట.

౭. అధ్యక్ష, ఉపాధ్యక్షులు

(అ) అధ్యక్షుని విధులు :

(౧) సంఘమునకు సంబంధించిన సమస్త వ్యవహారములందును బాధ్యత వహించుట.

(౨) సంఘ సమావేశము లన్నింటికిని అధ్యక్షత వహించుట.

(3) సంఘముయొక్క కార్యనిర్వహణమున కన్నివిధముల సహాయకారిగా నుండి, సక్రమనిర్వహణమునకు తగుచర్య తీసికొనుట.

(ఆ) ఉపాధ్యక్షుని విధులు: అధ్యక్షుడు లేనిసమయముల నాతని విధులన్నింటిని ఉపాధ్యక్షుడు నిర్వహించును.

౮. కార్యదర్శులు

(అ) కార్యదర్శి విధులు:

(౧) సంఘ సమావేశముల నేర్పాటు చేయుచు వానికార్యక్రమము వ్రాయుట; వాని తీర్మానముల నమలు జరుపుట.

(౨) సంఘపు రికార్డును తన యధినమున నుంచుకొని కాపాడుచు, సంఘ పక్షమున నుత్తర ప్రత్యుత్తరముల జరుపుట.

(3) సంఘముతాలూకు ధనమును తనవద్ద నుంచుకొని, దానికి తగిన నిదర్శ నములతో లెక్కల వ్రాయుచు, సంవత్సర నివేదికలను, ఆదాయ వ్యయములను సిద్ధపరచి సాధారణ సంఘము ఎదుట నుంచుట.

(౪) కార్యవర్గ సభ్యుల తోడ్పాటుతో సంఘమునకు సభ్యులను విరివిగా చేర్చుట, విరాళముల సంపాదించుట, తాలూకా యందంతటను విరివిగా ప్రచారము సాగించుట.

(ఆ) సహాయ కార్యదర్శి విధులు : పైపను లన్నిటియందును కార్యదర్శికి సహాయముగనుండి, కార్యదర్శి సెలవుపై నున్నప్పుడు ఆ విధు లన్నిటిని స్వాయముగ నెరవేర్చుట.

౯. తాలూకా గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ:

(క) గ్రంథాలయోద్యమమునకు సంబంధించిన సమస్యలపై చర్చల జరిపి, అవ సరమగు తీర్మానముల జేయునిమిత్తము, ప్రతిసంవత్సరము, చైత్రవైశాఖ మాసములలో

ఫిర్కాలన్నిటిలోను సంవత్సరమునకొక్క ఫిర్కాలో తాలూకా గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ జరుపుచుండవలెను.

(చ) సభ జరుగు తేదీకి పూర్వమున్న సంఘసభ్యులుగాక, ప్రతిగ్రంథాలయము, పఠనాలయము, సారస్వత సంఘము పంపు ఇద్దరుప్రతినిధులీ సభలో పాల్గొనవచ్చును. సంఘ సభ్యులుకాని ప్రతినిధులు 0-8-0 లు ప్రతినిధిరుసుమును సంఘమునకు చెల్లించవలెను.

(ఛ) ఈ సభజరుగు ఫిర్కాయందే, దీనిని జరుపుట కాహ్వాన సంఘమేర్పడవలెను. సభజరుగు స్థలమును పాలకవర్గము వారు నిర్ణయింతురు. తేదీని, సభాధ్యక్షుని పాలకవర్గమువారి సలహాతో ఆహ్వానసంఘమే నిర్ణయించుకొనును.

## ౧౦. సంవత్సరము, లెక్కలు:

తెలుగు సంవత్సరాదితో యీ సంఘపు నూతనవత్సరము ప్రారంభమగును. ఈ సంఘము లెక్కలను, ప్రతిసంవత్సరము పాలకవర్గము నిర్ణయించు తనిఖీదారునిచే తనిఖీ చేయించవలెను.

అనుబంధము : ౫

# జిల్లా గ్రంథాలయ మహాసభల తీర్మానములు

## ప్రథమ గంజాంమండల ఆంధ్ర గ్రంథాలయ మహాసభ, టెక్కలి:

౧. ప్రస్తుతము ఐరోపాఖండమునందు జరుగుచున్న ఘోరసంగ్రామమున మన చక్రవర్తిగారికిని, మిత్రమండలివారికిని సంపూర్ణ విజయసుప్రాప్తి త్వరలో కలుగుగాక యని యీసభవారు పరమేశ్వరుని ప్రార్థించుచున్నారు. ఈ ఘోరసంగ్రామమునందు మనప్రభుత్వమువారు జయమొందుటకు వలయు సాధనసామగ్రిని వీలైనంతవరకు సమకూర్చుటకు సంసిద్ధులైయున్నారు.

౨. ప్రస్తుతము గంజాంమండలమున స్థాపింపబడిన గ్రంథాలయములకును, పఠన మందిరములకును జిల్లాబోర్డువారును, తాలూకాబోర్డువారును, మున్సిపాలిటీలును ద్రవ్య సహాయము జేయమని యీసభవారు తీర్మానించుచున్నారు.

౩. పుస్తకభాండాగారములను, పఠనమందిరములను ౧౮౬౦ సం॥ ౨౧ నెంబరు ఆక్టు ననుసరించి రిజిస్టరీ చేయుటకు చెల్లించవలసిన రుసుములేకుండగానే రిజిష్టరీ చేయించుటకు ప్రభుత్వము వారిని యీసభవారు ప్రార్థించుచున్నారు.

౪. గంజాంమండలమునందలి అన్ని గ్రంథాలయములవారు ఆంధ్రదేశగ్రంథాలయ సంఘమువారి పక్షమున ప్రచురింపబడుచున్న గ్రంథాలయసర్వస్వమును తెప్పింపవలెనని ఈసభవారు కోరుచున్నారు.

## చతుర్థ గంజాం మండల ఆంధ్ర గ్రంథాలయ మహాసభ, కళింగపట్నం

౬. (క) గ్రంథాలయ సభలు క్రింది విషయముల గమనించి పనిచేయుట మూలకముగా గ్రంథాలయముల సజీవముగ నుంచవలెనని తీర్మానించుచున్నారు.

1. శిల్ప వస్తువులు అనగా రాగి, ఇత్తడి, రాయి, మట్టి మొదలగువానితో చేయబడిన విగ్రహములు, ఉపకరణములు, అలంకారములు మొదలగునవియును, పురాతన చిత్తరువులు మొదలగువానిని సంగ్రహించి, గ్రంథాలయమందు ప్రదర్శించుట.

2. తమ గ్రామ చరిత్రను వ్రాసియుంచుట. దీని యందు పురాతన చరిత్రయేగాక ప్రస్తుతపు సాంఘిక, ఆర్థిక, నైతిక పరిస్థితులన్నియు అత్యంత విరళముగ నుండవలెను.

3. అన్ని మతములకు సంబంధించిన జాతీయ ఉత్సవములనగా దేవీ నవరాత్రములు శ్రీ కృష్ణ జయంతి మున్నగు పండుగలు పర్వములను, భారతజాతీయ నిర్మాణమునకు తోడ్పడు మహాపురుషుల వర్ధంత్యుత్సవములను జరుపుట.

(చ) ఈ కార్యములన్నియు నిర్వహించుటకును, అనగా నూతన గ్రంథాలయములు స్థాపించుటకును, పోషించుటకును, పురాతన గ్రంథములు ముద్రించుటకును, శిల్పవస్తువులు సంగ్రహించుటకును, జాతీయ ఉత్సవములు సల్పుటకును, ఇంకను గ్రంథాలయోద్యమమును విరివిగా వ్యాపింపజేయుటకును గ్రంథాలయ సభ్యులెల్లరు సంక్రాంతి పండుగ దినములందు జాతీయభిక్షను ద్రవ్యరూపమునను, వస్తురూపమునను వసూలు చేయవలసినది.

7. ఆంధ్రమండలములందున్న మండల గ్రంథాలయము లన్నిటికిని తమ గ్రంథము లన్నిటిని ఉచితముగా నిచ్చుచు గ్రంథాలయోద్యమాభివృద్ధికి చేయూత నొసగుచున్న శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండు సన్సు వారికీ సభవారు వందనముల నర్పించుచున్నారు.

10. గ్రంథాలయములందు పుస్తకభాండాగారమునకుతోడు రాట్నమునకుకూడ తావొసగి పురాణపత్రికాపఠన సమయమందు, తదితర సమయములందు రాట్నము నుత్రిప్పుచు నూలువడుకుటకు సదుపాయములుజేయ నీ సభవారు హెచ్చరించుచున్నారు.

గ్రం. స. VI - 6

విశాఖపట్టణ గ్రంథాలయ ప్రత్యేక మహాసభ, విశాఖపట్టణము :

౧. దేశాభివృద్ధికి సాధనములగు మునుపటి గ్రంథములను యిప్పటి గ్రంథములను సమకూర్పవలయుననియు, యెప్పటి సంగతులు అప్పుడు తెలియుట ఆవశ్యకముగావున యిప్పటికి ఆంధ్ర దినపత్రికను ప్రతి గ్రంథాలయమువారును తప్పక తెప్పించి తాము చదువుటతోడనే తృప్తిని పొందక యితరులకుగూడ చదివి వినిపించి బోధింపవలయుననియు తీర్మానించుచున్నారు.

౨. ఇప్పటికే వడకుట మొదలగు వృత్తులు అభివృద్ధిచేయుటకు ప్రయత్నించు గ్రంథాలయములవారి నభినందించుచు వారు మరింత అభివృద్ధి పని జేయవలయుననియు, తక్కిన గ్రంథాలయములవారుకూడ అట్టి వృత్తు లభివృద్ధి జేయుటకు వెంటనే ప్రయత్నము చేయుదురుగాక యనియు యీ సభవారు తీర్మానించుచున్నారు.

3. గ్రామ పారిశుద్ధ్యమును హెచ్చించుటకును, అనవసర వ్యయప్రయాసలకు కారణమగు తగవులు తమలోతాము తీర్చుకొనునట్లు బోధించుటకును, వైద్యజ్ఞానమును సంపాదించుటకును, హెచ్చుగా ఆయుర్వేద యూనానీ పద్ధతుల ననుసరించి వైద్య సహాయము చేయుటకును, కటికశాలలపాలుగానున్న పశువులను గాపాడుటకును, అన్నపానాది విషయములను, వస్త్రాలంకారాది విషయములను నవనాగరికమున వచ్చిన దురభ్యాసములను నిరుత్సాహపరచుటకును దేశసేవక సంఘములను యేర్పాటుచేయ గలందులకును ప్రతి గ్రంథాలయమువారును ప్రబల ప్రయత్నము చేయనగునని యీ సభవారు తీర్మానించుచున్నారు.

౭. ప్రతి గ్రంథాలయమువారును తమ గ్రామచరిత్రను, ఉన్నచో సంస్థాన చరిత్రలను వ్రాసి రాబోవు మన మండల గ్రంథాలయ ప్రదర్శనమునకు తేవలెననియు, తమ తాలూకాలలోని పుణ్యక్షేత్రముల పట్టికయు, సంతల పట్టికయు, ఉత్సవాదులు జరుగు దినములను తెలుపు పట్టికయు తయారుచేసి స్థాయీసంఘ కార్యస్థానమునకు సాధ్యమగునంత త్వరలో పంపి తోడ్పడవలయుననియు ఈ సంఘమువారు కోరుచున్నారు.

౮. జిల్లాలోని పండితులకు వారివారి పాండిత్య విశేషములనుబట్టి బిరుదములను, చేతిపనులలో నేర్పు చూపినవారికి యోగ్యతాపత్రికలను మండల గ్రంథాలయ సభలో ఇయ్యవలెనని యీ సభవారు తీర్మానించుచున్నారు.

గ్రం. స. V - 1

## గోదావరిమండల గ్రంథాలయ ప్రతినిధుల ప్రథమమహాసభ, అమలాపురము:

౧ (క) గోదావరీ మండలమునందున్న అన్ని పట్టణములయందును, పల్లెలయందును గ్రంథాలయములను, పఠనమందిరములను స్థాపించవలెనని మండల ప్రజలను ఈ సభవారు ప్రార్థించుచున్నారు.

(చ) గోదావరి మండలమునందున్న గ్రంథాలయములన్నియు "గ్రంథాలయ సర్వస్వము" ను తెప్పించుకొనవలెనని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

౨. తంజావూరు మహారాజుల దివాణములోని లిఖిత పుస్తక భాండాగారమునందున్న వాఙ్మయ మాంధ్ర నాయకుల యొక్కయు, మహారాష్ట్ర ప్రభువులయొక్కయు కాలమున బుట్టినది. గ్రంథరాజములు వారి కాలమున సేకరింపబడినవి. కావున నది ప్రజలయుపయోగార్థము చెన్నపురిలో స్థాపింపబడి ప్రభుత్వమువారి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున చేర్చుట ఉపయోగకరము. కావున ప్రభుత్వమువారు ఈ భాండాగారము విదేశములకు పోకుండ నరికట్టి దేశ జనుల కుపకారమొనర్చుట యత్యవసరమని యీ సభవారు దొరతనము వారిని కోరుచున్నారు.

౩. మన మండలమునకు గ్రంథభాండాగార సంఘము కార్యదర్శిలేని లోటును తీర్చుచు ధనవ్యయమునకును, శరీర కష్టమునకును ఓర్చి మండలమునగల గ్రంథాలయములన్నియు పరీక్షించుచు గడచిన రెండు వత్సరములనుండి ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు రిపోర్టును పంపుచున్న శ్రీ అద్దంకి సత్యనారాయణ శర్మగారికి ఈ సభవారు తమ కృతజ్ఞతా వందనములను సమర్పించుచున్నారు.

గ్రం. స. II - 3 & 4

## గోదావరీమండల గ్రంథాలయ ద్వితీయ మహాసభ, రాజవోలు:

3. ఆంధ్ర భాషకు పుట్టినిల్లును, చరిత్రయందు పురాతనమును, సుప్రసిద్ధమును, గ్రంథాలయ నిర్మాణమునకు ప్రథమ స్థానమును, విద్యావ్యాప్తికి ప్రధాన స్థలమును అగు రాజమహేంద్రవర పట్టణమున ఆంధ్రదేశ కేంద్రగ్రంథాలయమును స్థాపించుటకు తత్పౌరుల నీ సభవారు హెచ్చరించుచున్నారు.

౯. మండల గ్రంథాలయ సభ సంఘాల రాజకీయ సభతో పాటుగాక ప్రత్యేకముగ జరుపుటకు ఈ సభవారు తీర్మానించుచున్నారు.

౧౦. శ్రీవారి పిఠాపురం రాజావారు సంపాదించిన అపూర్వాంధ్ర తాళపత్ర గ్రంథములు లోకులు నిరాటంకముగా ప్రవేశము కోటలోనికి పోయి చదువుకొనుటకు అవకాశ మిచ్చినందులకు శ్రీవారికి సభవారు తమ సంతోషపూర్వక వందనముల తెలుపుచున్నారు.

గ్రం. స. III - 4

ఐదవ గోదావరిమండల గ్రంథాలయసభ, పరిమెళ్ల :

౧. రాజమహేంద్రవరములో శ్రీయుత దామెర్ల రామారావుగారి చిత్రశాలికి [illegible] బోవు ఆంధ్రచిత్రకారులను [illegible] నిరాశ [illegible] ప్రోత్సహించ వలయునని యీ సభవారు హెచ్చరించుచున్నారు.

౨. సద్గ్రంథపఠనకు తోడ్పడి అన్ని గ్రంథములు ప్రజలయందు విరివిగా వ్యాపింపజేయుట, ఉన్నతమైన జ్ఞానోదయ మగునట్లు [illegible] గ్రంథాలయముల ముఖ్య విధియైయుండగా, ఈ విధి ప్రస్తుతము [illegible] నిర్వహింపబడకుండ పోవుటచేత ప్రజాసామాన్యమునకు [illegible] శాఖలను [illegible] అభివృద్ధి చేయుటయే ముఖ్యవిధిగాగల స్థానిక స్వపరిపాలన సంస్థలు, [illegible] విధిని నిర్వహించుట [illegible] సరియైనది. కావున ఈ ప్రోత్సాహమును కార్యాచరణ లోనికి తెచ్చుటకు యీ గ్రంథనిధానముల జేర్పాడిన అభివృద్ధి [illegible] కొన్నిటినిగాని వెంటనే అమలులోనికి తెచ్చుటకు ఈ సభవారు గోదావరిజిల్లా యందలి స్థానిక స్వపరిపాలనా సంఘముల వారిని కోరుచున్నారు.

1. సంచార గ్రంథాలయ పెట్టెలకు కొంత ద్రవ్యమును ప్రత్యేకించి వినియోగించుట
2. వారి యాదరణక్రిందనున్న పాఠశాలలందు గ్రంథ భాండారముల నభివృద్ధిజేసి అందలి గ్రంథములను విద్యార్థులకేగాక గ్రామస్థులకెల్ల చదువుకొన నిచ్చుట
3. తమ ప్రాంతములందున్న సర్వ గ్రంథాలయములకు తగిన విరాళములిచ్చుట

3. గ్రంథాలయములందు పుస్తకములతోడుగా రాట్నములను కూడ తావాసగి పురాణపత్రిక పఠన సమయములందు, తదితర సమయములందు రాట్నమును త్రిప్పుచు నూలువడకుటకు సదుపాయములు జేయుటకీ సభవారు హెచ్చరించుచున్నారు.

౪. కాకినాడ కాపురస్థులు హకీంహుస్సేన్ జుల్కర్నైన్ సాహెబుగారు ముప్పది నాల్గువేల శబ్దముల "వనౌషధి నిఘంటువు"ను వ్రాసి అచ్చువేసినందుకు వారి పరిశ్రమను సభవారు అభినందించుచున్నారు.

— ధ. గ్రం. పత్రిక I - 9

## ఆరవ గోదావరి మండల గ్రంథాలయసభ, సీతానగరము :

౨. జనసామాన్యమునందు జ్ఞానమును వెదజల్లుటకు సులువైనట్టియు, చౌకయైనట్టియు, ఫలప్రదమైనట్టియు మార్గము సంచార గ్రంథాలయ స్థాపన గావున మండల మంతటను సంచార గ్రంథాలయములను స్థాపించుటకు సహాయము చేయవలెనని ప్రజల నీ సభవారు కోరుచున్నారు.

3. గోదావరి మండల గ్రంథాలయములలో హిందీ శాఖలనుకూడ స్థాపించి హిందీ పుస్తకములు, పత్రికలు తెప్పించి హిందీ నభ్యసించినవారికి తోడ్పడుచు హిందీ ప్రచారాభివృద్ధికై సాయమొనర్ప ఈ సభవారు కోరుచున్నారు.

౪. ఆంధ్ర గ్రంథముల సూచికను తయారుచేయిరించి, ఆంధ్రభాషకు మహోపకారము గావించిన దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు గారి కీ సభవారు తమ కృతజ్ఞతను తెలుపుచున్నారు.

౬. మద్రాసు ప్రభుత్వమువారు నెం. 689/28-4-26 రు జి. ఓ. ప్రకారము గ్రంథాలయములకు గ్రాంటు నిచ్చుటకు యేర్పరచిన నిబంధనలు గ్రంథాలయముల యొక్క ప్రాథమిక లక్షణములనే భంగపరచుచున్నవి. కాన ఆ నిబంధనల ననుసరించి యేగ్రంథాలయముకాని ద్రవ్యసహాయము పొందుట గ్రంథాలయ గౌరవమును, స్వాతంత్ర్యమును కోల్పోవుటయేయని అభిప్రాయపడుచు ఆత్మగౌరవము గల యే గ్రంథాలయమును ఈ గ్రాంటును స్వీకరింపగూడదని యీ సభవారు హెచ్చరించుచున్నారు.

౭. రాజమహేంద్రవరములోని గౌతమీ గ్రంథాలయము సుమారు మూడు సంవత్సరములనుండి వివాదములలో తగుల్కొని యుండుటచేతను, అది ఋణములలో నుండుటచేతను, దానియొక్క క్షేమము దాని ప్రాముఖ్యతనుబట్టి ఆంధ్ర మండలముల కన్నిటికిని కావలసినదగుటచేతను ఆ గ్రంథాలయములోని వివాదములను పరిష్కరించు మార్గముల నన్వేషించి దానిని ప్రస్తుత ఋణములలోనుండి తప్పించుటకై విరాళములు మున్నగువానిని స్వీకరించు ప్రయత్నముసేయుట కీ క్రింది వారిని గోదావరిజిల్లా గ్రంథాలయ సంఘముల తరఫున పంచాయతీగా నీ సభ వారేర్పరచు చున్నారు.

1. కాశీనాథుని నాగేశ్వరరావుగారు, అధ్యక్షులు
2. కోరుకొండ లింగమూర్తిగారు
3. యాతగిరి లక్ష్మీవేంకటరమణగారు, కన్వీనరు

మరియు గౌతమీ గ్రంథాలయముచే నెన్నుకొనబడు యిద్దరు ప్రతినిధులు

౮. ఆంధ్ర గ్రంథాలయోద్యమాభివృద్ధికి యిదివరలో శ్రీ యాతగిరి లక్ష్మీవేంకటరమణగారు జేసిన కృషిని ప్రశంసించుచు వారు ప్రకటించుచున్న ధర్మగ్రంథాలయ పత్రికకు సహాయము చేయవలెనని ప్రజల నీ సభవారు కోరుచున్నారు.

## సప్తమ తూ. గో. మండల ధర్మగ్రంథాలయ మహాసభ, సామర్లకోట:

౨. గుంటూరు, బెజవాడ మునిసిపాలిటీల వారును, తాడేపల్లిగూడెం తాలూకాబోర్డు వారును ధర్మగ్రంథాలయములను స్థాపించి విజ్ఞాన ప్రచారమునకు తోడ్పడుచున్నందులకు వారి నభినందించుచు ఇతర మునిసిపాలిటీలును, లోకలు బోర్డులును వారి ఆదర్శము గైకొని గ్రంథాలయోద్యమమును ప్రోత్సహించవలెనని ఈ సభవారు కోరుచున్నారు.

౩. "రేడియో" యంత్ర సహాయమున ఆంధ్రోపన్యాసములు యిప్పించుట మూలమునను, మాజికులాంతరు, సినీమా ప్రదర్శనముల వలనను జనసామాన్యమునందు విజ్ఞానము వ్యాపించజేయుటకు స్థానిక సంస్థలను, గ్రంథాలయోద్యమాభిమానులను ఈ సభవారు హెచ్చరించుచున్నారు.

౪. లోకల్ బోర్డుల ద్వారాను, రాష్ట్రీయ సహకార యూనియనులద్వారాను నిర్వహింపబడుచున్న గ్రామపునర్నిర్మాణ కేంద్రస్థానములో కేంద్రగ్రంథాలయములను స్థాపించి, ఆ యాప్రాంతములందలి గ్రామజనులకు సంచార గ్రంథపేటికల మూలమున గ్రంథపఠన వ్యాప్తికి తోడ్పడవలెనని ఆ యాసంస్థలవారిని కోరడమైనది.

౫. సహకార స్థానిక యూనియనుల కార్యస్థానములందు కేంద్రగ్రంథాలయములను నిర్వహించి, స్థానికయూనియను ప్రదేశములలోని సహకారసంఘముల సాముదాయప్రయోజననిధితో గ్రంథాలయ సంచారప్రచారకులను పోషించి ఉద్యమవ్యాప్తికి తోడ్పడవలెనని ఈ సభవారు సహకారయూనియనులను హెచ్చరించుచున్నారు.

౬. జిల్లాలోని సెంట్రల్ కోఆపరేటివ్ బ్యాంకులు వారిసాముదాయక ప్రయోజననిధి నుండి వారి కార్యాలయమున కేంద్రగ్రంథాలయములను స్థాపించి, తద్వారా స్థానికయూనియనుల గ్రంథాలయములకు, గ్రామ సహకారసంఘములకు సంచార గ్రంథాలయపేటికలమూలమున గ్రంథపఠనవ్యాప్తిని జేయుదురని ఈ సభవారు హెచ్చరించుచున్నారు.

౭. కీర్తిశేషులైన కందుకూరి వీరేశలింగం పంతులుగారిచే స్వదస్తూరిని వ్రాయబడిన పుస్తకములు అఖిలాంధ్ర దేశముయొక్క సొత్తు కావున వానిని భద్రపరచుటకు రాజమండ్రి హితకారిణీ సమాజమువారిని ఈ సభవారు హెచ్చరించుచున్నారు.

గ్రం. స. VIII-4

## తూర్పుగోదావరిమండల గ్రంథాలయసభ, కాకినాడ (30-5-1936)

౨. ప్రభుత్వమువారు గ్రామపంచాయతీ పుస్తకభాండాగారములకు ఎట్టి విరాళములను యీయక నిరుత్సాహము కలుగజేయుచున్నందులకు గర్హించుచు, వీటికికూడ జిల్లాబోర్డుగ్రంథాలయములకువలెనే విరాళములనిచ్చి ప్రోత్సహించవలసినదిగా, విద్యాశాఖమంత్రిని, లోకల్ బోర్డుల ఇన్‌స్పెక్టరును యీ సభవారుకోరుచున్నారు.

3. పంచాయతీ పుస్తకభాండాగారములలో ఇన్‌స్పెక్టర్ ఆఫ్ లోకల్ బోర్డువారి అనుమతిలేనిదే గ్రంథములుగాని, పత్రికలుగాని కొనకూడదని నిషేధించినందులకు యీ సభవారు గర్హించుచు, పంచాయతీలు గ్రంథభాండాగారములను, పఠనమందిరములను పోషించుటకు ధనము వెచ్చించుటకు అవకాశము కలుగజేయవలసినదని యీ సభవారు కోరుచున్నారు.

౪. ఈజిల్లాబోర్డువారు గ్రంథాలయాభివృద్ధికై ఎట్టివిరాళములను యీయకపోవుటకు యీ సభవారు ఆశాభంగమును ప్రకటించుచు, ముందుసంవత్సరమైనను తగు విరాళములను గ్రంథాలయములకు యిప్పించవలసినదని యీ సభవారు కోరుచున్నారు.

ఆంధ్ర దినపత్రిక

ద్వితీయ పశ్చిమగోదావరి జిల్లా గ్రంథాలయసభ, పాందువ్వ:

3. ఈ జిల్లాలోని గ్రామ గ్రంథాలయములన్నియు ఏకోన్ముఖముగ పనిచేసి వయోజన విద్యాభివృద్ధి కలుగజేయుటకు ఒక ప్రణాళికను తయారుచేసి, ఆచరణలో పెట్టుటకు పశ్చిమగోదావరిజిల్లా గ్రంథాలయసంఘమువారిని ఈ సభవారు కోరుచున్నారు.

౪. (అ) గ్రంథాలయోద్యమమును వ్యాపింపజేయుటయును, వయోజనవిద్యను వ్యాపింపజేయుటయును, జిల్లాబోర్డుయొక్క విధ్యుక్తధర్మములలో నొకటిగ పశ్చిమగోదావరిజిల్లాలోని అన్ని గ్రంథాలయములు ఏకోన్ముఖముగాను సక్రమముగాను పనిచేయుచు జనులందరియందును వయోజన విద్యావ్యాపకము చేయుటకుగాను 3 వ తీర్మాన ప్రకారము తయారైన ప్రణాళికను ఆచరణలో పెట్టుటకై ఈ దిగువ వివరించిన ప్రకారము ఖర్చుపెట్టుటకు రు 4000/-ల విరాళమును ప్రతిసంవత్సరము పశ్చిమగోదావరిజిల్లా గ్రంథాలయసంఘమునకు యిప్పించవలసినదిగ పశ్చిమగోదావరిజిల్లాబోర్డువారిని ఈ సభవారు కోరుచున్నారు.

(ఆ) రివెన్యూ డివిజనుకు ఒక్కరు చొప్పున మాసమునకు భత్యముతో సహా రు ౭౭ లు జీతంమీద జిల్లా మొత్తంమీద ముగ్గురు ప్రచారకులను నియమించుట.

(ఇ) ఈ ప్రచారమునందు జనసమూహము నాకర్షించుటకై, పైముగ్గురకు ప్లేటులతో సహా ఒక గ్రామ్‌ఫోనును, ఉపన్యాసములు ఆకర్షణీయముగ వివిధవిషయములను గూర్చి యిచ్చుటకై స్లైడ్లతో సహా ఒకమాజిక్కులాంతరును, గ్రామముల వెంబడి జనులకు పుస్తకములనందజేయుటకై ఒక గ్రంథాలయశకటమును సరఫరా చేయుట.

(ఈ) తాలూకాలో గ్రంథాలయములు సక్రమముగా నడపుటకును, క్రొత్తగాస్థాపించుకొను రాష్ట్రజిల్లా సంఘములతో ఉత్తరప్రత్యుత్తరములు జరుపుటకును ఒక్కొక్క తాలూకాగ్రంథాలయ సంఘమునకు ఒకసంవత్సరమునకు ఒకనూరు రూపాయలు విరాళము నిప్పించుట.

(ఉ) జిల్లాలో అన్ని తాలూకా సంఘములు ఏకోన్ముఖముగ పనిచేయునట్లు చూచుటకు రాష్ట్ర, అఖిలభారతసంఘములతోను, ఇతరసంస్థలతోను ఉత్తరప్రత్యుత్తరములు జరుపుటకుగాను జిల్లాగ్రంథాలయసంఘమునకు సంవత్సరమునకు రు 200 లు విరాళము నిప్పించుట.

(ఊ) గ్రంథాలయములులేని గ్రామములకు ఒకగ్రంథాలయమునుండి మరియొకగ్రంథాలయమునకు గ్రంథములనంపుటకుగాను ప్రతితాలూకా సంఘమునకు ఆరుచొప్పునను, జిల్లాగ్రంథాలయసంఘమునకు ఎనిమిదియును మొత్తం 50 గ్రంథాలయ పేటికలను సప్లైచేయుట.

(ఋ) జిల్లా మొత్తంమీద బాగాపనిచేయు గ్రంథాలయమునకు గ్రంథాలయసేవయందుత్సాహము కలుగజేయుటకుగాను రు 100 లు విలువగల ఒక బహుమానమును పుస్తకములరూపమున నిచ్చుట.

(ౠ) జిల్లామొత్తంమీద ఆంధ్రమందు బాగుగా మాట్లాడు ఒకవ్యక్తికి బహుమానమిచ్చుట.

౧౦. ప్రభుత్వమువారిచే యివ్వబడుగ్రాంటులతో కొనుపుస్తకములు, ప్రభుత్వమువారిచే నిషేధింపబడిన గ్రంథములనుతప్ప మిగతాగ్రంథములనన్నింటిని కొనుటకు గ్రంథాలయములకు అధికారమియ్యవలసినదనియు, ఈ విషయములో జిల్లావిద్యాశాఖాధికారి సిఫారసు అవసరములేకుండా చేయించగలందులకు ప్రభుత్వమువారి నీసభవారు కోరుచున్నారు.

౧౨. ఈ జిల్లాలోని అన్ని గ్రంథాలయములకును ప్రభుత్వమువారిచే నిషేధింపబడిన గ్రంథములపట్టికను ఒకదానిని సరఫరాచేయుచు ఇకముందు నిషేధింపబడు గ్రంథముల పట్టికలనుగూడ మూడుమాసములకొకసారి సప్లయిచేయునటుల ప్రభుత్వమువారినీసభవారు కోరుచున్నారు.

౧౩. (అ) గ్రంథాలయములను సోదా (సర్చి) చేయుటకు ప్రభుత్వోద్యోగులు వచ్చునపుడు వారంటులను జారీచేయించవలసినదనియు, (ఆ) సదరువారంటును పట్టుకొనివచ్చే పోలీసు ఉద్యోగులు సందేహమునకు తావివ్వకుండునటుల పోలీసు డ్రస్సులోనుండునట్లు చేయవలసినదనియు, (ఇ) అట్లు తనిఖీఅయినపిమ్మట పోలీసు వారు వశపరచుకొనే పుస్తకములకు రశీదును గ్రంథాలయమునకు యిప్పించవలసినదనియు, (ఈ) పోలీసువారు తీసుకొన అవసరములేని గ్రంథములను తిరిగి వెంటనే గ్రంథాలయములకు వాపసు యిప్పించవలసినదనియు– ఈ జిల్లాపోలీసు అధికారిని ఉత్తరువు చేయగలందులకు యీ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

గ్రం. స. X–3

## ద్వితీయ కృష్ణామండలగ్రంథాలయ ప్రతినిధుల మహాసభ, జగ్గయ్యపేట:

౧. తంజావూరు మహారాజుల లిఖిత పుస్తక భాండాగారము ఆంధ్ర మహారాష్ట్ర ప్రభువుల కాలమున బుట్టి మనదేశీయులకు మిక్కిలి యుపయోగకారిగ నున్నది.

కావున ఆగ్రంథభాండాగారమును విదేశములకుబోకుండ నరికట్టి, దానిని చెన్న పట్టణమునందున్న ప్రభుత్వమువారి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునగాని, ఆంధ్రసాహిత్య పరిషద్భాండాగారమునగాని జేర్చుటకు ప్రభుత్వమువారిని ఈ సభవారు కోరుచున్నారు.

## మూడవకృష్ణామండల గ్రంథాలయప్రతినిధుల మహాసభ, గంపలగూడెము:

3. (అ) ఈ జిల్లాయందున్న గ్రంథాలయములన్నింటికిని ప్రభుత్వమువారిచే ప్రచురింపబడుచున్న వ్యవసాయిక ఆరోగ్య పారిశ్రామిక వాణిజ్య ప్రచురముల నన్నిటిని ఉచితముగా నొసంగవలెనని ప్రభుత్వమువారిని ఈ సభవారు ప్రార్థించుచున్నారు.

౨. ఆంధ్రగీర్వాణ సాహిత్యము దేశమునలుతట్టుల పూర్వపుఔన్నత్యమునకు వచ్చుటకును, సాహిత్యవిజ్ఞానము దానికిజతపడుటకును గ్రంథాలయములు ఆంధ్ర సాహిత్య విద్యాశాలల నెలకొల్పవలెననియు, అందుకొరకై పనిచేయుచున్న కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాలయమును వృద్ధిపరచుటకు దేశీయులెల్లరును సహాయముచేయవలెననియు ఈ సభవారు ప్రార్థించుచున్నారు.

## నాల్గవ కృష్ణామండల గ్రంథాలయసభ:

౧. కైకలూరు తాలూకా కోరుకొల్లు గ్రామముననున్న శ్రీరామగ్రంథాలయమునకు గృహనిర్మాణముగావించుకొనుటకు సుమారు రు 300/ లు విలువగల యిరువది సెంట్లు స్థలమును దానమొసగిన శ్రీ చిన్నంశెట్టి సీతారామయ్యగారికుమారుడు వెంకయ్యగారియౌదార్యమున కీ సభవార లెంతయు నభినందించుచు ప్రతిగ్రామము లోను తగువిధముల గ్రంథాలయములకు సహాయమొనర్ప మహాజనుల నీ సభవారు ప్రార్థించుచున్నారు.

౨. గ్రంథాలయములన్నియు దేశభాషావాఙ్మయ చరిత్రాభివృద్ధికై తమకు సమీప గ్రామములయందున్న ప్రాచీన తాళపత్రగ్రంథములు, రాగిశాసనములు మొదలగునవి సంపాదించి పిఠాపురమునందు స్థాపించిన యాంధ్రపరిశోధక మహామండలికి బంపుడని యీ సభవారు కోరుచున్నారు.

గ్రం. స. III–6

## తొమ్మిదవ కృష్ణాజిల్లా గ్రంథాలయమహాసభ, గురజ:

౧. బొంబాయి, బీహారు, యు. పి. రాష్ట్రములలో నిరక్షరత్వ నిర్మూలనమునకును, వయోజన విద్యావ్యాప్తికిని ఆ యా ప్రభుత్వములు చేయుచున్న కృషిని యీ సభవారు అభినందించుచు, అట్లే చెన్నరాష్ట్రమునకూడ చేయవలెనని చెన్నపురి ప్రభుత్వమువారి నీ సభవారు కోరుచున్నారు.

౨. వయోజనవిద్యకు మూలకందములగు గ్రంథాలయములకు ఇచ్చు ధనసహాయమును మద్రాసు కాంగ్రెసుప్రభుత్వమువారు పూర్తిగా తగ్గించినందులకు ఈ సభవారు ఖండించుచు అధమము సంవత్సరమునకు ఒక లక్షరూపాయలనైన ఈ

రాజధానియందలి గ్రంథాలయముల సహాయార్థము ప్రత్యేకించి గ్రంథాలయోద్యమాభివృద్ధికి తోడ్పడి తద్వారా వయోజన విద్యావ్యాప్తిగావింపవలెనని చెన్నపురిప్రభుత్వమువారి నీ సభవారు కోరుచున్నారు.

౬. మద్యపాన నిషేధమును రాష్ట్రమునందంతటను ప్రారంభింపనున్న ఈ శుభసమయమున దేశమున అక్షరములురానివారులేకుండజేసి వయోజనవిద్యను జనులందరికిని అందుబాటులో నుండులాగున చేయుటవలన ఈ నిషేధమువలన జనులకు కలుగవలసిన నిజమైన సంపూర్ణలాభములు చేకూరగలవని చెన్నపురి ప్రభుత్వము వారి నీ సభవారు ప్రార్థించుచున్నారు.

౭. ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణమునుగూర్చి గుంటూరులోజరిగిన 21 వ ఆంధ్ర మహాసభలో ఆమోదింపబడిన తీర్మానములను యీ సభవారు బలపరచుచున్నారు.

—ఆంధ్రపత్రిక

## పదవ కృష్ణాజిల్లా గ్రంథాలయ మహాసభ, కోలవెన్ను:

౮. గ్రంథాలయములనుగూర్చి, వయోజనవిద్యావ్యాప్తినిగురించి, గ్రంథాలయోద్యమ ప్రాశస్త్యమునుగురించి తెలుగుఉపన్యాసములను రేడియోద్వారా ప్రముఖులచే తరచు యిప్పించు యేర్పాటు చేయవలసినదిగ మద్రాసు రేడియో అధికారులను యీ సభవారుకోరుచున్నారు.

౯. పంచాయతీబోర్డు గ్రంథాలయముల నిర్వహణ విషయమై అడ్డంకులుకల్పించు సర్క్యులరులను రద్దుచేసి పంచాయతీబోర్డులు గ్రంథాలయములను స్థాపించుటకు, నిర్వహించుటకు స్వాతంత్ర్యము నీయవలసినదిగ మద్రాసు ప్రభుత్వమువారి నీసభవారు కోరుచున్నారు.

౧౦. మద్రాసు ప్రభుత్వమువారు గ్రంథాలయములకు యేటేట ఒసంగుచున్న గ్రాంటును తీసివేసినందులకు యీ సభవారు నిరసించుచు, ప్రతివత్సరము కనీసము ఏబదివేలరూపాయలకు తక్కువగాకుండ గ్రాంటును యివ్వగలందులకు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

౧౧. జిల్లాలోని గ్రంథాలయములు క్రిందికార్యక్రమము నవలంబించవలసినదిగ యీ సభవారు హెచ్చరించుచున్నారు.

1. గ్రంథాలయముల తరఫున చదువురానిప్రజలలోకూడ విద్య, విజ్ఞానం వ్యాపింపజేయడంకోసం, కొద్దిగా చదువుకున్న వారికి విద్యనభివృద్ధిచేయటానికి రాత్రి పాఠశాలల నేర్పాటుచేయుట, పత్రికలను చదివి వినిపించుట, నూతనపద్ధతులప్రకారం త్వరలో అక్షరజ్ఞానంకల్గడంకోసం నిరక్షరాస్యతా నిర్మూలనోద్యమం సాగించుట, మ్యాజిక్ లాంతరు ప్రదర్శనాల నేర్పాటుచేయుట మొదలైన కార్యక్రమాన్ని చేపట్టుట.

2. పక్షానికొకసారో, నెలకొకసారో ఆయా విషయాలలో ఆరితేరిన ఉపన్యాసకులచే ప్రజాసామాన్యానికి అవసరమైన విషయాలపై అనగా ఆర్థిక, రాజకీయ, శారీరక, వైజ్ఞానిక, వ్యావసాయిక విషయాలపై ఉపన్యాసాలనిప్పించుట.

3. గ్రంథాలయాలులేని చుట్టుప్రక్కల గ్రామాలలో విద్యావ్యాప్తి జరగడంకోసం సంచార గ్రంథాలయముల నేర్పాటు చేయుట.

—కృష్ణాజిల్లా గ్రంథాలయసంఘ ప్రచురణ

## గుంటూరుమండల గ్రంథాలయ ప్రతినిధుల ద్వితీయమహాసభ, రేపల్లె:

౨. ప్రతితాలూకావారును మండలగ్రంథాలయసంఘమునకు సహాయముగానుండి, తాలూకా సంఘముల నేర్పాటుచేసి గ్రంథాలయోద్యమాభివృద్ధికి సహాయ భూతులయ్యెదరని యీ సభవారు కోరుచున్నారు.

3. తంజావూరునందున్న సుప్రసిద్ధ ప్రాచీనాంధ్రగ్రంథాలయము పశ్చిమఖండము నకుతీసికొనిపోబడునని ప్రవాదముకలిగినందున, ఆగ్రంథములను అట్లుతీసికొనిపోబడకుండ అచ్చటనేఉంచునట్లును—లేకసాధ్యమగునేని మద్రాసునందున్న ఆంధ్రసాహిత్య పరిషత్తువారిగ్రంథాలయమునకుగాని, ప్రాచ్యలిఖిత గ్రంథాలయమునకుగాని చేర్పించవలయుననియు ఈ సభవారు చెన్నపురిప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నారు.

౪. దొరతనమువారిచే ప్రచురించబడు పారిశ్రామిక, ఆరోగ్యవిషయిక, వ్యవసాయక ప్రచురములను, జిల్లా గెజటీరులను ఆంధ్రభాషయందు ముద్రించబడు గ్రంథముల పట్టికలను గ్రంథాలయములన్నిటికిని ఉచితముగాదయచేయవలెనని ప్రభుత్వము వారి నీసభవారు ప్రార్థించుచున్నారు.

౫. ప్రతిపట్టణ గ్రామములయందు స్వంతభవనములుగల గ్రంథాలయములవారు పాటక జనములకై ఉచితరాత్రి పాఠశాలలను తప్పకస్థాపించి పోషించుట ప్రథమ కర్తవ్యమనియు, అట్టిపాఠశాలలను గ్రామగ్రంథాలయమువారు దీపావళిపండుగ వసూళ్లుచేసి పోషించవలెననియు ఈ సభవారుకోరుచున్నారు.

—గ్రం. స. II-3 & 4

## మూడవ గుంటూరుమండల గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ, సత్తెనపల్లి:

౧. ఇప్పుడు జరుగుచున్న యుద్ధములో మన చక్రవర్తిగారికిని మిత్రమండలివారికిని జయము కల్గుగాకయని యీ సభవారు కోరుచున్నారు.

3. ఇప్పుడు స్థాపింపబడియున్న గ్రంథాలయములవారు తమతాలూకాయందును, సమీపగ్రామములందును తాళపత్రాది లిఖిత గ్రంథములను సంపాదించి తమయొద్ద భద్రపరచి భాషాభివృద్ధి ప్రోత్సాహము గలిగింపవలెనని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

౫. మన మండలములోని ప్రతితాలూకాకును ఒకగ్రంథాలయ సంఘము ఏర్పరచుటకు ఆయాతాలూకాల గ్రంథాలయ సభ్యులను ఈ సభవారు కోరుచున్నారు.

౯. గుంటూరుమండల గ్రంథాలయసంఘపక్షమున ఒకసంచార కార్యదర్శిని యేర్పరచి గ్రంథాలయోద్యమము విపులముగ వ్యాపింపజేయవలెనని యీ సభవారు నిశ్చయించి, శ్రీకోన వెంకట్రాయశర్మగారిని ఆయుద్యోగమునకు నియమించుచున్నారు.

— గ్రం. స. III-2

## ఆరవ గుంటూరు మండల గ్రంథాలయ ప్రతినిధులమహాసభ,...:

౧. కడచిన సంవత్సరము ప్రజాప్రబోధమునకై విశేషముగా పాటుపడి శ్రీకృష్ణజన్మస్థానమునకేగిన గ్రంథాలయ సోదరులనందరిని ఈ సభవారు అభినందించుచున్నారు.

౪. మండలగ్రంథాలయ సంఘపక్షమున జరుగుచుండిన కరపత్రప్రచురణమునకు ఆంధ్రదేశగ్రంథాలయసంఘమువారు పూనుకొనినందున వారికి మండలపక్షమున అన్నివిధముల సాయముచేయవలెనని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

౬. మండలములో గ్రంథాలయోద్యమమునకు సంపూర్ణమైన అంగనిర్మాణమేర్పడుట అవసరము కావున ప్రతితాలూకాకును, ప్రత్యేక తాలూకా గ్రంథాలయసంఘముల నేర్పరచి ప్రతిసంవత్సరము ఆయాతాలూకా గ్రంథాలయసభలుజరుపుచుండవలెననియు, దీనిని అమలులోనికితెచ్చుటకు మండలగ్రంథాలయసంఘమువారు కృషిసల్పవలెననియు యీ సభవారు తీర్మానించుచున్నారు.

—గ్రం. స. VI-5

## కర్నూలుమండల గ్రంథాలయముల ప్రథమమహాసభ, బేస్తవారపుపేట:

౪. మండలములోని గ్రంథాలయోద్యమమునకు నూతనవికాసమును కలిగించుటకు గాను 'గ్రంథాలయఉత్సవము అనుపేర సంవత్సరమున కొకవారము పండుగ జరుపుటకును, అప్పుడు సరస్వతీపూజ, గ్రంథాలయభిక్షలు, ఉపన్యాసములు, ప్రదర్శనములు జరుపుటకును తీర్మానించడమైనది.

౩. (క) మద్రాసు గ్రంథాలయసంఘమువారిచే తయారుచేయబడి మహారాజశ్రీ బషీర్ అహమ్మదుగారిచే మద్రాసు శాసననిర్మాణసభయందు ప్రవేశపెట్టబడిన మద్రాసు గ్రంథాలయచట్టము (Bill No XI of 1933) ఈ రాజధానియందు ప్రాముఖ్యమగు వివిధదేశభాషలయొక్క వికాసమునకు దోహదమిచ్చునదిగా గన్పట్టుటలేదనియు, ప్రస్తుతము దేశపరిస్థితిగతులయందు అభివృద్ధికి భంగకరముగ నున్నదనియు, క్రొత్త పన్నులను వేయునట్టి యెట్టిచట్టముగాని దేశమునావరించియున్న ప్రస్తుత దుర్భరస్థితియందు ప్రవేశపెట్టుట భావ్యముకాదనియు, సదరు

చట్టము అనావశ్యకమనియు, అందులోనిమిడ్చిన క్రొత్తసంఘములయు, అధికారులయు, క్రొత్తపన్నులయు పద్ధతి అనర్థదాయకమనియు ఈ సభవారు శాసన నిర్మాణ సభకు మనవిచేయుచున్నారు.

(చ) ఇప్పుడు అమలులోనున్న లోకలుబోర్డు చట్టమునే సంస్కరించి, తాలూకాబోర్డులను రూరల్ డెవలపుమెంటు ఫండులను రద్దుపరచి ప్రతిగ్రామమునను పంచాయతి నిర్బంధముగానేర్పచి, లోకలుబోర్డుసెస్సులో 0-1-0 పంచాయతీకిచ్చి నిర్బంధముగా గ్రామ గ్రంథాలయ, గ్రామపారిశుద్ధ్య కార్యములనిర్వహించునట్లు నియమించినయెడల కార్యసాధియగునని యీ సభవారు సూచించుచు, శాసన నిర్మాణసభ్యులను యీ సూచనలను అమలులోనికి దేవలెనని కోరుచున్నారు.

(ట) పైతీర్మానముల ననుసరించి ఒకనివేదికను తయారుజేసి వెంటనే ప్రకటించుటకై ఈ క్రిందివారిని ఉపసంఘముగా .యేర్పాటుచేయడమైనది.

1. గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు
2. క. శరభారెడ్డిగారు
3. రాజా పెద సుబ్బారాయుడుగారు

౧౦. ప్రతిగ్రంథాలయమునందును దేశీయుల శరీరస్థితికనుగుణమైనట్టియు, చౌకయైనట్టియు ఆయుర్వేద వైద్యశాలలను స్థాపించి, తన్మూలమున గ్రంథాలయమునకు జనుల నాకర్షించి వారిని ఆరోగ్యవంతులుగను, జ్ఞానవంతులుగను చేయవలయుననియు, ఆయుర్వేద వాఙ్మయ గ్రంథములను సహితము గ్రంథాలయములు సేకరించి ప్రజలకు ఆరోగ్య విధులను బోధింపవలయుననియు యీ సభవారు తీర్మానించుచున్నారు.

— అచ్చు నివేదిక

## నిజాం రాష్ట్రాంధ్ర గ్రంథాలయసభ, మధిర:

౨. నిజాంరాష్ట్ర ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమ విషయమున జేయుచున్న ప్రయత్నములకుగాను ఆంధ్రజన కేంద్ర సంఘమువారిని ప్రశంసించుచు, ఉద్యమ ప్రచారమునకై ప్రత్యేకమగు ఏర్పాటుచేయుటకు వారిని ఈ సభవారు కోరుచున్నారు.

౪. నిజాంరాష్ట్రాంధ్ర గ్రంథాలయోద్యమ వ్యాప్తి నిమిత్తము గ్రంథాలయ సంఘమొకటిస్థాపించుట యవసరమని యీ సభవారభిప్రాయపడుచు, దీని కార్య ప్రణాళికను తయారుచేయుటకై యీ క్రిందిసభ్యులుగల ఉపసంఘమును ఏర్పాటుచేయుచున్నారు. ఆ నివేదికను ౩ మాసములలో ప్రత్యేక గ్రంథాలయ ప్రతినిధుల సభ సమావేశపరచి ప్రవేశపెట్టవలెనని తీర్మానించుచున్నారు.

**ఉపసంఘ సభ్యులు:**

౧. మ. రా. శ్రీ పింగళి వేంకట్రామారెడ్డిగారు, అధ్యక్షులు
౨. ,, వేముగంటి రామకృష్ణారావుగారు

౩. మ. రా. శ్రీ మాదిరాజు రామకోటేశ్వరరావుగారు
౪. ,, మౌల్వీ రఫీయుద్దీన్ సాహెబుగారు
౫. ,, మల్లాది లక్ష్మీనరసింహారావుగారు, కార్యదర్శి

— గ్రం. స.—VI-8

## పుదుక్కోట ఐదవ గ్రంథాలయమహాసభ, పుదుక్కోట:

౪. గ్రంథాలయములు తమపరిసరప్రాంతజనులను జ్ఞానవంతులుగా నొనరించుటకీ క్రింది సాధనముల నుపయోగింపవలెనని తీర్మానించుచున్నారు.

(క) ఉపన్యాసములు (చ) మాజిక్‌లాంతరు ప్రదర్శనములు
(ట) వ్యవసాయపారిశ్రామిక ప్రదర్శనములు (త) సినిమాప్రదర్శనములు
(ప)—నాటక ప్రదర్శనములు (య) పురాణశ్రవణము

పైసాధనముల నమలులోనుంచుటకు ఉద్యోగులు, అనుద్యోగులు, ఉపాధ్యాయులు, కోఆపరేటివ్ ఇన్‌స్పెక్టర్లుగల సంఘములను స్థాపించవలెను.

భ. గ్రం. పత్రిక-I-1

అనుబంధము : ౬

# తాలూకా గ్రంథాలయమహాసభల తీర్మానములు

## కాకినాడతాలూకా గ్రంథాలయ ప్రతినిధుల ప్రథమమహాసభ, కాకినాడ:

౧.(చ) ప్రజలు తమగ్రామములందుండెడి ధర్మాదాయమునందుండి ఒకభాగమును గ్రంథాలయములకు సహాయముచేయుట కీ సభవారు కోరుచున్నారు.

౨.(చ) పుస్తకభాండాగారములను, పఠనమందిరములను 1860 సం. 21 ఆక్టు ననుసరించి ఉచితముగ రిజిష్టరుచేయుటకు ప్రభుత్వమువారి నీసభవారు కోరుచున్నారు.

3.(క) గ్రంథాలయ సంఘములు తమ చుట్టునున్న గ్రామములలో గ్రంథాలయోద్యమమును వ్యాపింపకృషిచేయుటకు ఈ సభవారు కోరుచున్నారు.

— గ్రం. స. II-3 & 4

## భీమవరంతాలూకా గ్రంథాలయమహాసభ, కుముదవల్లి:

3. శ్రీబషీరు అహమ్మదుగారిచే మద్రాసు శాసననిర్మాణసభయందు ప్రవేశపెట్టబడిన మద్రాసు గ్రంథాలయచట్టము (Bill No XI of 1933) ఈ రాజధానియందు ప్రాముఖ్యమగు వివిధదేశభాషలయొక్క వికాసమునకు దోహదమిచ్చునదిగా గన్పట్టుటలేదనియు, ప్రస్తుత దేశపరిస్థితిగతులయందు అభివృద్ధికి భంగకరముగనున్నదనియు, క్రొత్తపన్నులను వేయునట్టి ఎట్టిచట్టముగాని దేశమున ఆవరించియున్న ప్రస్తుత దుర్భర ఆర్థిక దుస్థితియందు ప్రవేశపెట్టుట భావ్యముకాదనియు ఈ సభవారు తీర్మానించుచు, ప్రభుత్వమువారికి విన్నవించుచున్నారు.

౫. గ్రామమునందలి విద్యావ్యాప్తికి ప్రాథమికపాఠశాలలవలె, గ్రంథాలయములు కూడతోడ్పడును. కాన, జిల్లాబోర్డువారు గ్రామగ్రంథాలయములకు విరివిగా విరాళములనిచ్చియు, గ్రంథాలయములు లేని గ్రామములయందు గ్రంథాలయములను నెలకొల్పియు, గ్రంథాలయాభివృద్ధి కలుగజేయగలందులకు ఈ సభవారు జిల్లాబోర్డువారిని కోరుచున్నారు.

గ్రం. స. IX-2

## తృతీయ భీమవరంతాలూకా గ్రంథాలయ మహాసభ, చినఅమిరం:

౪. ఇదివరకు గ్రంథాలయములను నిర్వహింపకున్న గ్రామపంచాయతీలు వారిగ్రామములలో నూతనగ్రంథాలయములను స్థాపించుటకును, గ్రామములో గ్రంథాలయములున్నచో నట్టిగ్రంథాలయములకు విరాళసహాయముచేయుటకును తాలూకాలోని అన్ని గ్రామపంచాయతీలను యీ సభవారు కోరుచున్నారు.

౫. గ్రామపంచాయతీ గ్రంథాలయములకు వార్తాపత్రికలను తెప్పించుకొని, తద్ద్వారా విషయములను గ్రహించునవకాశము గ్రామస్థులకివ్వగలందులకు గవర్నమెంటు వారిని ఈ సభవారు కోరుచున్నారు.

౬. గ్రామములలోనుండు సహకారసంఘములయందు నేర్పడు సాముదాయక నిధినం తయు ఆ యా గ్రామములందలి గ్రంథాలయములకిచ్చి, విద్యాభివృద్ధికి తోడ్పడ గలందులకు తాలూకాలోని సహకారసంఘములను ఈ సభవారు కోరుచున్నారు.

౭. రాష్ట్రీయ ప్రభుత్వమువారిచ్చు గ్రాంటులతో కొను పుస్తకములకు విద్యాశాఖాధి కారుల అనుమతి అవసరమనుట అన్యాయమని ఈ సభవారు నిర్ణయించుచు, అట్టి అనుమతిని లేకుండనే బహిష్కరింపబడని పుస్తకములనే గ్రంథాలయములవారు కొనుటకు అధికారమిచ్చుచు ఉత్తరువును జారీచేయించ గలందులకు మద్రాసు ప్రభుత్వమువారిని కోరుచు, అట్టిబహిష్కరణ పుస్తకములపట్టీని అన్ని గ్రంథాలయ ములకు ఉచితముగా పంపగలందులకు ఈ సభవారు ప్రభుత్వమువారిని వేడుచు న్నారు.

—గ్రం. స. IX-7

## తణుకు తాలూకా ద్వితీయ గ్రంథాలయ మహాసభ, రేలంగి:

౯. లోకలుబోర్డు ఇన్‌స్పెక్టరుగారు కేవల సంచాయతీ బోర్డులకు వార్తాపత్రికలయు, సిబ్బంది జీతములయు ఖర్చునుగూర్చి ముందు అనుమతిలేనిదే ఖర్చుచేయకూడదని జారీచేసిన 213 సర్క్యులరు రద్దుచేయుటకు కోరుచున్నారు.

౧౧. జిల్లావిద్యాశాఖాధికారిని సాలుకొకసారి నిషేధించిన గ్రంథముల జాబితా నకలును ప్రతి గ్రంథాలయమునకు పంపగోరుచున్నారు.

—గ్రం. స. -IX

## తాడేపల్లిగూడెంతాలూకా ద్వితీయ గ్రంథాలయమహాసభ, పెంటపాడు:

౬. ప్రతిసంవత్సరము గవర్నమెంటువారు గ్రంథాలయమునిమిత్తము శాంక్షనుచేయు చున్న సొమ్మునుండి గ్రామగ్రంథాలయములకేమియు వచ్చుటలేదు. సదరు విరాళపుసొమ్ము హెచ్చుగా శాంక్షను చేయుటకును, అందునుండి ప్రతిగ్రంథాలయము నకు అధమము రు 50 లు అయినను ముట్టునట్లు యేర్పాటుచేయుటకును ఈ సభ వారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

౭. జిల్లాయందంతటను గ్రంథాలయోద్యమము ప్రచారము చేయుటకు జిల్లాగ్రంథా లయోద్యోగినొకనిని నియమింపవలయునని ఈ సభవారు జిల్లాబోర్డువారిని కోరు చున్నారు.

౮. పంచాయతీ ద్రవ్యమును వార్తాపత్రికలకు వినియోగించరాదని లోకలుబోర్డు యిన స్పెక్టరుగారు జారీచేసిన 85 ఉత్తరువును రద్దుచేయించవలసినదిగ వారిని యీ సభ వారుకోరుచున్నారు.

౧౧.(అ) ఈ తాలూకాసంఘమువారు సిఫార్సుచేసిన గ్రంథాలయములకు, దైనికాంధ్ర పత్రికను సాలునకు రు 18-00 చొ॥న ఇచ్చుచున్నందులకు ఆంధ్రపత్రికా సంపా

దకులు శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి ఈ సభ వారు కృతజ్ఞతా వందనముల నర్పించుచున్నారు.

(౮) "భారతి" మాససంచికకు సాలునకు రు 4 లు చొప్పున ఈ తాలూకా సంఘము సిఫార్సు చేసిన గ్రంథాలయముల కిప్పించవలసినదిగా ఆంధ్రపత్రికా సంపాదకులను ఈ సభవారు కోరుచున్నారు.

౧౩. ఏటేట గవర్నమెంటువారు గ్రంథాలయముల నిమిత్తము శాంక్షను చేయుచున్న సొమ్మునుండి పంచాయతీ గ్రంథాలయములకుగూడ విరాళములిచ్చుటకు డైరెక్టరు ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ వారిని ఈ సభవారు కోరుచున్నారు.

—గ్రం. స. IX-8

## తాడేపల్లిగూడెము తాలూకా తృతీయ గ్రంథాలయమహాసభ, అలంపురము:

3. 1936-37 సం॥నకు తాలూకాను 12 గ్రూపులుగ విభజించుటకును, ఆయా గ్రూపులకు దిగువవారిని* డైరెక్టర్లను ఎన్నుకొనుటకును, వీరు తాలూకా గ్రంథాలయ సంఘమునకు కార్యనిర్వాహకవర్గముగ నేర్పడుటకును తీర్మానించడమైనది.

౫. గ్రూపు డైరెక్టర్లు వారివారి గ్రూపులయందలి గ్రంథాలయములకు మాసమునకొకసారి యైనను వెళ్లుచు తాలూకా కార్యదర్శికి మాసనివేదికలు పంపుట, గ్రంథాలయనిర్వాహకులకు తోడ్పడుట, వార్షికోత్సవములు, వర్ధంతులు, సభలు యేర్పాటు చేయుట, గ్రంథాలయసంఘమునకు సభ్యులను చేర్చుట మున్నగువిధముల కృషి చేయుచుండవలెను.

౬. పశ్చిమగోదావరి జిల్లాబోర్డువారిని, ఈ తాలూకాయందలి గ్రంథాలయోద్యమ వ్యాప్తికి

1. జిల్లాబోర్డు గ్రంథాలయముల పరిపాలనములో తోడ్పడుటకు గ్రంథాలయసభ్యులనుండి అయిదుగురుగల సలహాసంఘమును ఎన్నుకొనుటకును,

2. జిల్లాబోర్డు గ్రంథాలయములకు సభ్యత్వరుసుము 3 రూపాయలనుండి 1 రూపాయకు తగ్గించుటకును,

3. జిల్లాబోర్డు గ్రంథాలయములనుండి గ్రామ గ్రంథాలయములకు పుస్తకములు ఎరవిచ్చుటకును,

4. జిల్లాబోర్డు ఉపాధ్యాయులను గ్రామగ్రంథాలయములయందు ఉచితముగాగాని, కొంతపారితోషికముతోగాని పనిచేయుట కనుమతి యిచ్చుటకును,

5. జిల్లాబోర్డు గ్రంథాలయములందలి భాండాగారులకు తగుశిక్షణ (ట్రైనింగు) యిచ్చుటకును,

---

* స్థలాభావముచే గ్రూపులవివరాలు, వీటికి ఎన్నుకోబడిన డైరెక్టర్ల పేర్లు ఇక్కడ ఇచ్చుటలేదు.

6. జిల్లాగ్రంథాలయ నిర్మాత (ఆర్గనైజరు) ఒకరిని నియమించుటకును,
7. పంచాయతీబోర్డు గ్రంథాలయములకు సిబ్బందికి, వార్తాపత్రికలకు అగు ఖర్చు లోకల్ బోర్డు ఇన్‌స్పెక్టరుగారికి సిఫార్సుచేయుటకు జిల్లాపంచాయతీ ఆఫీసరును కోరుటకును,
8. తాడేపల్లిగూడెము గ్రంథాలయమును జిల్లా: కేంద్ర గ్రంథాలయముగ నభివృద్ధి చేయుటకును,
9. గ్రంథాలయము ఒక్కొక్కటికి రు 50/ లు చొప్పున జిల్లాబోర్డు నుండి విరాళ మిచ్చుటకును కోరడమైనది.

కొవ్వూరుతాలూకా గ్రంథాలయ ప్రథమ మహాసభ, నిడదవోలు :

౨. ఈ తాలూకాయందలి ప్రతిగ్రామమునందును గ్రంథాలయమును, పఠనమందిర మును పెట్టుటకును, అందువలన వయోజనవిద్యావ్యాప్తికి తోడ్పడుటకును ఈ సభవారు తాలూకాప్రజలను కోరుచున్నారు.

౧౧. ప్రతిగ్రంథాలయమందును తప్పక రాత్రిపాఠశాలను నెలకొల్పుటకు కోరు చున్నారు. — గ్రం. సర్వస్వము X-8

దివితాలూకా ద్వితీయ గ్రంథాలయ మహాసభ, పెదకళ్లేపల్లి :

౧. దివితాలూకా ప్రజలతరఫునను, గ్రంథాలయములతరఫునను శ్రీపట్టమజార్జి చక్ర వర్తిగారి పట్టాభిషేకమున ఈ సభవారు తమ రాజభక్తిని వెల్లడించుచున్నారు.
౪. గ్రామసేవాపద్ధతులందు, అందు ముఖ్యముగ గ్రంథాలయ విషయములందు తరిబీతుపొందుట గ్రామగ్రంథాలయములవారికి అత్యవసరమనియు, ఇందుకుగాను బందరు అకాడమీ ఆఫ్ కల్చర్ వారిచే యేటేట యేర్పాటుచేయబడుచున్న వేసవి తరగతులలో చేరుట యుక్తమనియు యీ సభవారు తీర్మానించుచున్నారు.
౫. ప్రతిగ్రామమునందును పనిచేయుచున్న బోర్డు ఉపాధ్యాయులు విద్యావ్యాప్తి కొరకై గ్రంథాలయములలో కార్యనిర్వాహక సభ్యులుగనుండుటకు తగిన ఆదేశము దయచేయించగలందులకు తూర్పుకృష్ణాజిల్లా బోర్డువారిని యీ సభవారు కోరుచున్నారు. — గ్రం. సర్వస్వము X-10

తెనాలితాలూకా గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ, కూచిపూడి :

౧. 1920 వ సం॥నకు మదరాసు దొరతనమువారు రాజధానియందుగల గ్రంథాలయో ద్యమవ్యాప్తికై రు 20,000/- వెచ్చింపదలచినందుల కీసభవారు వందనములర్పించుచు, యేటేట యీ మొత్తముకంటె యెక్కువసొమ్మునిచ్చుటకును, యీద్రవ్య ము సంచారగ్రంథాలయములను నెలకొల్పుటకు ఆ యా మండల గ్రంథాలయ సంఘములకును, తాలూకా గ్రంథాలయ సంఘములకును విరివిగా నొసంగుచు, యీద్రవ్యమును సక్రమముగా పంచిపెట్టుటకు గ్రంథాలయోద్యమమునం దెక్కువగా పనిచేయుచున్న అనధికారసభ్యుల నొక సంఘముగా నేర్పరచుటకుగాను ప్రభుత్వమువారి నీసభవారు కోరుచున్నారు.
3. తెనాలితాలూకా గ్రంథాలయోద్యమవ్యాప్తికి తాలూకా [illegible] ములకు విరివిగా ధనమొసంగుటకు తెనాలితాలూకా, గుంటూరు జిల్లా బోర్డు వారి నీసభవారు ప్రార్థించుచున్నారు.

౪. తెనాలితాలూకాలోని ప్రతి గ్రంథాలయమువారును బాలభట పటాలములను తెఱచి యీ యుద్యమమును తాలూకాయందంతటను పెంపొందింపవలెనని ఈ సభవారు హెచ్చరించుచున్నారు. — గ్రం. సర్వస్వము IV-4

## రేపల్లెతాలూకా చతుర్థ గ్రంథాలయ మహాసభ, ధూళిపూడి :

౨. తాలూకా సంఘమువారి కోరికపై తాలూకాలోని అన్ని గ్రంథాలయములకును ఆంధ్ర దినపత్రికను సం॥ 1కి రు 18. 00 తగ్గింపురేటుకు ఇచ్చుట కంగీకరించిన శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు, ఎం. ఎల్. ఏ. గారి ఉదారతకు ఈ సభవారు తమ హృదయపూర్వక కృతజ్ఞతను వెల్లడించుచున్నారు.

౪. మహారాజశ్రీ వల్లూరు సూర్యనారాయణరావు పంతులుగారు వారి ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము (కొవ్వూరు) తరఫున పుస్తక ప్రచురణ నిధి నేర్పాటుచేసి, సంవత్సరమున కొక పుస్తకము నచ్చొత్తించి, గ్రంథాలయముల కుచితముగ సొంత ఖర్చులతో పంపుచున్నందులకు వారి ఉద్యమాభిమానమును ఈ సభవారు కొనియాడుచున్నారు. — గ్రం. సర్వస్వము X-9

## ప్రథమ పల్నాడు గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ, గంగవరము :

౧. (క) దేశభక్తాగ్రణియు, సుప్రసిద్ధ విద్వాంసుడును, గీతా రహస్య రచయితయు నగు శ్రీ లోకమాన్య బాలగంగాధర తిలక్‌గారి నిర్యాణమునకు యీ సభవారు తమ విషాదమును తెలుపుచు, వారి యాత్మకు శాంతిని ప్రసాదించవలెనని సర్వేశ్వరుని ప్రార్థించుచున్నారు.

(చ) లోకమాన్యుని జ్ఞాపకార్థము ప్రతి సంవత్సరమును వారి నిర్యాణ దినమున స్మారకోత్సవములను జరుపుచుండవలెనని గ్రంథాలయాధిపతుల నీ సభవారు ప్రోత్సహించుచున్నారు.

౫. ఇటీవల మదరాసు ప్రభుత్వమువారు గ్రంథాలయముల కొసంగెదమని ప్రకటించిన విరాళమును ప్రస్తుతపరిస్థితులలో తాలూకాయందలి ఏగ్రంథాలయమును స్వీకరించకూడదని యీ సభవారు తీర్మానించుచున్నారు. — గ్రం. సర్వస్వము IV-6

## కంభం, మార్కాపురం తాలూకాల గ్రంథాలయముల ప్రథమ మహాసభ, బేస్తవారపుపేట :

౬. శేషాద్రి రమణకవులచే రచియింపబడిన గ్రంథములను, అందుముఖ్యంగా మహాత్మాగాంధిగారిచే మెప్పువడసిన "దాసబోధ" అను గ్రంథమును, వేలమూరి జానకిరామశాస్త్రిగారిచే ప్రకటింపబడుచున్న రామాయణగ్రంథమును గ్రంథాలయములవారును, విద్యాశాఖవారును అన్నివిధముల ప్రోత్సహింపవలయునని యీ సభవారు కోరుచున్నారు. — గ్రం. సర్వస్వము VIII-3

## ధర్మవరముతాలూకా ద్వితీయ గ్రంథాలయ సమావేశము, నాగసముద్రము:

౨. గ్రంథాలయములను రిజిష్టరుచేయించుటకై 1860 సంవత్సరము XXI ఇండియా ఆక్టులో విధింపబడియుండు రు 50/- రుసుమును తగ్గించుటకై తగినసవరణల

నుపపాదించు నదిగా భారతశాసనసభకు మనరాయలసీమ ప్రతినిధిగా నెన్నుకొనబడియుండు శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగారిని కోరుటకు తీర్మానించటమైనది.

3. ప్రతి గ్రామపంచాయతీబోర్డువారును తమ స్వాధీనముననుండు గ్రంథాలయమునకు తమగ్రామపాఠశాలలో పాటుపడుచుండు ఉపాధ్యాయ మహాశయుల గ్రంథభాండాగారులుగా ఉపయోగించుకొనుట చాలాశ్రేయస్కరమని ఈ సభవారు సూచించుచున్నారు.

౪. ధర్మవరముతాలూకా గ్రంథాలయసంఘమువారు గ్రామసీమలందు విజ్ఞానప్రచారమునకై పూనుకొన్న సంచారగ్రంథాలయోద్యమమును జయప్రదముగా కొనసాగించుటకు ధర్మవరము తాలూకాబోర్డువారు మంజూరుచేసియుండిన రు 100/- విరాళమును త్వరలో శాంక్షన్ చేసి యిప్పించునట్లు అనంతపురము జిల్లాబోర్డువారిని ప్రార్థించుచు తీర్మానించడమైనది.

౫. ధర్మవరమునందు శ్రీ క్రియాశక్తిఒడయర్ గ్రంథాలయమునకు సుందరమందిరము నిర్మించి, శాశ్వతకీర్తినార్జించి, మనమండలమున యితరులకు మార్గదర్శకులైన శ్రీయుత బండ్లపల్లి లక్ష్మీనారాయణశ్రేష్ఠిగారికి ఈ సభవారు తమ హృదయపూర్వక అభివందనము లర్పించుచున్నారు. — గ్రం. సర్వస్వము IX-4

అనుబంధము: ౭

# జిల్లా, తాలూకా, ప్రాంతీయ మహాసభల అధ్యక్షుల పరిచయము

## ౧. శ్రీ ప్రభల లక్ష్మీనరసింహముగారు

[1878 - 1939]

జననం విజయనగరంలో. బాల్యం కొంత హరికథా పితామహుడు ఆదిభట్ల నారాయణదాసుగారి యింట గడచినది. కలియుగ భీముడు కోడి రామమూర్తిగారు వీరి సహాధ్యాయి. విజయనగరం మహారాజావారి కాలేజీలో 1898 లో పట్టభద్రులైనారు. తర్వాత యిక్కడనే కొంతకాలం ఉపాధ్యాయులుగ పనిచేసినారు. 1902వ సంవత్సరములో బి. యల్. పరీక్ష నిచ్చినారు. 1905 లో విశాఖపట్నంలో కాపురం పెట్టి 1910 నుండి హైకోర్టు వకీలుగ పనిచేసినారు. ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజమునకు చాలాకాల మధ్యక్షులుగ నుండినారు. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి షష్టిపూర్త్యుత్సవసభ కధ్యక్షత వహించినారు. భారత నాయకులు మహాత్మా గాంధీ, బాబూ రాజేంద్ర ప్రసాద్, జవహర్‌లాల్ నెహ్రూ మున్నగువారు విశాఖపట్నమునకు వచ్చినప్పుడు జరిగిన బహిరంగ సభల కధ్యక్షత వహించి వారి ఉపన్యాసముల ననువదించేవారు. కాంగ్రెసు మహాసభలకు తరచుగ వెళ్ళుచుండెడివారు. బహు భాషా కోవిదులు; ఆంగ్ల, లాటిన్, ఫ్రెంచి, జర్మన్, సంస్కృత, ప్రాకృత, ఆంధ్ర, తమిళ్, హిందీ, పర్షియన్, ఒరియా మున్నగు ప్రాచీనాధునిక భాషలు నేర్చినారు. వైదిక, రాజకీయ, సాంఘిక, ధర్మ, న్యాయశాస్త్రము లభ్యసించినారు. ఆంధ్రోద్యమములో ప్రముఖపాత్ర వహించినారు. వీరికి 1934 లో ఆంధ్ర యూనివర్సిటీవారు "వేద విద్యా విశారద" బిరుదమును, 1936 లో శ్రీ జగద్గురు కామకోటి పీఠాధిపతులు "చంద్రమౌళీశ్వర కృపాపూర్ణ" యను బిరుదమును ప్రసాదించినారు. మహావక్త. మంచి రచయిత. ప్రపంచంలోని ప్రముఖ మత గ్రంథములను చదివి జీర్ణించుకొన్న దిట్ట. జయదేవుని గీత గోవిందము తెలుగున కంద పద్యములలో వ్రాసిన కవి.

చిత్రాడలో జరిగిన తృతీయ గోదావరి మండల గ్రంథాలయ మహాసభాధ్యక్షులు.

## ౨. శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి (కవి) గారు

[1874 - 1951]

జన్మస్థలం కృష్ణా జిల్లా గన్నవరం తాలూకా కనకవల్లి అగ్రహారం. కార్యక్షేత్రం విశాఖపట్నం. తెలుగుబాస పుట్టు పూర్వోత్తరాలు తెలిసిన 'తెలుగునలువ.' కవి; పండిత నటుడు; నాటకకర్త; నాట్యాచార్యుడు; రాజకీయనాయకుడు; జాతీయవాది; స్ఫూర్తి. ఆంధ్ర గ్రంథాలయోద్యమ నాయకులలో ఒకరు. కలాభిలాషక నాటక

సమాజం, సంగీత మానినీ సమాజం (కళావంతుల సంస్కరణ సంస్థ), దంత కళాశాల, ధర్మాశ్రమం, రామలీలోత్సవం, హిందూ పఠన మందిరం, వసంత పఠన మందిరం, స్వరాజ్య సమితి, ప్రజాసంఘం, కవితా సమితి, తెలుగు గుడి మొదలైన సంస్థల స్థాపకులు. తెలుగు సంధ్యా వందనం, తెలుగు తోబుట్టువులు, తెనుగు నుడిదండలు, నన్నయ నుడులు, నుడి కడలి మొదలైన గ్రంథాలు, ఎన్నో నాటకాలు, కావ్యాలు, విమర్శలు, వ్యాసాలు వ్రాశారు.

1921 లో కాంగ్రెసులో చేరారు. విశాఖ జిల్లాకు నాయకత్వం వహించారు. ఉప్పు సత్యాగ్రహంలో కారాగృహ శిక్ష అనుభవించారు. 1918 లో విశాఖపట్నంలో జరిగిన ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ ఆహ్వాన సంఘ కార్యదర్శి; విశాఖ జిల్లా గ్రంథాలయ సంఘమునకు కొన్నాళ్ళు అధ్యక్షులు. తొలి విశాఖ జిల్లా గ్రంథాలయ మహాసభకు అధ్యక్షులు. 1921 వ సంవత్సరంలో విశాఖపట్నంలో జరిగిన మండల గ్రంథాలయ మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులు. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి కొన్నాళ్లు ఉపాధ్యక్షులు, కొన్నాళ్లు కార్యనిర్వాహక సంఘాధ్యక్షులు. 1941 లో రాజమహేంద్రవరములో జరిగిన 22 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ అధ్యక్షులు.

1921 లో విశాఖపట్నంలో జరిగిన విశాఖపట్టణం మండల గ్రంథాలయ ప్రత్యేక మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులు.

## ౩. శ్రీ గురజాడ దుర్గాప్రసాదరావుగారు

## [1883 – 1946]

జననము కాకినాడలో. ఆంధ్ర కవుల చరిత్ర రచయిత శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారి పుత్రులు. తండ్రిగారు విజయనగర సంస్థానమున చరిత్ర పరిశోధకులుగ నున్నప్పు డక్కడనే బి. ఏ. పట్టమును పొంది, మదరాసులో ప్లీడరు పరీక్ష నిచ్చి, 1921 వ సంవత్సరంలో విశాఖపట్నంలో న్యాయవాదిగా జీవితాన్ని ప్రారంభించినారు. సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో పండితులు. సారస్వతాభిమానులు. క్రీడలందు అమితాసక్తిగలవారు. టెన్నిస్, క్రికెట్, చదరంగపు టాటలలో నిపుణులు. స్ఫురద్రూపి; మితభాషి; వాక్చాతుర్యమున దిట్ట. తండ్రిగారి కవి జీవితములలో అనేక విషయములు చేర్చి సంస్కరించిన పరిశోధకులు..

1921 వ సంవత్సరంలో విశాఖపట్నంలో జరిగిన విశాఖపట్టణ మండల గ్రంథాలయ ప్రత్యేక మహాసభాధ్యక్షులు.

## ౪. శ్రీ విస్సా అప్పారావుగారు

## [1884– ]

జననం తూర్పు గోదావరి జిల్లా పెద్దాపురం. 1907 నాటికి ఎం. ఏ., ఎల్. టి. పరీక్షలలో ఉత్తీర్ణులు. 1907–38 సంవత్సరములలో మదరాసు ప్రభుత్వం విద్యాశాఖలో వివిధ పదవులను నిర్వహించినారు. 1938–41 సంవత్సరములలో వాల్తేరు నందలి ఆంధ్ర యూనివర్సిటీ కళాశాలలకు ఆచార్యులుగ, అధ్యక్షులుగ నుండినారు. 1942 వ సంవత్సరము నుండి నేటివరకు ప్రజాసామాన్యాని కుపయోగించే విజ్ఞానశాస్త్రము, లలితకళల

ప్రచారాని కుపయోగించే గ్రంథాల రచన, ప్రచురణలలో నిమగ్నులై యున్నారు. అణుశక్తికి సంబంధించిన రెండు పుస్తకాలను 1956-61 సంవత్సరములలో తెలుగులో ప్రచురించినారు. డాక్టరు సి. వి. రామన్‌గారి 'విజ్ఞాన ముఖములు' (Aspects of Science) తెలుగులోనికి అనువాదంచేసినారు. 7-14 సంవత్సరముల పిల్లలకొరకు వీరు ప్రచురించిన 'ఆకాశవాణి' గ్రంథం కేంద్ర ప్రభుత్వంవారి బహుమతి (రు. 1,000) పొందింది. 1927 నుండి మదరాసు మ్యూజిక్ అకాడమీ సభ్యులు. 1946 నుండి రాజమండ్రిలోని ఆంధ్ర గానకళా పరిషత్ వారి మదరాసు కమిటీ కన్వీనరు. 1958 లో స్థాపింపబడిన క్షేత్రయ్య పదాభినయ ప్రచార సమితి అధ్యక్షులు.

1948 నుండి రాజమండ్రిలోని దామెర్ల రామారావు స్మారక ఆర్టు గాలరీ, పాఠశాలల కార్యదర్శి, కోశాధిపతి. 1954 నుండి ఆంధ్ర యూనివర్సిటీవారి బోర్డు ఆఫ్ స్టడీస్ సంగీత శాఖా సభ్యులు. పదార్థ విజ్ఞాన శాస్త్రం, ఆంధ్ర సంస్కృతి - విద్య, సంగీతం, నాట్యం మున్నగు విషయాలపై తెలుగు, కన్నడ విజ్ఞాన సర్వస్వ సంపుటములలోని అనేక వ్యాసాల రచయిత. కొంతకాలం ఆకాశవాణి హైదరాబాదు, విజయవాడ స్టేషనుల కార్యక్రమాల సలహా సంఘ సభ్యులు. అయిదేండ్లనుండి క్రొత్త ఢిల్లీలోని ఆకాశవాణి సంగీత సలహా బోర్డు సభ్యులు. తెలుగు, ఇంగ్లీషు భాషలలో విద్య, విజ్ఞానశాస్త్రం, కళ, సంగీతాలకు సంబంధించి ఆకాశవాణిలో శతాధిక ప్రసంగాలు ప్రసారం చేసిన విజ్ఞులు. శాస్త్ర విజ్ఞానము, చరిత్ర - తెలుగు ఉరుదూ అకాడమీ కార్యనిర్వాహక సభ్యులు.

1917 వ సంవత్సరంలో అమలాపురంలో జరిగిన గోదావరీ మండల గ్రంథాలయ ప్రతినిధుల ప్రథమ మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులు.

## ౫. శ్రీ కొండిపర్తి వీరభద్రాచార్యులు (స్వామి తత్వానంద) [1881 - 1952]

జన్మస్థానం కృష్ణాజిల్లా బందరు. 1904 నాటికి నోబిల్ కాలేజీలో బి. ఏ. చదివినారు. దేశభక్తి, దైవచింత చిన్ననాటినుండి అలవడినవి. దేశ హితైక ఉద్యమములన్నింటిలోను భాగస్వాములు. ఉపాధ్యాయ వృత్తిలో 20 సంవత్సరాలకు పైగా ఉన్నారు. బందరు జాతీయ కళాశాలలో కొన్నాళ్ళు అధ్యాపకులు. 1927 వ సంవత్సరంలో సన్యాసాశ్రమమును స్వీకరించి శ్రీ తత్వానందస్వాములైనారు. తదాదిగ జీవితాన్ని పూర్తిగా దేశసేవకు, భాషాసేవకు, ఆధ్యాత్మిక ప్రబోధానికి వినియోగించినారు. వందేమాతరం, సహాయ నిరాకరణోద్యమం, ఉప్పు సత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమాలలో పాల్గొన్నారు. ఆంధ్రదేశములోని ప్రసిద్ధములైన వ్యాసాశ్రమము, శాంత్యాశ్రమము, ఓంకారాశ్రమము, వినయాశ్రమము, కృష్ణాశ్రమములలో నుండి ఎనలేని సేవచేసినారు. వీరు శ్రీ వివేకానంద భక్తులు; గాంధీజీ అనుయాయులు. సారస్వత రంగంలో వీరి కృషి అసామాన్యమైనది. గ్రంథ రచనలో, అనువాదములో సిద్ధహస్తులు. 50 కి మించిన వీరి రచనలలో జ్ఞానప్రియ, కుశలవబోధిని, శ్రీశ ప్రసాద్, రామకృష్ణ సూక్తి ముక్తావళి, శ్రీ వివేకానంద లేఖావళి, (వివేకానందుని) సందేశ తరంగిణి - 2 భాగములు, విద్యార్థులారా, వార్ధా విధానము, దైవీశక్తి, స్త్రీధర్మ ప్రదీపిక, శాశ్వత

పరిపోషణము - 2 భాగములు, పౌరధర్మ ప్రకాశిక, మన కర్తవ్యము, గాంధేయ ధర్మ చక్రము, గాంధీజీ సద్బోధమాల సుప్రసిద్ధములు.

1928 ఏప్రిల్ 19 వ తేదీన భీమవరములో జరిగిన పశ్చిమ గోదావరి మండల గ్రంథాలయ మహాసభాధ్యక్షులు.

## ౬. శ్రీ కోటగిరి వేంకట కృష్ణారావుగారు

[1890 - ]

జన్మస్థలము కృష్ణా జిల్లా నూజివీడు. గంపలగూడెం కుమార రాజాగా ప్రసిద్ధికెక్కిన వీరు కాంగ్రెసులో చేరి జాతీయోద్యమానికి ఎనలేని సేవజేసిరి. మహావక్తగా పేరుమోసిరి. ఉప్పుసత్యాగ్రహములో పాల్గొని శ్రీకృష్ణ జన్మస్థానము నలంకరించిరి. ఆంధ్రోద్యమము, గ్రంథాలయోద్యమములలో కృషి చేసిరి. కవి పండిత పోషకులు. కృతికర్తలు. ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి' కృతిభర్తలు.

వీరి రచనలు: 1. శృంగార తిలకము (ఆంధ్రీకృతి), 2. యౌవన నిగర్హణము, 3. చాటు పద్యములు, 4. శ్రీ కృష్ణరాయ నాటకావళి (అభినవ పాండవీయము, పాదుషా పరాభవము, బెబ్బులి, ప్రణయాపద్భము), 5. మాతృదేశ శతకము, ౬. విధి (పద్యకావ్యము), 7. దేవదాసి (అముద్రిత నాటకము), 8. ఘోషావ్యాస ఖండనము, (9) వేదవతి. ప్రస్తుతం రామాయణమును నాటకరూపమున వెలయించుచున్నారు.

జగ్గయ్యపేటలో జరిగిన ద్వితీయ కృష్ణా మండల గ్రంథాలయ మహాసభాధ్యక్షులు.

## ౭. శ్రీ తల్లాప్రెగడ సూర్యనారాయణరావుగారు

[1874 - 1926]

జననం పశ్చిమ గోదావరి జిల్లా కోనాల గ్రామంలో. 1892 లో బి. ఏ. పరీక్ష పూర్తి చేసి 1894 లో ప్లీడరు పట్టా పుచ్చుకొన్నారు. తణుకులో న్యాయవాదిగా వృత్తిని స్వీకరించినారు. 10 సంవత్సరాలపాటు 'సువర్ణలేఖ' పత్రికాధిపతి. సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో పండితులు; కవి; గ్రంథకర్త.

1910 వ సంవత్సరం ప్రాంతమున కొవ్వూరుకు తమ నివాసమును మార్చుకొన్నారు. విద్యా పరిషత్తులు, గ్రంథ భాండాగారములు స్థాపించి పోషించుటకు పూనుకొన్నారు. కొవ్వూరులోని ఆంధ్ర గీర్వాణ విద్యా పీఠమునకు తమ జీవితమును ధారవోసినారు. అహర్నిశలు కృషి చేసి, ఎంతో శ్రమపడి స్వహస్త, పర హస్తములతో దీనికి కావలసిన హంగులను సమకూర్చినారు. విద్యాదానముతోపాటు విద్యార్థుల కన్న సత్రమును, దేవీ - విష్ణు శివాలయములను ప్రతిష్ఠించినారు. భక్తిపరములగు సప్తాహములు, అర్చనలను తరచు గావించుచు ఆధ్యాత్మిక చింతనకు అవకాశములు కలుగ జేసినారు. కవులను, పండితులను ఎంతగానో ఆదరించినారు. వీరి రచనలు: హిందూ దేశ ఆర్థికచరిత్ర, లోకానుభవము, వినోదిని, సీతారామము, మాధవీ కంకణము, మీరాబాయి, రాధారాణి, బుద్ధనాటకము, భాగినేయ వియోగము,

వణిక్పుర వర్తకోదంతము, పాంథస్వప్నము, హేలావతి, చంద్రశేఖరము, ప్రభావతీ ప్రద్యుమ్న విమర్శ, ఉత్తర రామచరిత విమర్శ (ఇంగ్లీషు, తెలుగు, సంస్కృత భాషలలో.)

**1918** వ సం. లో గంపలగూడెములో జరిగిన **మూడవ** కృష్ణా మండల గ్రంథాలయ మహాసభ అధ్యక్షులు.

## ౮. శ్రీరాయసం వెంకట శివుడుగారు
## (1870 – ? )

జననము పశ్చిమ గోదావరి జిల్లా వేలివెన్ను గ్రామంలో. బాల్యము రేలంగిలో గడచినది. రాజమహేంద్రవరములోని రాజకీయ కళాశాల పట్టభద్రులు. ఎం. ఏ., యల్. టి. పరీక్షలలో ఉత్తీర్ణులు. కందుకూరి వీరేశలింగం పంతులు గారి శిష్యులు. వారి నాయకత్వమున నడచిన సంఘ సంస్కరణ, సారస్వతోద్యమములలో పాల్గొని దేశ సేవ చేసిన వారు. ఉత్తమమైన ఉపాధ్యాయ వృత్తిని చేపట్టి, బెజవాడలోని క్రైస్తవ పాఠశాలోపాధ్యాయులుగ ఉద్యోగంలో ప్రవేశించి, గుంటూరులోని ఆంధ్ర క్రైస్తవ కళాశాల ఆంగ్లోపన్యాసకులుగ కొంతకాలం పనిచేసి, కడపట నెల్లూరులోని వెంకటగిరి రాజావారి కళాశాలాధ్యక్షులుగ పదవీ విరమణం చేసినారు. ఆంధ్ర యూనివర్సిటీ తెలుగు అకేటరుగ, సెనెటరుగ, ఇతర పాలక వర్గము లందు సభ్యులుగ కొంతకాలం గౌరవ పదవుల నలకరించినారు. మద్రాసు విశ్వ విద్యాలయంతో వీరికి సన్నిహిత సంబంధముండినది. సత్య సంవర్ధని, జనానా పత్రి కలను నిర్వహించినారు. ఇతర పత్రికలకు వ్యాసములు వ్రాసినారు. ఆత్మ చరిత్రము, శ్రీ వీరేశలింగ సంస్మృతి, చిత్రకథా మంజరి, వ్యాసావళి, హిందూ సుందరులు, కమ లాక్షి, రాజేశ్వరి, ఇంగ్లీషు వారి సంసార పద్ధతులు, లలిత కథావళి వీరి రచనలు. గ్రంథాలయోద్యమము పట్ల వీరి అభిమానము స్తుతి పాత్రము. కొంత కాలం గుంటూరు తాలూకా గ్రంథాలయ సంఘాధ్యక్షులు.

**1918** వ సం, లో సత్తెనపల్లిలో జరిగిన మూడవ గుంటూరు మండల గ్రంథాలయ ప్రతినిధుల మహాసభాధ్యక్షులు.

## ౯. శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు
## (1863 – 1939)

**1893** నుండి **1904** వరకు రెవిన్యూ శాఖోద్యోగి. ఆపైన **1904 – 1920** సం.లలో మదరాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఆంధ్ర పండితులు. వారి తొలి కృతి 'శ్రీ కుమారా భ్యుదయ' మను ప్రబంధము. ఆంధ్ర వాల్మీకి రామాయణము – మంథరము పేరుతో వ్రాయబడిన దీని వ్యాఖ్య వీరి కీర్తి నాచంద్ర తారార్కము గావించినవి. వీరు రామ భక్తులు. కనుక తమ రామాయణమును ఒంటిమెట్ట (కడప జిల్లా) కోదండ రామస్వామి వారి కంకితము చేసినారు. అచ్చటి ఆలయ పునరుద్ధరణకు తమ సర్వస్వము నర్పించినారు. ఉద్యోగ విరమణకు పిమ్మట 'భక్తి సంజీవనీ పత్రిక' ను నిర్వహించినారు. పిల్లల నిమిత్తం ఆర్య కథానిధి **8** భాగములు, పురాణ పురుషులయు. స్త్రీలయు జీవిత

చరిత్రలు రచించినారు. వివిధ వయసులలోని స్త్రీ, పురుషుల కుపకరించు హితచర్యా గ్రంథములు, కౌసల్యా పరిణయమను ప్రబంధము, సుభద్రా విజయమను నాటకము వీరి మరికొన్ని రచనలు. వీరి కృష్ణావతారమొక ఉద్గ్రంథము. వీరి సులభ వ్యాకరణము విద్యార్థులకు చాల ఉపయోగకరమైనది. అవసాన దశలో వీరు విరాగులై వాసుదాసు నామమును స్వీకరించి టెంకాయ చిప్పలో భోజనము చేయుచు దీనిపై నొక శతకమును వ్రాసినారు.

నెల్లూరు మండల ప్రథమ గ్రంథాలయ మహాసభ అధ్యక్షులు.

## శ్రీ సూరి వెంకట నరసింహశాస్త్రిగారు

## (1860 - 1933)

జన్మస్థానం కృష్ణాజిల్లా గన్నవరం తాలూకాలోని బాహుబలేంద్రుని గూడెం. బందరు నోబుల్ కళాశాలలో ఎఫ్. ఏ. పూర్తిచేసి కొంతకాలం ఉపాధ్యాయ వృత్తిలో నుండి పిమ్మట సెకండ్‌గ్రేడ్ ప్లీడరుగ న్యాయవాద వృత్తి నవలంబించినారు. మధ్య కాలంలో పట్టభద్రులై ఫస్టు గ్రేడ్ ప్లీడరు పరీక్షను కూడ ఇచ్చినారు. 1912 నుండి గ్రంథాలయ సేవావ్రత దీక్షను బూని జీవితాంతం వరకు దీని సేవలు చేసినారు. విజయవాడలోని శ్రీరామమోహన ధర్మ పుస్తక భాండాగారమునకు ప్రథమాధ్యక్షులు. ప్రథమ ఆంధ్రదేశ గ్రంథ భాండాగార మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులు. 1919 వ సం. లో మదరాసులో జరిగిన ప్రథమ అఖిల భారత గ్రంథాలయ మహాసభ నిర్వహణలో భాగస్వాములు. దీనిద్వారా ఏర్పడిన అఖిల భారత పౌర గ్రంథాలయ సంఘములో ప్రముఖ కార్యకర్తలు. ఆరవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ అధ్యక్షులు. పుదుకోట రాజ్య గ్రంథాలయ ప్రథమ మహాసభకు, బెల్గాంలో జరిగిన ప్రథమ కర్నాటక రాష్ట్ర గ్రంథాలయ మహాసభకు అధ్యక్షులు. గ్రంథాలయ సర్వస్వములోను, ఇతర పత్రికలలోను గ్రంథాలయోద్యమమును గూర్చిన వ్యాసముల ద్వారా గ్రంథాలయ విజ్ఞాన వ్యాప్తికి చాల తోడ్పడినారు. ఆంగ్లంలో "పౌర గ్రంథాలయాలు: ఇంటు, బయట" (Public libraries at home and abroad) అను వ్యాసము వీరి రచనలలో విశిష్టమైనది. మహాత్మ గాంధీ నిర్మాణ కార్యక్రమము పట్ల వీరికి మిక్కిలి మక్కువ. గ్రంథాలయోద్యమంతో పాటు సహకారోద్యమంలో కూడ వీరు పాల్గొని పని చేసినారు. ఆగిరిపల్లి వేదశాస్త్ర పాఠశాల సంస్థాపకులు. 1908 నుండి జీవితాంతం వరకు దీని ట్రస్టీగ నుండినారు.

ఐదవ పుదుకోట గ్రంథాలయ మహాసభకు అధ్యక్షులు.

## శ్రీ పురిపండా అప్పలస్వామిగారు

## (1904 - )

జననం శ్రీకాకుళం (పూర్వం విశాఖపట్నం) జిల్లా సాలూరు గ్రామంలో. తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఒడియా, బాంగ్లా, సంస్కృత భాషలలో చక్కని పరిచయమున్నది. కవి, జర్నలిస్టు, బహు గ్రంథకర్త. 1921 అసహాయోద్య

మంలో చేరారు. ఖాదీ ఉద్యమంలో పని చేశారు. విశాఖ నుండి వెలువడిన జాతీయ పత్రిక 'స్వశక్తి' సహాయ సంపాదకులుగా పని చేశారు. 1921 లో గజపతి నగరం తాలూకా మరడాంలో కామేశ్వరీ గ్రంథ పేటిక స్థాపించి ఆనాటి నుంచి గ్రంథాలయోద్యమంలో పాల్గొంటున్నారు. కొన్నాళ్లు విశాఖ జిల్లా గ్రంథాలయ సంఘాధ్యక్షులు. విశాఖ జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీకి విశాఖపట్నం మునిసిపల్ కౌన్సిలు పక్షమున ఒకసారి సభ్యులుగా ఎన్నికైనారు. మరొకసారి ప్రభుత్వం చేత నియోజితులయినారు.

కవితా సమితి స్థాపకులు. ఇప్పుడు దాని అధ్యక్షులు. మహాభారతం, రామాయణం, భాగవతం, దేవీ భాగవతం వాడుక భాషలో వ్రాశారు. ఇంగ్లీషు, హిందీ, సంస్కృతం, బాంగ్లా, ఒడియా భాషలనుండి ఎన్నో గ్రంథాలు తెలుగు చేశారు. 1963 లో హైదరాబాదులో పక్షందినాలు జరిగిన అఖిల భారత రచయితల సభకు అధ్యక్షులు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ స్టేట్ లైబ్రరీ కమిటీ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీల సభ్యులు.

1933 లో విశాఖపట్నంలో జరిగిన 14 వ కళింగదేశ గ్రంథాలయ మహాసభకు సన్మాన సంఘాధ్యక్షులు.

## శ్రీ భూపతిరాజు వేంకటపతిరాజు గారు

## (1872 – 1943)

జన్మస్థలము విశాఖపట్నం జిల్లా భీమునిపట్నం తాలూకా రేవిడి గ్రామం. విజయనగరంలో మెట్రిక్యులేషన్ పరీక్ష పూర్తిచేసి మదరాసులో బి. ఏ., బి. యల్. డిగ్రీలు పుచ్చుకొని, విశాఖపట్నంలో న్యాయవాద వృత్తిని నిర్వహించినారు. సాంఘిక, రాజకీయ రంగములలో ప్రవీణులు. ఆంధ్ర మహాసభ నిర్వాహకులలో ప్రముఖులు. విశాఖపట్టణ పురపాలక సంఘమునకు చిరకాల మధ్యక్షులు. అఖిల భారత క్షత్రియ మహాసభ స్థాపకులు. విశాఖపట్నంలో పంచముల (హరిజనుల) అభివృద్ధికై నెలకొల్ప బడిన సంస్థకు అధ్యక్షులు. ఫిజీ దీవులలోని హైందవుల కష్టములను విచారణ చేయుటకై ప్రభుత్వం నియమించిన సంఘమున కధ్యక్షులు. మదరాసు శాసన సభకు రెండుసార్లు, ఢిల్లీ శాసన సభకు రెండుసార్లు సభ్యులుగ ఎన్నికైనారు. వీరి దక్షతకు మెచ్చి ప్రభుత్వం వీరికి సి. ఐ. ఇ. బిరుదము నిచ్చినది. బారువలో జరిగిన నాల్గవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభకును, బెజవాడలో జరిగిన 15 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభకును అధ్యక్షులు.

బారువలో జరిగిన 16 వ కళింగదేశ గ్రంథాలయ మహాసభాధ్యక్షులు.

## శ్రీ ఆరె సుబ్బయ్యగారు

## (1892 – )

జన్మస్థానం గుంటూరు జిల్లా, తెనాలి తాలూకా, కూచిపూడి. రైతుగా జీవితం ప్రారంభించారు. ఆరోజులలో చక్కని సంస్కారం సంపాదించారు. తమ

గ్రామంలోని శ్రీ సరస్వతీ నిలయపు ముఖ్య పూజారులలో ఒకరుగా నుండి దీని అభివృద్ధికి చాల తోడ్పడినారు. గ్రామ పంచాయతీ సభ్యులుగ, పంచాయతీ కోర్టు అధ్యక్షులుగ కొంతకాలం పదవుల నిర్వహించుటే గాక గ్రామ వ్యవహారాలలో పెద్దరికం వహించి నలుగురినీ కూడగట్టుకొని వచ్చినారు. గ్రామంలో ఇటీవల నెల కొన్న కోగంటి వారి హైస్కూలుకు రు 3000/- విరాళమిచ్చుటయే గాక కొంత కాలము దీని కోశాధిపతిగ కూడ నుండినారు.

1920 వ సం. లో కూచిపూడిలో జరిగిన తెనాలి తాలూకా గ్రంథాలయ ప్రతి నిధుల సభ ఆహ్వాన సంఘాధ్యక్షులు.

## శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు

## (1894 -    )

గుంటూరు జిల్లా నరసరావు పేటలో జననం. విద్యాభ్యాసం నరసరావు పేట, బందరు, చెన్నపట్టణం. 1917 లో బి. యల్. పట్టా పొంది 3 సంవత్సరాలు నరస రావు పేటలో న్యాయవాదిగ నుండిరి. ఆసమయంలో అక్కడి మిత్రుల సహాయంతో గ్రంథాలయాన్ని స్థాపించిరి. 1919 వ సం. లో గుంటూరు మండల గ్రంథాలయ సంఘ ప్రధాన కార్యదర్శి పదవిలో నుండి జన సామాన్యంలో రాజకీయ పరిజ్ఞానమును వ్యాప్తి నొందించుటకై చిరుపొత్తములు కొన్ని ప్రకటించిరి. 1920 సం. లో ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘమువారు విజయవాడలో నిర్వహించిన శిక్షణ తరగతికి అధ్యాపకులు. 1921 లో న్యాయవాద వృత్తిని విసర్జించి మహాత్ముని అసహాయోద్య మంలో పాల్గొన్నారు. కొంతకాలం ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు ప్రచురణాధికారి. అటు పిమ్మట ప్రకాశంగారి 'స్వరాజ్య' ఆంగ్ల దిన పత్రికకు సహాయ సంపా దకులు. 1923-27 సం. లలో బందరులోని ఆంధ్ర జాతీయ కళాశాల వైస్ ప్రిన్సిపాలు. ఆసమయంలోనే 'జయంతి' పత్రికను స్థాపించిరి. 1927 లో మదరాసులో సుప్రసిద్ధ ఆంగ్లపత్రిక 'త్రివేణి' ని స్థాపించి నేటివరకు కొనసాగిస్తున్నారు. 1933-34 సం. లలో ఆంధ్రజాతీయ కళాశాల ప్రిన్సిపాలు. 1939-46 సం. లలో మదరాసు శాసన సభ్యులు. 1940-1942 సత్యాగ్రహములలో పాల్గొని ప్రభుత్వ నిర్బంధానికి గురియైనారు. 1949-50 సం. లలో కృష్ణాపత్రిక సంపాదక వర్గములో సభ్యులు. 1956-57 సం. లలో మదరాసులోని దక్షిణ భాషా పుస్తకసంస్థ ప్రధాన సంపాదకులు.

1920 లో గంగవరములో జరిగిన ప్రథమ పల్నాడు తాలూకా గ్రంథాలయ ప్రతినిధుల మహాసభాధ్యక్షులు.

# శ్రీ కలవగుంట వెంకట రంగాచార్యులుగారు

(          )

గ్రంథాలయ ప్రయోజనాలను సమగ్రంగా గ్రహించిన ధీమంతుల కోవలోని వారు శ్రీ వెంకటరంగాచార్యులుగారు. వీరు బి. ఏ., బి. ఇడి. పట్టభద్రులైన పిమ్మట పశ్చిమ గోదావరి జిల్లా బోర్డు యాజమాన్యమునందున్న ఉన్నత పాఠశాలలలో ఉపాధ్యాయులుగా పని చేశారు. గ్రంథాలయ శాస్త్రం పట్ల వీరికి అభిమానం మెండు. తమ విద్యార్థులు పుస్తక పఠనం పట్ల అభిరుచిగలవా రవడానికి వీరు నిత్యం ప్రబోధం చేస్తుండేవారు. తీరిక సమయాల్లో గ్రంథాలయోద్యమ వ్యాప్తికోసం కృషి చేస్తుండేవారు. సౌజన్యం, బోధనాశక్తి, సామర్థ్యం గల మంచి ఉపాధ్యాయుడుగా పరిగణింప బడ్డవారు. ఈ గ్రంథంలోని వీరి ప్రత్యేక వ్యాసం భీమవరం తాలూకా గ్రంథాలయ ప్రథమ సమావేశ సమయమున పంపిన ఆంగ్ల రచనకు అనువాదము. అనువాదకులు కవులు, గ్రంథాలయ సేవకులు నగు శ్రీ కలిదిండి నరసింహరాజు గారు.